## 'సుందర మారుతి'

ప్రథమ ముద్రణ = బహుధాన్య ఉగాది
29-03-1998.

ప్రతులు = 750

ప్రతులకు = టి.పి. శ్రీనివాస రామానుజన్,
బృందావని, సింహాచలం,
విశాఖపట్టణము - 28.



ఈ గ్రంథము

**శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహాయముతో ముద్రించబడినది.**

ముద్రణ :

శ్రీ జీయర్ ప్రింటింగ్ ప్రెస్,
ప్రహ్లాదపురం,
విశాఖపట్టణం - 27.

శ్రీమతే రామానుజాయ నమః

'వాల్మీకి హృదయాభిజ్ఞ'
ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు గారు
విశ్రాంత సంస్కృత విభాగాధ్యక్షులు
షీలానగర్, విశాఖపట్నం - 12.

## మంగళాశాసనము

హనుమంతుని ధ్యానించని వారు, ప్రార్థించని వారు చాలా అరుదుగానుంటారు. సకల కార్యసిద్ధికి హనుమత్సేవ, సుందరకాండ పారాయణం ప్రధానంగా అన్ని మతములవారిచేత ఆచరింపబడటం చూస్తున్నాం. సుందరకాండ చదివి ఎన్నో విధాల ప్రయోజనాలు పొందిన వారెందరో ఉన్నారు. కేవలం శబ్ద మంత్రోచ్చారణాదే కూడా ఫలమునిచ్చే శక్తి శ్రీరామాయణమునకున్నది. "ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితం" అని నారదుడు వాల్మీకికి వేదసమ్మితంగా రామాయణాన్ని మంత్రముగ ఉపదేశించుటచేత, అర్థాన్ని ఎరిగి ఆచరించుట చేత కూడా ఫలితాన్నిస్తుందని వివరించేడు. శ్రీరామాయణమంతా పారాయణ చేయలేకపోయినా ఒక్క సుందరకాండనైనా ప్రతివారు పారాయణ చేసి తమ అభీష్టాలను సాధించుకొంటున్నారు. హనుమకున్నన్ని ఆలయాలు శ్రీరామునికి కూడా లేవేమో అనిపిస్తుంది.

ఆ సుందరకాండలోను ప్రధాన ప్రతిపాద్యుడైన మారుతి యొక్క సౌందర్యాన్ని భిన్నకోణాలనుంచి పరిశీలించి ఆ స్వరూపాన్ని మనముందు చిత్రించాడు చి॥ శ్రీ శ్రీనివాస రామానుజమ్. అతడు ఉత్తముడు, ప్రతిభాశాలి, బహుగ్రంథ పరిశీలకుడు, నిశితమైన విమర్శ కలవాడు. సుందరకాండలో నాయకుడుగానున్న హనుమను ఈ "సుందర మారుతి" అను గ్రంథమున పన్నెండు, పదమూడు విభాగములుగా నిరూపించినాడు

చి॥ గోపాలాచార్యులు ఈ ''సుందరమారుతి''ని తెచ్చి నాకిచ్చి చూడమన్నాడు. రెండువ్యాసాలు చదివి సుందరకాండ కథయే అనుకున్నాను. కానీ అంతా చదవమన్నాడు కదా అని చదివేను. మేమందరం ''అబ్ధిర్లంఘితఏవ వానరభటైః'' అన్నట్లు సుందరకాండను పైపైని చూచినవారమే అని తెలిసినది. విషయము, భాష, నిరూపణ విధానము, ప్రామాణికత, సామర్థ్యవంతముగా సాగినది. చాలా ఆనందమైనది. అన్ని వ్యాసములు ప్రశంసనీయములే కాని, అందుకొన్నిటిలో ఆతని పాండిత్యం, పరిశ్రమ కన్పట్టును. మంత్రిగా హనుమ, దూతగా హనుమ, వాగ్మిగా హనుమ, భక్తుడుగా హనుమ అనునవి నన్ను పరవశింపచేసినవి. వేదాంతదేశికులు అందించిన రూపకానుసారముగా నేను ఆధ్యాత్మిక దృక్పథంలో శిష్యాచార్య సంబధాన్ని, ఆచార్యుడు చేయు చేతనోజ్జీవనాన్ని ఇందులో భావింప గలిగేను కానీ, ఇన్ని కోణములలో పరిశీలింపలేదు. ఇది మారుతిపై ఒక సమగ్రమైన దర్శనము.

విభాగము చివర ఇచ్చిన అధో జ్ఞాపికలు, ప్రతిభాగములోవారు చూపిన వాల్మీకి శ్రీరామాయణ శ్లోకములు చదువుకొనిన చాలును. క్రొత్తక్రొత్త విషయములెన్నో మనకు తెలియును. పదప్రయోగంలో, సమాసఘటనంలో, విషయ నిరూపణలో, ఉపపత్తి ప్రకటనలో, ప్రమాణికతలో ఈ గ్రంథము అనన్వయాలంకారమునకు నిదర్శనముగా సాగినది. ఇది చదివిన తర్వాత, వీరు డాక్టరేట్ పట్టమునకు సమర్పించిన శ్రీ గోవిందరాజ వ్యాఖ్య పరామర్శ బయల్పడినచో రామాయణ రసజ్ఞులకు ఎంతో ఉపయోగపడునని భావించుచున్నాను.

చిరంజీవి రామానుజం శ్రియఃపతి కటాక్షంచే శ్రీసంప్రదాయమునకు ఇంకా ఇంకా సేవచేయుటకు శ్రీ వరాహ లక్ష్మీ నృసింహ స్వామి అనుగ్రహించు గాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

(సం.) శ్రీ అప్పలాచార్యులు

డా॥ జి.ఏ. శర్మ, ఎం.ఏ; పి.హెచ్.డీ;
సంస్కృత శాఖాధ్యక్షులు,
సంస్కృత విభాగం, ఆంధ్రవిశ్వకళా పరిషత్తు,
విశాఖపట్నం.

## అభిప్రాయం

హనుమ అనగానే ఆత్మవిశ్వాసం, మనోబలం కలుగుతాయి. భారతజాతిలో ఆబాలగోపాలమునకు ఆరాధ్యమగు వ్యక్తిత్వము, హనుమది. మానవ శ్రేయస్సును, పరహితమును నిరంతరము అభిలషించుట హనుమత్సందేశము. ఆర్తత్రాణ పరాయణత్వము, సంకల్పసిద్ధి, ధ్యేయైకనిష్ఠ, ధర్మతత్పరత ఇత్యాది విశిష్టగుణ మూర్తిత్వము హనుమంతుని స్వరూపం.

పై విశేషములను అనేక కోణములలో పరిశీలించి లోకమును తరింపచేయు ఉద్దేశ్యముతో శ్రీరామానుజం 'సుందర మారుతి' అను గ్రంథమును అందు పొందుపరచిరి. ఈ గ్రంథము నిత్యము పారాయణయోగ్యమై యున్నది. ఆధ్యాత్మిక బలము కలిగింపజేసి మానవులను ధర్మకార్యోన్ముఖులుగా చేయుటకు ఉపయుక్తమగుచున్నది. శ్రీరామానుజం సదా ప్రశంసనీయులు. వారి కార్యము సప్రమాణమై యున్నది.

సం॥ (జి.ఏ. శర్మ)
22-03-98.

✆ : 548809

ప్రవచన ప్రభాకర, ఉపన్యాస కేసరి, భాగవత రత్న
**జి. వి. యస్. సుబ్రహ్మణ్య శర్మ** M.A.
31-8-62, రవి భవనం, బంగారమ్మ మెట్ట,
విశాఖపట్టణము - 530 004.

## అభినందనము

చి॥ టి.పి. శ్రీనివాస రామానుజం నా కత్యంత ప్రీతిపాత్రుడైన సచ్ఛిష్యుడు. వినయము, విధేయత, గురుగౌరవము, భక్తి ప్రవచన పాటవము మొదలగు సద్గుణములు ఈ చిరంజీవికి వంశపారంపర్యముగ వచ్చిన సహజగుణములు. విద్యాభిరుచి, జిజ్ఞాస, విషయగ్రహణ శక్తి, పరిశోధన ప్రావీణ్యము ఈతనికి విద్యాభ్యాసవశమున సంక్రమించిన శ్లాఘ్య గుణములు.

రామానుజం "సుందర మారుతి" యను వ్యాస సంకలనమును తయారుచేసి పంపగా స్థాలీపులాకన్యాయముగా చదివి యానందించితిని.

ఈ పుస్తకమునకు పెట్టిన పేరే ఒక విచిత్రమైనది. లోకంలో సాధారణంగా అనాకారులను ప్రస్తుతించుటకు "కోతి ముఖంవాడు" అంటారు. కాని ఈ రచయిత మారుతిలోని సర్వవిధ సౌందర్యములను చక్కగా ఆస్వాదించి, మనకందరకు అనుభవములోనికి తెచ్చినాడు.

సుందరకాండ నామౌచిత్యమును తెలుపు నొక శ్లోకమునందు "సుందరః కపిః" అను వాక్యమున్నది. కపియగు హనుమకు కాయిక, వాచిక, మానసిక సౌందర్యములున్నవని ఈ వాక్యమునకొక అర్థము.

సుందర శబ్దమునకు = సుం = దుఃఖమును, దరః = కోసివేయువాడు అను అర్థము కూడ కలదు. సీతను దర్శించి ఆమె దుఃఖమును, ఆమె వార్తను శ్రీరామునకెఱిగించి, ఆయన దుఃఖమును, సుగ్రీవాది వానర వీరుల దుఃఖమును, సుందరకాండనే మంత్రము చేసి ఆధ్యాత్మికపరుల సాంసారిక దుఃఖమును, పరిహరించుటచే హనుమ సుందరుడైనాడు. అట్టి సుందరుని చరితమును అన్ని కోణముల నుండి పరిశీలించి ఈ రచయిత "సుందర మారుతి" యను వ్యాసమాలికను సంకలన పఱచి ధన్యుడైనాడు. సుందరుని సౌందర్య మందఱికి అంత సులభముగా అంతుపట్టదు. సామాన్యుల ఆలోచనల కందదు. ఆ సౌందర్యమును చూచుటకొక దార్శనిక దృష్టి కావలెను. అది వి॥ రామానుజంకు అలవడినది. తత్పర్యవసానమే 10 కోణముల నుండి మారుతి సౌందర్యము నందించు ఈ వ్యాస సంకలనపు ఆవిర్భావము.

ఈ సంకలన గ్రంథమునందు ఆధ్యాత్మిక సౌందర్యమే కాక సాహిత్య సౌందర్యము కూడ శోధింపబడినది.

ఇక గ్రంథ విషయము నొక్కింత గమనింపగా, రచయిత అన్నట్లు "ఇందులో ఎన్నో సంజీవ సూక్ష్మీకాంశములు" చోటు చేసికొనినవి. గోవిందరాజీయ శ్రీమద్రామాయణ వ్యాఖ్యా వైశిష్ట్యములెన్నో ప్రదర్శింపబడినవి.

ఈ గ్రంథమునందలి భాష శిష్టవ్యావహారికములో సాగినది. పండితైక వేద్యముగా గ్లి దీని యందలి రచనాశైలి సరళతరమై యుండినచో సర్వసుగమమై యుండెడిది.

కాలక్రమేణ అనుభవమును గడించి, రచయిత శైలి ఇతోధిక పరిపుష్టినందగలదని ఆశించుచున్నాను. "హనుమను ప్రసన్నం చేసుకోవాలనే

ఈ వ్యాసాన్ని సీమితం చేస్తున్నాను'' అని రచయిత అన్నాడు కనుక ఈ ప్రతిజ్ఞకు సంతుష్టుడై ఆ సుందర మారుతి శ్రీమాన్ రామానుజమునకు విద్యా, రూప, మనో, వాక్, శీలములయందు సంపూర్ణ సౌందర్యమును కటాక్షించును గాక! అని అభినందించుచున్నాను.

ఇట్లు


విశాఖపట్టణము
22-03-98.

**జి.వి.యస్. సుబ్రహ్మణ్య శర్మ**
విశ్రాంత సంస్కృత శాఖాధ్యక్షులు
ఏ.వి.యన్. కళాశాల

# మున్నుడి

ఇవన్నీ వ్యాసాలు. హనుమ పాత్ర ననుశీలిస్తూ రాసినవి. ఒకటిన్నర పుష్కరాల క్రితం శ్రీకారం చుట్టేను. ఇంచుమించుగా హనుమజ్జయంతి కో వ్యాసం చొప్పున రాస్తూ వచ్చాను. వాల్మీకి రామాయణమే ప్రమాణంగానూ, గోవిందరాజీయమాధారంగానూ గ్రహించాను. హనుమ కనవచ్చే ఘట్టాలే అవగాహించాను వాల్మీకి హృదయాభిజ్ఞులైన శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారి తత్త్వదీపిక నాకు కరదీపికే అయింది. అడపాతడపా రాసినందువల్ల పునరుక్తులు దొర్లాయి, క్వాచిత్కంగా.

హనుమ నిన్ని కోణాల ఆవిష్కరించే ప్రయత్నంలో నా ప్రణాళికను పరిష్కరిస్తూ, ముద్రణ స్థితివరకు నన్ను నడపినవారు, మా నాన్నగారు శ్రీఉ.వే.ప్ర. శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్య స్వామివారు.

'భాషా, శైలీ బాగున్నాయి, మానకుండా వ్రాయి' అంటూ ప్రోత్సహించినవారు శ్రీఉ.వే.ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు.

**ఆ పెద్దలిద్దరికి సప్రశ్రయ ప్రణతిపూర్వకంగా కృతజ్ఞతల నివేదించుకొంటున్నాను.**

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో దీన్ని ముద్రించగలిగాను. అర్థంగా నిర్ధరించిన పెద్దలకీ, అధికారులకూ, ఉద్యోగివర్గానికీ **కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.**

దీనికి పేరు పెట్టినది, మా తండ్రిగారు శ్రీరామచంద్రాచార్య స్వామివారు. ముఖ పత్రంకై వారి తిరువారాధనలోని సుందర మారుతి

ఛాయాచిత్రాన్ని అనుగ్రహించిన వారు మా పినతండ్రిగారైన శ్రీ ఉ.వే. ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం రాఘవన్ స్వామివారు (శ్రీకూర్మం). వారికి **కృతజ్ఞతానివేదనం కావిస్తున్నాను.**

'హనుమత్సేవ'లో నన్ను ప్రోత్సహించిన మిత్రులు శ్రీ యస్. యస్. లక్ష్మణరావు గారి **సౌజన్యానికి ధన్యవాదాలు తెలియపరుస్తున్నాను.**

పుస్తకముద్రణలో అహరహం నన్ను ప్రోత్సహించిన మిత్రులు, సహవ్రతులు శ్రీ చంద్రశేఖర రావు గారు, ప్రూఫులు సవరించి సత్వరముద్రణకు సహకరించిన సోదరులు శ్రీదాశరథి, శ్రీరాజగోపాల శర్మలు, అందంగానూ, తొందరగానూ ముద్రించి యిచ్చిన ప్రెస్ వర్కర్లూ, యజమాని శ్రీమాన్ కె. అప్పారావు గారూ, వీరందరికీ **కృతజ్ఞతాభివందనాలు సమర్పించుకొంటున్నాను.**

ఇంకా ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ సహకరించిన మిత్రులు, సన్నిహితులు, హితైషులు ఎందరో ఎందరెందరో, అందరికీ అందరందరికీ **కృతజ్ఞతాభారావనతాంసంతో అంజలిస్తున్నాను.**

ఈ పుస్తకాన్ని చదివి తమ **'మంగళాశాసనములు'** కృపచేసిన శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారికి దాసోహములతో కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను. అలాగే **'అభిప్రాయం'** అందించిన ఆచార్యులు శ్రీ జి.ఏ. శర్మ గారికి, నాపట్ల వాత్సల్యంతో **'అభినందనము'** అందించిన (మా సంస్కృతం మాస్టారు) శ్రీ జి.వి.యస్. సుబ్రహ్మణ్య శర్మ గారికీ సప్రశ్రయ ప్రణామాలు సమర్పిస్తున్నాను. పాఠక లోకానికి నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

29-03-1998

శ్రీనివాస రామానుజన్



# సుందర మారుతి

(వ్యాస సంకలనం)

శ్రీనివాస రామానుజమ్



# సుందర మారుతి

## విషయసూచిక



## అనుబంధం -

# ఆచార్యునిగా హనుమ

కావ్యప్రయోజనముల నుగ్గడించుచు లాక్షణికులు '.... ఉపదేశయుజే'[1] అని అన్యతమ ప్రయోజనమును పేర్కొనినారు. ఔపదేశిక ప్రతిపత్తి ఆ పరంపరలో చివరదే కాని, చిన్నది కాదు. (Last but not the least!) ప్రయోజనాంతరాపేక్షయా ఉపదేశ ప్రయోజన ప్రముఖమైన కావ్యము బహుళాదరణ పాత్రమవటంలో ఆశ్చర్యమేం లేదు.

సరి, ఈ కావ్యాలకి సహృదయమహోదయులు రసజ్ఞ మనోజ్ఞమైన వ్యాఖ్యల్ని సంతరించటం విశేషం. వాటిని వాటి పరిధి నుండి బయటకి తీసి వ్యాఖ్యాతృబుద్ధి విశేష సాధ్య విచిత్రవల్గనాలు ఎన్నో చేయటం గమనిస్తాం. ఇందులో కువ్యాఖ్యా విషమూర్ఛితాలుండవచ్చు. సంజీవన్యుజ్జీవకా లుండవచ్చును. ఏమైనా, వ్యాఖ్యాతృబహుముఖ ప్రతిభా ప్రతిభానం అక్కడ సమున్మీలితం కాకమానదు. అందుకే 'వ్యాఖ్యాతా వేత్తి నో కవిః' అన్నారు. కానీ, సతికుడ్యే చిత్రరచనా ! సరే, అదలా ఉంచితే –

కావ్యాల్ని వ్యాఖ్యానించటంలో అనేక పద్ధతులు, పరిగణనలు ఉన్నాయి. సామాన్యంగా వ్యాఖ్యానము పంచలక్షణమన్నా[2], అంతస్సారాన్ని సమర్థవంతంగా వెలికి తీసి సరససుందరంగా వెలార్చటంలో ప్రజ్ఞ కనపరచినవారూ ఉన్నారు. వారు కేవలం వ్యాఖ్యాకరణం[3] చేతనే సాహితీ ప్రపంచంలో రుచిర స్థానాన్ని పొందారంటే, వారి ఉపజ్ఞ ఎంతగా రసజ్ఞులనలరించిందో మనమూహించవచ్చు. వ్యాఖ్యాతృశిరోమణి మల్లినాథుడు! ఆయన చేతి చలవతో లేచి నడయాడిన కాళిదాసవాణి కావ్యపాళికల కేళికయ్యె పాలింపసాగినది. వ్యాఖ్యాన సంప్రదాయమున కొద్దికమై హద్దుల నేర్పరచి, తరువాతి వారికి వొరవడిని తీర్చిదిద్దిన ఘనత ఈయనదే! కావ్యారణ్యాల కళాఖండాల నేరు రసమాన్యుల కసామాన్యమైన కరదీపిక ఐనది వీరి సరళి !

రామాయణ వ్యాఖ్యాత గోవిందరాజులూ అట్లాంటి వారే ! వీరి వ్యాఖ్యాన పద్ధతి, దానిలోని అందచందాలు, అసలా నిర్మాణ విచక్షణతా – విలక్షణతా ... ప్రత్యేకముగా సందర్శింప వలసినవి. వీరు వాచ్యార్థములతో పాటు వ్యంగ్యమునకూ చాల ప్రాముఖ్యమునిచ్చి సర్వశ్రుతి మనోహరముగ వ్యాఖ్య సంతరించిన తీరు ఆశ్చర్యజనకం !

రామాయణం ఆదికావ్యం. కావ్యాంతరాల వలె కాక – '' వేదః ప్రాచేతసాదాసీత్ '' అని ఖ్యాతి గాంచినది. వేదోపబృంహణమైనది. కనుక దానికి తత్త్వప్రధానంగ వ్యాఖ్య వెలార్చాలని, ఆ భిత్తిక పైనే ఆయా పాత్రల్ని చిత్రించారు. ఈయన వ్యాఖ్యాత కదా ! ఈయన చిత్రించడమేమిటి? అంటే, యథార్థచిత్రణ మీయనదే ! చాలా చమత్కార చారువీరచన. విచిత్ర వర్ణ సంవలిత చిత్ర సంకలితమీ రచన. ఈ చిత్రాలకి ప్రసాధన సామగ్రి ప్రసాదించినవారు దివ్య ప్రబంధ సంప్రదాయాభిజ్ఞులు.

'ప్రాచేతసప్రతిజ్ఞాతములైన రామచంద్రుని షోడశ కల్యాణ గుణములకు సంప్రదాయ సరణిలో నిర్వాహములు నెరపుటే కాక, సౌమిత్రిని శేషత్వప్రతీకగా, భరతుని పారతంత్ర్యమునకు తార్కాణగా, శత్రుఘ్నుని భాగవత నిష్ఠకుదాహరణముగా, విభీషణుని శరణాగతికి విశిష్ట దృష్టాంతముగా, హనుమంతుని ఆచార్య ప్రతిపత్తి కాదర్శముగా .....' ఇట్లు పలుతెన్నుల విజ్ఞులగు రసజ్ఞుల సన్నుతి కెక్కు తీరున చమత్కార చారువులు, ప్రతిపద రమణీయములు ఐన పరిష్కారములు ప్రసాదించిన తావులు పరిగ్రహించ వలసినవి.

దివ్యప్రబంధ కాలక్షేపావసరముల వారొనర్చిన నిర్వాహ స్వాపదేశము లుపాధిగా, అదే ఉపాదాన సామగ్రిగా పరివర్ధిత పరిష్కరణములతో సమగ్ర సుందరము, నిత్యప్రత్యగ్రము అయిన, అనన్వయానికి ప్రబలోదాహరణమన దగిన వ్యాఖ్యానాన్ని వెలయించారు, శ్రీ గోవిందరాజులు (పద్మావతీ చరణచారణ చక్రవర్తీ, వాసుదేవ రతికేళి కథా ప్రబంధా, అయిన జయదేవుని ద్రుహిణ గృహిణీ చరణ మంజీర

శింజాన ధ్వనుల మాటునున్న సరస సౌందర్య సముల్లసద్రూప సమావిష్కరణ దృష్టిని మనం ఈయన పాత్రావిష్కరణంలో గమనించవచ్చు !) అయితే వీరు అందాలనందించిన తీరు కంటే, వీరు పాత్రలను వివరించిన, వ్యాఖ్యానించిన సొరు సమీక్షించటం నా అభిమతం. అయితే సమగ్రంగా వైదుషీవ్యగ్రమైన వారి వ్యాఖ్యానాన్ని తరచే చేవలేక, ప్రస్తుతానికిహనుమని ప్రసన్నం చేసుకోటానికే ఈ వ్యాసాన్ని సీమితం చేస్తున్నాను.

'రామో విగ్రహవాన్ ధర్మః!' ఇది ప్రచురమే కాదు రుచిరమూ, శ్రీరామ వ్యక్తిత్వానికి నిరుక్తి వంటిదీను. అలాగే, ఇతరులలోనూ వారి వైయక్తిక విలక్షణ ధర్మాలనుపలక్షించి, తదనురోధంగా తత్తత్ పాత్రలను విశ్లేషించడం విశేషం. హనుమలో దౌత్యాన్ని వారు సమర్థించిన తీరు ఆశ్చర్యావహం, ముదావహమూను !

హనుమ ఆచార్యుడని, సీతారాములు జీవేశ్వరులని వీరి నిర్వాహం. ఆచార్య పదం సలక్షణ విలక్షణము. ప్రథమతః ఆచార్య పదమును పరశీలింతము.

విద్యాబోధన సామాన్యమైన వృత్తి నిర్వాహక వాచ్యములైన[4] ఉపాధ్యాయ, అధ్యాపకాది పదములకన్న విశిష్టమైనది.

ఉపాధ్యాయో ఽధ్యాపకోఽథస్యాన్నిషేకాదికృద్గురుః
మంత్రవ్యాఖ్యాకృదాచార్యః ..... అని అమరసింహుడు[5]

ఉపాధ్యాయుడు, అధ్యాపకుడు, గురువు, ఆచార్యుడు .... అను మాటలను సమానార్థకాలుగా వాడుతున్నా, 'ఉత్తరోత్తరం బలీయః' అన్నట్లు ఒకదాని కంటె ఒకటి ఉత్తరోత్తర విస్తృతి కలవివి.

ఉపాధ్యాయుడు అంటే చదువు చెప్పువాడు అనే సామాన్యర్థం తోపాటు వేదమును చదివించు వాడనీ నిఘంటు నిర్ణయం.

అధ్యాపకత్వం వేదాధ్యాపనమేననీ అంటోంది. గురు శబ్దాల వల్ల గౌరవ్యాన్యతమత్వాత్ లాక్షణికంగా తద్వ్యపదిష్టుడు అవుతున్నాడు, ఉపాధ్యాయుడు లేక అధ్యాపకుడు. పిత్రాద్యర్థాలతో పాటు ఉపాధ్యాయార్థమూను -

'సరాజ్యం గురుణాదత్తం .....' (రఘు - 4 - 1)
'తౌ గురు ర్గురు పత్నీచ ప్రీత్యా ప్రతి ననందతుః' ('' - 1 - 57)

గురువర్తి, గురువాసి అనే పేర్లు గురుశుశ్రూషారతుడైన శిష్యునికి పేర్లుగా నిఘంటువులు పేర్కొంటున్నాయి.

గురు శబ్దానికి ప్రత్యేకంగా వేదాధ్యాపకుడనే అర్థం -
'సగురుః యఃక్రియాః కృత్వా వేదమస్మై ప్రయచ్ఛతి' అని యాస్క నిరుక్తి (1-34)

ఒకనాడు దేశంలో విద్యంటే వేదవిద్యే కనుక, ఇవన్నీ తదర్థ పర్యవసితాలైనా, వీటిలో తారతమ్యాన్ని మనం గమనింపవచ్చు.

**ఏకదేశముపాధ్యాయః -**
ఏకదేశంతు వేదస్య వేదాంగాన్యపి వా పునః
యోऽధ్యాపయతి వృత్త్యర్థం ఉపాధ్యాయః స ఉచ్యతే (మనుస్మృతి)

ఉపనయనాదికం చేసి వేదాన్ని చెప్పేవాడిని ఆచార్యుడనీ, వృత్తిగా జీవనోపాధికోసం అధ్యాపనం చేసే వాడిని ఉపాధ్యాయుడనీ విష్ణుస్మృతి పేర్కొంది.

అధ్యాపనం చ త్రివిధం ధర్మార్థ మృక్థకారణమ్,
శుశ్రూషాకరణం చేతి త్రివిధం పరికీర్తితమ్.

మిగతా పదాలకంటే ఆచార్య పదం[6] విస్తృతంగాను, నిర్దిష్టంగాను వేదాధ్యాపకుని పట్ల ప్రయుక్తం –

'ఆచార్యః వేదమనూచ్యాంతే వాసినమనుశాస్తి,'[7] 'ఆచార్య దేవోభవ .....' ఇట్లా చాలా చోట్ల గమనించవచ్చు. ప్రత్యేకంగా వేదాన్ని అధ్యాపనం చేసేవాడు ఆచార్యుడు. అసలు అధ్యయనమంటే = చదవటం = ముఖ్యంగా వేదాల్ని చదవటమే ! మొదటి చదువులవి ![8]

'అధ్యయనంచ – అక్షరమాత్ర పాఠః' 'సార్థాక్షర గ్రహణమ్' అన్న వైదిక, మీమాంసకుల మీమాంసలో రెండవదే సత్యం సమీచీనం అనిపిస్తుంది. ఎందుకంటే –

యథా పశుర్భారవాహీ న తస్య భజతే ఫలమ్,
ద్విజస్తదర్థా నభిజ్ఞో న వేద ఫలమశ్నుతే.
[9]యథాపశుర్భారవాహః కిలాభూదధీత్యవేదం నవిజానాతియోర్థం,
యోర్థజ్ఞ ఇత్ సకలంభద్రమశ్నుతే నాకమేతి జ్ఞానవిధూత పాప్మా.

కనుక, సార్థవేదవేదాంగాధ్యాపనచణుడే ఆచార్యపదవాచ్యుడు. అందుచేతనే గుర్వాద్యన్య పదాలకంటే విస్తృతము, విశిష్టము మాత్రమే కాక విలక్షణమైనదిది.[10] కేవల వేదాధ్యాపన చణత మాత్రమే కాక, అనుష్ఠాన శాలిత కూడా కలదిది. కనుకనే ఆదర్శమూర్తియై అనుసరణ స్ఫూర్తియైనాడు, ఆచార్యుడు. ప్రాపకోపాయములలో చరమోపాయమై, పరమోపాదేయమై నిల్చినదీ మూర్తియే !

శ్రీరామాయణమున హనుమ ఆచార్యుడు. ఆచార్యుడనగా జీవేశ్వరుల సంఘటిత పరచువాడు. ఇరువురికిని పరస్పరాభిముఖ్యమును, ఆనుకూల్యమును ఏర్పరచు మహానుభావుడు. దోషభూయిష్టమైన సంసారజుష్టమైన జీవునికి భవబంధచ్ఛేదనోపాయోపదేష్ట. సీతారాముల మధ్య ఘటకశక్తిగా నుండి వారినేకత్ర చేర్చుటకు పరిక్రమించి, పరిశ్రమించిన హనుమ నాచార్యునిగా ప్రతిష్ఠించుటకు హేతుభూతమైనవి సుందరకాండమందలి రెండు శ్లోకములు ! వాటిని పరిశీలించి, హనుమ ఆచార్యకత్వము నవగత మొనర్చుకొను ప్రయత్నమే, ఇది -

తతోరావణనీతాయాః సీతాయాః శత్రుకర్శనః,
ఇయేష పద మన్వేష్టుం చారణా చరితేపథి. (1-1)

తతః = తరువాత, అనగా ముద్రాప్రదాన పూర్వక భగవదను జ్ఞానలాభానంతరము, హనుమ గవేషణవ్యగ్రతతో కార్యము నకుపక్రమించినాడు. అన్వేషణము ఆకాశమున ! ఆకాశమున అన్వేషణమెట్లు పొసగును ? అంటే, ఆకాశమున సైతము పదన్యాసాన్వేషణ సమర్థుడీయున, అని అతని అన్వేషణ సామర్థ్యమును, బుద్ధి చాతుర్యమును ప్రశంసించినారు, వ్యాఖ్యాతలు. అంటే, దీనివలన శిష్యస్థానాన్వేషణ పర గురుస్వరూప మావిష్కృతము. [11]

కిష్కింధాకాండలో - సమస్త కల్యాణగుణాకరత్వము సర్వథా మిత్ర సంరక్షణ కార్యము లేదా సర్వరక్షణ ప్రవృత్తుడైన విష్ణువుయొక్క ఆచార్యరూప పురుషకారలాభము ప్రోక్తము. సుందరకాండనారంభించుచు -

దౌత్యనిర్వహణమున అవశ్యప్రవర్తనాంశములు ప్రపంచించెను. పతివ్రతా ధర్మములు ప్రస్తావించెను. ఇట ఆచార్యకృత్యముపలక్షితము. ఇచట హనుమ శత్రుకర్శనుడనుట ఔచితీసహము. ఏలననగా, అగమ్యగోచరమైన చోటుకి, అందునా తామసులైన రక్కసుల నడుమ నడుగిడున్నవాడు శత్రుకర్శనుడు కాకున్నచో

ఎట్లు కుదురును ! అందుచేత, అది ఉచితమే. కానీ, ఆచార్య పరముగా దీని నెట్లు అన్వయింపగలము ? అనగా – అజ్ఞాన నివర్తన శీలి కనుక ఆచార్యుడు శత్రుకర్శనుడే !

'గుశబ్దస్త్వంధకారః స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః ,
అంధకార నిరోధిత్వాత్ గురురిత్యభిధీయతే .

అని కదా, గురుపదనిరుక్తి !

ఈయన విహరణవీధి – చారణాచరిత పథం. అనగా, చారయంతి ఆచారయంతి ధర్మానితి చారణాః, అని – పూర్వాచార్యులన్న అర్థమవగతము. కాగా, వారు చరించిన మార్గమున చరింపనుద్యమించెను. 'మహాజనోయేన గతః స పంథాః ' అని సదాచార శీల ద్యోతకమిది.

ఇక, ఈయన వెతకవలసినది ? అనాది భగవత్పరతంత్ర చేతన, సీత ! ఇట సీతా శబ్దము వలన అయోనిజత్వోక్తి, తద్వారా[12] స్త్రీలింగేన పారతంత్ర్యము ధ్వనితము ! 'పదమనగా[13] చోటు, గుర్తు. ఇచట సంసార మండలం లేదా సాత్త్వికసంభాషణాది చిహ్నం.

విష్ణోః కటాక్షశ్చాద్వేష ఆభిముఖ్యంచ సాత్త్వికైః ,
సంభాషణం షడేతాని త్వాచార్య ప్రాప్తి హేతవః .

'పద' మనగా – వ్యవసాయము. అనగా భగవత్ప్రాప్తి. అధ్యవసాయమున అన్వేషించుటకు, అనగా ఇచ్చట ఆచార్యుని అన్వేషణం కేవలం జీవునియొక్క భగవదాభిముఖ్యమును, భగవత్ప్రాప్తీచ్ఛను గమనించుటకే. ఉపదేశగ్రహణ యోగ్యత వీనియందున్నదా ? అది లేని వారికి ఉపదేశం వ్యర్థం. ప్రత్యుత అనర్థం అనేక విధాలుగా ! భవబంధాల్లో ఇరుక్కుని, కంఠదఘ్నంగా సంసార జంబాల పటలమగ్నులై –

చచ్చుచు పుట్టుచున్ మరల చర్విత చర్వణులైనవారికిన్

చెచ్చెర పుట్టునే ఒరులు చెప్పినసైన [14] .... అన్నాడు ప్రహ్లాదుడు. 'గురువచన మలమపి సలిలమివ మహదుపజనయతి శ్రవణస్థితం శూలమభవ్యస్య ...' అని శుకనాసోపదేశం[15]. (గురుఃహితాహిత ప్రాప్తిపరిహారోపదేష్టా - వ్యాఖ్యాతలు)

శుశ్రూషారతునకు, సుధృఢమైన అధ్యవసాయమున్న వానికి మాత్రమే ఉపదేశించాలి. ఎవరు ఉపదేశార్హులో, ఎవరు కారో - వారిపట్ల ఆచార్యవర్తన మెట్లుండవలెనో పెద్దలు నిర్దేశించారు.[16]

(2) త్రిజటా స్వప్నవృత్తాంతమున రామవార్తాశ్రవణ సూచక నిమిత్తభూతమైన శుభశకునాలను నిరూపిస్తూ -

పక్షీచ శాఖానిలయః ప్రహృష్టః పునఃపునశ్చోత్తమ సాంత్వవాదీ,
సుస్వాగతాం వాచ ముదీరయానః పునః పునశ్చోదయతీవహృష్టః

అన్నాడు ఆదికవి. రామాయణం ఆదికావ్యమే కాదు. ఉత్తమ కావ్యం. రసోత్తమ కావ్యం ! ఆలంకారిక నిబంధనలను బట్టి కావ్యత్రైవిధ్య మంగీకృతం, ఉత్తమాధమ మధ్యమత్వం చేత. వాచ్యాతిశాయి వ్యంగ్యమున్నది ఉత్తమం. దాన్నే ధ్వని అంటారు. ఎక్కడ వాచ్యానతిశాయి వ్యంగ్యమో అది మధ్యమం. దాన్ని గుణీభూత వ్యంగ్యం అన్నారు. అసలు వ్యంగ్యమే మృగ్యమైనది అధమం. లేదా చిత్రకావ్యమన్నారు. ఇలా కావ్యత్రైవిధ్యం నిరూపించారు. వ్యంగ్యం మళ్ళా పద, వాక్య, ప్రబంధగతమై మూడు రకాలుగా గోచరిస్తుంది.

రామాయణం సర్వథా ఉత్తమం. కనుకనే ఉత్తమోత్తమమైన వ్యంగ్యార్థాన్ని అనుసరించి మనం ఈ అర్థాలనీ, సొగసులనీ, స్వాపదేశాలనీ, నిర్వాహాలనీ, పరిష్కారలనీ చేస్తున్నాం. ఈ సుందరకాండ ప్రబంధంలో అనాది భగవత్సంబంధం

గల చేతనుని యొక్క ఉజ్జీవనప్రవృత్తుడైన ఆచార్య ప్రవృత్తి అభివ్యంజితం అని, ఆచార్యులు, వ్యాఖ్యాతలు రసజ్ఞమనోజ్ఞంగా, తమ పరినిష్ఠితార్ధ విషయోన్మేష ఐన వైపశ్చితిని పణంగా పెట్టి నిరూపణం చేశారు. ఈ శ్లోకవ్యాఖ్యకు దారరమణీయమైన ఉపాధి నేర్పరచారు. లంకాపదముచే శరీరము ద్యోతితము. ఏకాక్షీప్రభృతులు ఇంద్రియములు. రావణ కుంభకర్ణు లహంకార మమకారములు. ఇంద్రజిదాదులు కామక్రోధాదులు. తాదృశలంకా నిరుద్ధసీత – చేతనుడు ! ఆ చేతనునికి భగవద్ జ్ఞానోపదేష్ట = ఆచార్యుడు.

ఆ ఆచార్యలక్షణములను ఈ శ్లోకమున సూచిస్తున్నారు.
ఉభాభ్యా మేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాంగతిః ,
తథైవ జ్ఞానకర్మాభ్యాం నియతా పరమాగతిః .

అని, అన్నందువల్ల – పక్షి శబ్దంచే, గమన సాధనత్వం చేత జ్ఞాన–కర్మలు సూచింపబడినట్లు గ్రాహ్యాం ! జ్ఞాన కర్మల అంగాంగి భావముచే సముచ్చయము వివక్షితము. ఇదే ఆచార్య జ్ఞాపకము – ఎట్లనగా ,

ఆచినోతి హి శాస్త్రార్థాన్ ఆచారే స్థాపయత్యపి,
స్వయ మాచరతే యస్మాత్ తస్మాదాచార్య ఉచ్యతే.

వేద శాస్త్రములలో చెప్పిన విషయములను తెలిసికొనవలెను. తెలిసికొనిన వాటిని తానాచరింపవలెను. ఇతరులచే ఆచరింపజేయువలెను. అట్టివాడు, ఆచార్యుడు.

'శాఖానిలయః' అన్నపుడు, శాఖాశబ్దముచే వేదశాఖలు, నిలయశబ్దముచే తదేకపరత్వము గ్రాహ్యములు.

'బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదోఽధ్యేతవ్యః జ్ఞేయశ్చ'[17] అని చెప్పినట్లు వేదాధ్యయనం నిష్కారణ ధర్మం. నిత్యకర్మ, సంధ్యావందనము

వలె. అది చేసినందువల్ల కలిగే ప్రయోజనము కన్న చేయనందువలన వచ్చు ప్రత్యవాయము హెచ్చు. అందుచే అవశ్యాచరణీయం అధ్యయనము. జ్ఞేయశ్చ అనుటచే సార్థ గ్రహణము.[18]

వేదస్యాధ్యయనం నిత్య మనధ్యయనే పాతాత్ –
(పురుషార్థానుశాసన సూత్రము)

అధీతమపియోవేదం విముంచతి నరాధమః ,
భ్రూణహా సతు విజ్ఞేయః వియోనిమధిగచ్ఛతి . (శీక్షా)

అందుచే, వేదాధ్యయనపరుడు, సార్థగ్రహణమొనర్చి – పూర్వభాగములో చెప్పిన కర్మలనాచరించుచు, ఉత్తర భాగములో చెప్పిన పరబ్రహ్మ విషయమున శ్రవణ మనన నిదిధ్యాసనముల నొనరింపవలెను. ఇటు నిలయ శబ్దముచే తదర్థ విషయక శ్రవణ మనన నిదిధ్యాసన రూపానుష్ఠానము ధ్వనితము. అదే ఆచార్య లక్షణము.

ఆచార్యో వేదసంపన్నః విష్ణుభక్తో విమత్సరః
మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదామంత్రాశ్రయః శుచిః
గురుభక్తి సమాయుక్త పురాణజ్ఞోవిశేషతః,
ఏవంలక్షణ సంపన్నో గురురిత్యభిధీమతే.

అని, వేదవిజ్ఞాన సంపన్నుడే గురువు కాదగునని చెప్పబడినది. 'సిద్ధం సత్సంప్రదాయే స్థిరధియమనఘం శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్' అని వేదవేదాంగములను అధ్యయనము చేసినవాడు. బ్రహ్మనిష్ఠుడు గురువుగా నుండ తగునని తెలియుచున్నది. ఉపనిషత్తులలో 'స గురుమే వాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్' అని శ్రోత్రియునే గురువుగా ఆశ్రయింపవలెనని చెప్పబడినది.[19] అందుచే వేదశాఖానిలయుడు గురువు.

**ప్రహృష్టః** :-అనగా, సదా సంతుష్ట హృదయః అని - సర్వజన సేవనీయత, సర్వాభిగమ శీలము సూచితము.

ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృత గాత్రవాన్,
సదా వరగుణావిష్టో ద్రష్టవ్యః సర్వదేహిభిః ,
అని అభియుక్తోక్తి.

ఉత్తమ సాంత్వవాదీ - అనుటచే - ఉత్తముని యొక్క అనగా ఉత్తమపురుషుని (పరమాత్మ యొక్క) విషయమును శిష్యులకుపదేశించువాడు అను అర్థము లభించుచున్నది. భగవంతుడు నిరంకుశుడని, అపరాధములను చూచి సహింపడని, భగవంతుని చేరుటకు భయము లేకుండ, అతడు పల్కిన సాంత్వన వచనములను చెప్పి ధైర్యమును కల్గించునది, ఆచార్యుడే !

సాంత్వవాద శీలుడు ఆచార్యుడని, దృష్టాంత పూర్వకముగా వివరించినారు, వ్యాఖ్యాతలు. కర్షకులు ఏదో ఒకమారు ఫలించలేదు కదా అని కృషిని పరిత్యజింపక, మరలా - ఫలావాప్తికై వ్యవసాయమెట్లు ఒనర్తురో - అట్లే ఆచార్యులు స్వవచన - అశ్రవణ మాత్రముచే విడిచిపెట్టక, శిష్యుల ననునయించి, వారికి ఎదో ఒక తీరున ఉపదేశం చేస్తారు. పునః పునః ప్రయత్నించి, సాఫల్యం పొందుతారు, శిష్యోపాలంభనం కానీ ఉండదు. విజ్ఞాన విశ్రాణన బద్ధదీక్షులైన వీరు భగవంతుని కంటె చాలా అతిశయం కలవారని, శ్రీ కృష్ణపరమాత్మ చేసిన శిష్యోపాలంభనాన్ని గుర్తు చేస్తారిక్కడ.' పార్థాయ గీతాముపదిశ్య పునరాశ్వమేధికే తేన పూర్వోక్తమర్థం విస్మృత్య పునః పృష్టే నాహం వక్ష్యామీత్యుక్త్వా - నూన మశ్రద్దధానోసి దుర్మేధాశ్చాసి పాండవ' అని.

సుస్వాగతాం వాచముదీరయానః - సంప్రదాయానురోధముగా, అనుస్యూతముగా, అనూచాన గురుపరంపరయా స్వాధిగతమైన అష్టాక్షరాది మంత్రపరూపమైన దానిని నిర్హేతుకమైన దయతో ఉపదేశించుట ఇందు ధ్వనితము.

జ్ఞాన కర్మలు కలవాడు, వేదాధ్యయన సంపన్నుడు, భగవదనుభవజనిత – ఆనందము కలవాడు, భగవద్విషయకములగు సాంత్వవచనములను పలుకువాడు, ఆచార్యపరంపరా ప్రాప్తమగు మంత్రములనుపదేశించువాడు, సదా శిష్యుని పరిశీలించువాడు, శిష్యానుభవముచే ఆనందించువాడు – గురువుగా నుండదగినవాడు' అని నిరూపితము.[20] అటువంటి ఆచార్యుడు లభించుటయే శుభశకునము. ఆచార్య స్వరూపుడగు హనుమ చెట్టుపై నున్నాడని దీనిచే సూచితమగుచున్నది.

ఈ విధముగా, ఆచార్యలక్షణమును పలక్షించి హనుమను జీవేశ్వర సంధానకర్తగా పరమోదార రమణీయముగా చిత్రించి, సంప్రదాయ రహస్య నిర్వాహముల నెరపిన సహృదయ మహోదయుల స్వాపదేశముల నాధారభూమిగా కొని, గోవిందరాజులు పరివర్ధిత పరిష్కరణము కావించిన తీరు సహృదయ సంభావ్యము ! సర్వజన శిరోధార్యము !

## అధోజ్ఞాపికలు

1. కావ్యప్రకాశము.

2. పదచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహో వాక్యయోజనా,

   ఆక్షేపోథ సమాధానం – అని. కొందరి మతంలో షాడ్విధ్యం.

   'ఉదాహరణం ప్రత్యుదాహరణం వాక్యాధ్యాహార ఇత్యేతత్సముదితం వ్యాఖ్యానం భవతి' – మహాభాష్య పస్పశం.

3. ద్వైభాష్యేశేష నిర్మితే శ్రీమహచ్ఛబ్దభూషితే – అని ప్రశస్తివహించిన భాష్యకర్తలు భగవత్పతంజలి, భగవద్రామానుజులు. 'మహాభాష్యంవా పాఠయేత్ మహారాజ్యంవా పాలయేత్' అని కదా ఆభాణకం!

4. ఉపాధ్యాయాన్ దశ ఆచార్యః ( మనువు, గౌతముడు).

5. బ్రహ్మవర్గ - ద్వితీయకాండ

6. గౌరవార్థంలోనూ వాడటమున్నది - ఆచార్యపాణిని, ఆచార్య చాణక్య ........... ఈ అర్థములో ఆర్యపద ప్రయోగమూను!

7. తైత్తరీయోపనిషత్ - ఏకాదశ - అనువాకము - శిష్యానుశాసనము.

8. ప్రాఁజదువులు = వేదములు ( ప్రాతపలుకులు, ప్రాఁబలుకులు , ప్రాఁమినుకులు, ప్రామిన్కులు, మొదటి పల్కులు )

9. యాస్కనిరుక్తం - 1- 17

10. ఆచార్య (140, 147) - ఉపాధ్యాయ (141) - గురు (142-148) - మనుస్మృతి - 2 అధ్యాయం . ఆచార్యోత్కర్ష = 2-225-237 (మను). దేశికపదం కూడా పర్యాయవాచకంగా గమనిస్తాం.

11. కృపామాత్రప్రసన్నులు, అనువృత్తిమాత్ర ప్రసన్నులు అని స్వరూపాను రూపనిరుక్తి శ్రీసంప్రదాయంవమున. రెంటింటా గురుచర సమాశ్రయణానంతరమే ఉపదేశం. రెండు రకముల ఉదాహరణ భారతంలో గమనిస్తాం. రామానుజ, గోష్ఠీపూర్ణులను వరుసగా రెండింట ఉదాహరణీయులుగా గ్రహించవచ్చు. ఇక్కడ శిష్యుడు ఆశ్రయించటంక ఆచార్యుడు అన్వేషించటం గమనార్హం!

12. స్త్రీప్రాయమితరత్ జగత్ !

13. పదం వ్యవసితత్రాణ స్థాన లక్ష్మాంఘ్రి వస్తుషు( అమరం - నానా - 441)

14. ఆంధ్రభాగవతం - సప్తమస్కంధం

15. కాదంబరి - పూర్వభాగం

16. విద్యాహవైబ్రాహ్మణమాజగామ గోపాయమాశేవధిష్టేహమస్మి,
అసూయకాయాన్నృజవే యతాయన మా బ్రూయా వీర్యవతీ
తథాస్యామ్ (నిరుక్తం - 2 - 4).
ఇది యాచార్యనియమాభిధాయకము. ఆపై మూడు

మంత్రాలను శిష్యనియమాలను చెప్పి వ్యాఖ్యానించారు.

**మనువు** - నాపృష్టః కస్యచిత్ బ్రూయాత్ - 2-10.
విద్యా ....... ఆహ....... శేవధిస్తే స్మి రక్షమాం,
అసూయకాయ మాం మాదాః - 114
అట్లే శిష్యలక్షణములు, నియమములను ప్రోక్తములు-
గీత - నచాశుశ్రూషవే వాచ్యం - (18-67)

17. మహాభాష్య పస్పశము - వాక్యరణాధ్యయన ప్రయోజనములు చెప్పుచు -

18. జ్ఞేయః = సమ్యగర్థబోధ పర్యవసాయ్యధ్యయనం కార్యం - ఉద్యోతం.

19. ఆచార్యః సహరిఃసాక్షాత్ చరరూపీ న సంశయః,
ఆచార్యదేవోభవ ! దేవ మివాచార్యముపాసీత !
'తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్...... ప్రోవాచతాంతత్వతో
బ్రహ్మ విద్యామ్' - శ్రుతిః
గురురేవపర బ్రహ్మ గురురేవ పరాగతిః
గురురేవపరా విద్యా గురురేవ పరంధనమ్ .

**20.** ఆచార్యః = సత్కుల ప్రసూతుడు, శమదమాద్యాత్మగుణోపేతుడు, ఐహికాముష్మిక సకల ఫల విరక్తుడు , ఉభయ వేదాంతముల క్షోదక్షముగా పరిశ్రమించినవాడు, తదనుష్ఠాననిరతుడు, శిష్యులసంశయ నివృత్తిపూర్వక - ఉపదేశ సామర్థ్యము కలవాడు, ఆచార్యపరతంత్రుడు శిష్యుని యొక్క ఆత్మోజ్జీవనాసక్తుడు , స్వశిష్యతదర్థాచరణ తత్పరుడు..... అని, సంప్రదాయ అకారాదిలో (తమిళమున) కలదు.

★★★

# మంత్రముగా హనుమ

హనుమను ఆచార్యునిగా గమనించితిమి. ఆచార్యుడు స్వయముగా తానుపాసించి, తన శిష్యులను కూడా 'స్వయంతీర్ణః పరాంస్తారయతి' అన్నట్లుగా భగవదుపాసనము చేయించి తరింపజేయును.

మంత్రము ఉపాసనోపకరణము. మంత్రాధీనమై కదా, దైవతము1 ఉండును. ఆచార్యుడు మంత్రోపాసకుడు మాత్రమే కాక, మంత్రోపదేష్టయు. నైష్ఠికానుష్ఠానపరతతో పాటు పరపురుష గుణానుభవమును, భావమును భాగవతశిష్యులతో పంచుకొను భోగియు మహాయోగియు ఆచార్యుడు.

'మంత్రం యత్నేన గోపయేత్' అన్నారు, కనుక మంత్రమును రక్షించి అనుస్యూతముగ పరివర్తింపచేయువాడు ఆచార్యుడు. మంత్రప్రతిగ్రహణ దక్షులైన శిష్యుల నన్వేషించి వారి కుపదేశించి సన్మార్గమున తాను మార్గదర్శియైనడుపు వాడు ఆచార్యుడు. ఇంతటి ఉదాత్తమూర్తికి సర్వవిధముల ఉపచారములు చేయుచు మంత్రము దాస్యమనుభవించుననుటలో ఆశ్చర్యములేదు, విప్రతిపత్తియు లేదు.

హనుమ ఆచార్యునిగ మాత్రమేకాక, ఆచార్యులు ప్రసాదించు మంత్రముగ కూడ గోచరించును. భగవంతునికి దూరమైన వారిని భగవంతునితో చేర్చునది - (1) గురువు (2) మంత్రము. భగవదాభిముఖ్యమును, భగవద్రతిని, భగవత్సాన్నిధ్యమును, సేవను ప్రసాదించునవి - ఆచార్యులు, మంత్రము. కనుక, మంత్ర - ఆచార్యుల ప్రయోజన దృష్ట్యా తదేకతామూలకత వారికభేదమును ప్రతిపాదించునది. దానితో ఆచార్యుడు మంత్రస్వరూపుడైనాడు. మంత్రప్రదాత యగు ఆచార్యుడే మంత్రస్వరూపి ! భగవంతుని వహించు శబ్దమే మంత్రము ! భగవద్వాహకములగు శబ్దములే భగవానునికి ధ్వజములుగా నిర్దిష్టములు. శ్రీ మహావిష్ణువునకు వాహనమగు గరుత్మంతుడే ఆయనకు ధ్వజము. అట్లే శివునకు

వాహనమైన వృషభము, బ్రహ్మకు వాహనమైన హంసయు వారి ధ్వజములు. 'వేదాత్మా విహగేశ్వరః' అని గరుత్మంతుని వేదస్వరూపునిగా పూర్వాచార్యుల అభిసంధి.[2] స్వయముగ వేదమే సుపర్ణుని వేద స్వరూపునిగా నిర్దేశించినది. ఋగ్వేదము వృషభము శబ్దమని చెప్పుచున్నది.

చత్వారి శృంగాత్రయో అస్యపాదా ద్వేశీర్షేసప్తహస్తాసో అస్య,

త్రిధాబద్ధోవృషభోరోరవీతి మహోదేవో మర్త్యా ఆవివేశ,
(ఋ.సం.- 4.5 8.3)

ఈశబ్దవృషభమునకు నాల్గు కొమ్ములు. అంటే లోకభిన్నమైనదిది. లోకమున ఎద్దుకు రెండుకొమ్ములు మాత్రమే. అనగా ఇది ''వింతపశువు'' కాదు. శబ్దమును నిర్వచించుచు చాల చమత్కారముగ పూర్వులు నిబంధించినదిది. ఇక్కడ కొమ్ములు నాల్గు విధములైన పదములకు ప్రతీకలు, అవి – నామ, ఆఖ్యాత, ఉపసర్గ, నిపాతలు.

ఇది మూడు కాళ్ళ ఎద్దు, కాళ్ళు గమన హేతువులు కనుక కాలమునకు ప్రతీకలై – భూతభవిష్యద్వర్తమానముల నెరిగించును. రెండు తలలు ! అనగా – నిత్యము, కార్యము అను రెండు విధములైన శబ్దములు. ఏడు చేతులు సప్తవిభక్తులని యర్థము. మూడుచోట్ల కట్టబడినది. హృదయమున, కంఠమున, శిరమున ఉచ్చరింపబడును. ఈ శబ్దవృషభము యొక్క అరుపు – ధ్వని నిచ్చుట. ఇది కోరికలను వర్షించునది. అనగా కోరికలను నెరవేర్చునది – అని, చాల చమత్కారముగ సర్వవిధ – అవయవ సన్నివేశముతో శబ్దరూపమున మహాదేవుని వర్ణించి, మరణ స్వభావముగల మనుష్యులను ఈ శబ్దము అంతర్యామియై ఆవేశించియుండునని, భగవత్పతంజలి పస్పశమున ప్రపంచించెను.

భగవంతుని తెలిసికొనుటకు శబ్దమే ప్రమాణము. శబ్దమనగా వేదమే !

వైయాకరణుల మతమున శబ్దము బ్రహ్మమే ! శబ్దజ్ఞానము ధర్మజనకమని భగవత్పతంజలి చెప్పెను (పస్పశాహ్నికము). 'ఏకఃశబ్దః సమ్యక్ జ్ఞాతః అని వ్యాకరణ సంప్రదాయము' .[4]

శబ్దావిష్కరణ ప్రక్రియాపరంపరను క్షోదక్షమముగ పరిశీలించి ఆవిష్కరించినారు, వారు. చరాచర సకల జగత్తున చేతన ముత్కృష్టము. కాగా, చేతనులలో వ్యక్తశబ్దోచ్చారణచణులైన మానవుల ఔత్కృష్ట్యము చెప్పనలవికాదు. భాష, భాషణ సామర్థ్యము భగవంతుడిచ్చిన వరములు !

ఆరోగ్యవంతమైన మనస్సు పరిష్కృతభావనా ప్రపంచ విహరణశీలమున పరిపరివిధముల చరించి, ఆ భావనల నుండి బైటపడి వాటిని సహచరులకో, సహవ్రతులకో, సహృదయులకో... మరి ఎవరికో చెప్పుకోవలెనని ప్రయత్నించును. మనిషికి మెదడునిచ్చి, భావన చేయుశక్తినిచ్చినచో రకరకాల భావనలు, ఊహలు ( ఇది మధురం కావచ్చు హృదయ భిదురంకావచ్చు) అల్లుకొనో, వాటిలో చిక్కుకొనో – పిడికెడు గుండెనిండి పొర్లి పోయే స్థితిలో అవి అభివ్యక్తం కాకపోతే మనిషి గుండె పగిలి చావటమో, పిచ్చిపట్టి పరువులెత్తటమో జరిగేది. అందుకే భగవంతుడు భాషనిచ్చాడు. ఇది నిజంగా వరమే ! అయితే భాష, భాషణ శక్తి కూడా వరాలే ! భాష ఉదాత్తం కావాలి. భాషణ శక్తి కూడా ఉన్నతంగా ఉండాలి. అందుకే శబ్దాన్ని ఉపాసించారు. వ్యాకరణాన్ని వేదాంగమని ఊరుకోకుండా, ముఖం అని, ముఖ్యం అనీ శ్లాఘించారు.[5] ఆలంకారికులు కూడా –

ఇద మంధంతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్,
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే.
(దండి – కావ్యాదర్శం)

అంధకారబంధురమైన ప్రపంచానికి ఆలోక సాహాయ్యమెంత అవసరమో, శబ్దజ్యోతీ అంతేనన్నారు. శబ్దాశ్రయం కాని లౌకిక వ్యాపారమేదీ లేదు.

నసోస్తి ప్రత్యయోలోకే యశ్శబ్దానుగమాదృతే,
అనువిద్ధమివజ్ఞానం సర్వం శబ్దేన భాసతే. అన్నారు.

పరతత్త్వ ప్రతిపాదకాలయిన వేదశాస్త్ర స్మృతీతిహాసముల పట్ల దర్శన పదమెట్లు అన్వర్థమో, శబ్దము పట్ల కూడ అట్లేనని - వ్యాకరణమునకు దర్శనప్రతిపత్తి నాపాదించుచు, వ్యాకర్తలు శబ్దబ్రహ్మనిరూపణము కావించినారు.

అనాది నిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్,
వివర్తతేఽర్ధభావేన ప్రక్రియా జగతోయతః,
(భర్తృహరి - వాక్యపదీయము)

అని, జ్యోతీరూపమైన శబ్దబ్రహ్మమునుండే సర్వపదార్ధములు, భావములు వివర్తములగుచున్నవని, సూక్ష్మతత్త్వమే జీవుల చైతన్య స్వరూపమనియు, ఇదే సృష్టికి ఉపాదానకారణమనియు, స్థూల ప్రపంచ ప్రవర్తకమనియు, సూక్ష్మవాగాత్మ ... అనియు చెప్పుదురు.

ఈ స్థూల ప్రపంచమున కాధార భూతమైన అవ్యక్త శబ్దమునకు పరావాక్కు అనిపేరు. దీని క్రమానుగతిని, పశ్యంతీ మధ్యమా వైఖరీ స్వరూపమును ఆవిష్కరించుచు వైయాకరణులు అత్యద్భుతమును, ఆశ్చర్యావహమును అగు స్ఫోటసిద్ధాంతమును ప్రతిపాదించినారు. శబ్ద పరిణామమును గూర్చి -

చత్వారి వాక్పరిమితా పదాని తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః,

గుహాత్రీణి నిహితా నేంగయంతి - తురీయం వాచో మనుష్యావదంతి.
(ఋ.సం. **1-164-45**)

అన్న వేదమంత్రమునుదాహరించినారు.

శబ్దము యొక్క నాల్గురూపములను శబ్దతత్త్వవిదులగు మనీషులే ఎరుగగలరు. ఈ నాల్గిటిలోను మూడు గుహలోననుండును. నాల్గవ దానినే మనుష్యులు మాటాడుచున్నారు. అని, దీనికర్థము. దీనిని సంపూర్ణముగా తెలిసికొనుటకుప్రయత్నించెదము.

శబ్దము యొక్క అవస్థాచతుష్టయము శబ్దతత్త్వవిదులచే ఇట్లామ్నాతము --

''వైఖరీ శబ్దనిష్పత్తిర్మధ్యమా - 6 శ్రుతిగోచరా, ఉద్యతార్థాచ పశ్యంతీ సూక్ష్మావాగనపాయినీ'' శబ్దము నాల్గు విధములుగా ఉండును. (1) పరా (2) పశ్యంతీ (3) మధ్యమా (4) వైఖరీ

ప్రాణాది వాయువు, శబ్దతన్మాత్ర పరమాణువులు, ఇచ్ఛారూప జ్ఞానమును కలిసి శబ్దరూపమున పరిణామ మందును.

**పరా :** - జ్ఞానప్రధానమై శబ్దబ్రహ్మమని వ్యవహరింపబడు చేతన మిశ్రమగు నాదము, మూలాధారబిందువునుండి ఇచ్ఛాజన్య సంస్కృత పవనచలనముచే అభివ్యక్తముగ నుండు శబ్దబ్రహ్మమే పరావాక్కు.

''వర్ణాది విశేషరహితా, చేతన మిశ్రా, సృష్ట్యుపయోగినీ, జగదుపాదాన కారణభూతా8, కుండలినీరూపేణ ప్రాణినాం మూలాధారే9 వర్తతే. కుండలిన్యాః ప్రాణవాయుసంయోగే పరావ్యజ్యతే. ఇయం నిష్పందా, పశ్యంత్యాదయః సస్పందాః, అస్యాః వివర్తాః' అని నాగేశుడు దీనిని విశ్లేషించినాడు.10

**పశ్యంతీ :** ఈ స్థితిలో వాక్కు అవిభక్తము. వర్ణాదులస్థితి అభివ్యక్తముకాదు. కేవలము మానసికమైనదీ అవస్థ. వక్తమాటలాడవలెనను కొన్నచో, పరావాక్సంస్కారమేర్పడి, ప్రాణవాయు సంయోగముతో నాభిపర్యంతము వచ్చినపుడది పశ్యంతిగ పరిణమించును.

'తదేవనాభిపర్యంతమాగచ్ఛతా తేన వాయునా అభివ్యక్తం మనోవిషయః పశ్యంతీ త్యుచ్యతే''11

ఈ పరాపశ్యంతులు రెండును యోగులకు సమాధియందు నిర్వికల్పక సవికల్పక జ్ఞానవిషయములు.

**మధ్యమా :** – మూలాధారమునుండి నాభిద్వారా హృదయ పర్యంతము వచ్చిన, మధ్యమానాదమనబడును. ఈ అవస్థలో ఒక విశిష్టక్రమముగల శబ్దము బుద్ధి యందు భాసించును.

''తతో హృదయ పర్యంతమాగచ్ఛతా తేన వాయునా హృదయదేశే అభివ్యక్త తత్తదర్థవిశేష తత్తచ్ఛబ్ద విశేషోల్లేఖిన్యాబుధ్యా కలితా (హిరణ్యాగర్భదేవత్యా) పరశ్రోత్ర గ్రహణాయోగ్య త్వేన సూక్ష్మా మధ్యమా వాగుచ్యతే.12

స్వయం కర్ణపిధానే, సూక్ష్మతర వాయ్వభిఘాతేన ఉపాంశుశబ్ద ప్రయోగేచ శ్రూయమాణా సేత్యాహుః-13 అనటం చేత, ఈ మధ్యమా వాక్కు ఇతరులకు వినిపించదు. కానీ, ఎవరి మట్టుకువారు చెవి మూసుకొని వింటే వారిలో వారికి వినిపిస్తుందన్నమాట !

'గుహాత్రీణి నిహితా' అన్నదానికింత అర్థముంది ! ఈ మూడింటినీ ప్రణవ స్వరూపంగా చెప్తారు.14 ఇక తురీయము –

**వైఖరీ :** ఆ మధ్యమా ఆస్యపర్యంతము పోవు వాయువుచే కంఠదేశముచేరి, అచటనుండి మూర్ధపర్యంతము పోయి, మరలి క్రిందకు వచ్చి – ఆయా కంఠతాల్వాదిస్థానములలో అభివ్యక్తమగును. విఖరము (ముఖము) నుండి వచ్చుటచే దీనికి వైఖరీ అని పేరు. ఇది శ్రూయమాణ సర్వశబ్దాభిధాయి.

'సైవచాస్య పర్యంతం గచ్ఛతా తేన వాయునా కంఠదేశం గత్వా మూర్ధాన మాహత్య పరావృత్యతత్తత్స్థానేషు అభివ్యక్తా, పరశ్రోత్రేణాపి గ్రహణ యోగ్యా (విరాడధి దేవత్యా) వైఖరీ వాగిత్యుచ్యతే.'15

కేవల ప్రాణ వాయువేకాక, వ్యాన-ఉదాన16 వాయువులతో కూడిన ప్రాణవాయువు ఈ వైఖరి నభివ్యక్తము చేయును. ఇదే అందరికి తెలిసిన శబ్దము. మిగిలిన మూడును గుహానిహితములు. ఇచట గుహ = హృదయగుహ ! వ్యాకరణశాస్త్ర బలముచే లభ్యమైన యోగదీపముచే తిమిరమును తొలగించి వాటిని కనుగొన నగును. శబ్దబ్రహ్మము యొక్క అవ్యక్తరూప ములివి ! వ్యక్త రూపము ఈ నాల్గవదైన వైఖరి. వ్యక్తా వ్యక్త రూప సర్వస్వసందర్శనేచ్ఛ గలవాడు శబ్దబ్రహ్మోపాసన చేసి, వ్యాకరణ దర్శన సాహాయ్యమున దర్శింపవలెను.

ఇది శబ్దము యొక్క స్వరూపము. ఇది శబ్దము యొక్క వైలక్షణ్యము. ఇది శబ్దము యొక్క సర్వాంగీణ స్వభావము. మననోట ఇది మాటగా చెలామణి అగుచున్నది. పెద్దల మాటలు ? ''మంత్రంబులు !'' ఋషుల నోటినుండి వచ్చిన మాట మంత్రమై ఉపాస్యమైనది. ఇది భగవన్నిరూపకమై, ప్రాపకమై ఉపాసకులకు పరమారాధ్యమైనది.

భగవంతుని తెల్పేది శబ్దమన్నాము. శబ్దమనగా వేదమే అన్నాము. ఎందుకనగా – భగవంతుని వహించునది కనుక వేదం ధర్మాన్ని నిరూపించేది. 17 ధర్మమనగా భగవంతుడే !

అయితే, భగవద్వాహనములుగా భగవంతుని వహించుచున్నవారుమనకి తెలుసుకదా ! గరుడుడు, హనుమ. మరి, వీరి మాటేమిటి ? అంటే – నిజమే ! వీరు భగవంతుని వహించి యున్నారు, వేదమువలె. కనుక వేదసారూప్యము, కాదు -- వేదాత్మకత ! దీనికుపపత్తి ! పూర్వాచార్యవచనములు, వేదాత్మావిహగేశ్వరః .... మొదలయినవి. అంతేకాక సంప్రదాయ సముదాచారములు. మనము ఆలయములోనికి

పోవునపుడు ముందు ధ్వజస్తంభమునకు సాష్టాంగనమస్కారముచేసి, ఆమూర్తికి నమస్కరించి వేదప్రామాణ్యము నంగీకరించి లోనికేగుట వైదిక సంప్రదాయ వైలక్షణ్యము - ధ్వజప్రణతికి పెద్దలుచేసిన తత్త్వగంభీరమైన నిర్వాహమిది. ఆలయములో సాష్టాంగనమస్కారము నిషిద్ధము. వేదమునకు నతిచేసి, వేదప్రతిపాద్యునకు ప్రణతి చేయుట స్వరూపానురూపమని, ఈ సంప్రదాయ రహస్యము నెరుగకయే గతానుగతికముగ మనము తెలియకున్నను వేద ప్రామాణ్యము నంగీకరించి అనుసరించుచున్నామనియు పెద్దలు తెల్పుదురు. మొత్తముపై పరమపురుషుని వాహనము వేదము = శబ్దము. ఆ శబ్దమే మంత్రము ! ఆ మంత్రమే హనుమ !

శ్రీమన్నారాయణుని శ్రీ చరణస్థానీయులుగా వైనతేయపవన తనయులను శ్రీ సంప్రదాయము చెప్పుచున్నది. ద్రావిడసంప్రదాయమున గరుడుని - 'పెరియ తిరువడి' అని, హనుమను 'శిరియతిరువడి' అని వ్యవహరింతురు. తిరువడి అనుపదమునకు శ్రీచరణము అని అర్థము. శ్రీ వైకుంఠమున గరుత్మంతుడు, ఈలోకమున హనుమయు శ్రీస్వామి శ్రీ చరణములుగా పేర్కొనబడుదురు. చరణము నడచుటకుపకరణము. శబ్దము (మంత్రము) భగవంతుని పొందించు సాధనము. పాదస్థానీయమై భగవంతుని మన కందించు శబ్దమే హనుమ. కనుక రాముని వాహనము హనుమ !

అంతేగాక, స్వానుసంధాతృరక్షకత్వం చేతనూ మంత్రత్వం సాధ్యమే. అసలు మంత్రపదనిరుక్తిని, దాని అర్థవైశద్యమును పరిశీలించాలి, మొదట !

మంతారంత్రాయతే - ఇతి మంత్రః అని మంత్రపదమును విశదీకరించినారు.

మంతరి - ఉపదేశే = త్రైఙః డప్రత్యయః,[18] త్రచలోపశ్చ - ఉణాదయో బహుళమితి సూత్రాత్ - అని మంత్రదపదనిష్పాదనము, మననము చేయువానిని పాలించునది అను అర్థమునందు.

మన్యతే త్రాయతే చ ఇతి మంత్రః
''మననత్రాణ సంయోగాన్మంత్ర ఇత్యుచ్యతే బుధైః'' (ఈశ్వరసంహితా)
మంత్రయతేర్వాడప్రత్యయే గోప్యత్వపరః,
అథవాగోపనీయత్వా ద్ధాతోర్మంత్రయతేః పరః
డ ప్రత్యయాంతః తథాయంలోకవేదయోః (పాద్మసంహితా)

ఈ తీరున వివిధ రీతుల పదనిష్పత్తిని చెప్పినారు. ఒకచోట కర్తృత్వవివక్ష, మరియొకచోట కరణత్వవివక్ష. రెండవదే ప్రచురము.

ఫలితార్థము - మంత్రము రక్షణ వ్యాపారమును నిర్వహించునది. మననశీలుని సదారక్షించునది.

శబ్దము వాయువునుండి ఉత్పన్నమైనట్లే హనుమయు వాయువు వలన పుట్టినాడు. అందుకే - వాయునందనుడు, మారుతి, పావని, పావమాని, పవమానసుతుడు మొ॥ నామము లేర్పడినవి. ఇది వారి జన్మసారూప్యము. ఏతావన్మాత్ర నిర్వహణ, నిరూపణములతో తృప్తినందక, హనుమ - శబ్దముల ఉత్పత్తి ప్రకారమును, శబ్దమునకు హనుమతో గల సామ్యమును పరిపరివిధముల పరిశీలించి, పరిశోధించి - సమగ్రము ప్రత్యగ్రము ఐన పరినిష్ఠితార్థ విషయాన్వేషణమును గావించినారు, సహృదయ విపశ్చిదపశ్చిములు.

హనుమదుత్పత్తిని శబ్దోత్పత్తితో పోల్చి సాధర్మ్యమును నిరూపించి, సగంధులుగా నిర్ధారణ చేసినారు.

1. హనుమ వాయువు వలన పుట్టినవాడు. శబ్దము కూడా !

2. జన్మించినంతనే హనుమ (సూర్యగ్రసనమునకై) పైకి పరుగిడినాడు శబ్దముకూడా శిరోభిగమము !

3. అంజనా తనయుడు హనుమ ! శబ్దము కూడా ! నోటిలోని, ఆయా వర్ణములు అభివ్యక్తములగు, స్థానములే అంజన.19 అంజనయందు వాయుసంపర్కముచే శబ్దము పుట్టుటచే శబ్దమునకు కూడా అంజనాసూనుత్వము సార్థకము.

4. హనువు అనగా దౌడ. సూర్యునెదుర్కొని పడిపోయి, దౌడలు సొట్టపడుటచే అతడు, హనుమంతుడైనాడు. దౌడల కదలికచే వర్ణరూపమగు శబ్దము వెలువడుటచే శబ్దమూ, 'హనుమాన్' ఐనది !

5. సుగ్రీవ సాచివ్యమును సైతమిట సాధించినారు !

హనుమ సుగ్రీవ సచివుడు. స్వాధ్యాయ ప్రవచనశీలి అగు శ్రోత్రియుడు ఇట సుగ్రీవుడు. సు = మంచి, గ్రీవ = మెడకలవాడు. మెడ/కంఠము – అనుటచేత లక్షణయా ఉదాత్త అనుదాత్త స్వరిత స్వరములతో సుష్ఠూచ్చారణ సామర్థ్యము గల వేదాధ్యయనపరుడని అర్థము. వాని కార్యములను నిర్వహింపగల మంత్రివరుని వలె వ్యవహరింప సమర్థమీ మంత్రము కనుక సాచివ్యమిట బహురమణీయముగా ప్రతిపాదింపబడినది !

6. హనుమరామదూత ! మరి, శబ్దము ? భగవానుని సందేశమును జీవుల కందించునది. సందేశహరణమే దూతకృత్యముకదా ! అందుచేత దౌత్యనిర్వహణ సమర్థమైన ఈ శబ్దము తదర్థసమర్థమై శోభించినది.

7. 'దాసోహం కోసలేంద్రస్య' – అని ఎలుగెత్తి తన ప్రభుపరతంత్రతను చాటినాడు, హనుమ. మరి, శబ్దము ? భగవత్పరతంత్రమై, భగవదాహ్వానమైనది కనుక దాస్యమునూ సమన్వయింపదగును.

ఈవిధముగా నిర్వచన సప్తకమును ఉభయ సామాన్యమై, ఉక్తిరమణీయము

మాత్రమే కాక - ఔచితీసహాయమున్నై రసపుష్టి కలిగి సహృదయ హృదయములకు తుష్టిని కూర్చినది. ఈవిధముగా (శబ్దస్వరూపిగా) హనుమ శ్రీరామతత్త్వమును నిరూపించుటను, రామునితో సీతను సంఘటిత పరచుటను మనము రామాయణమున గమనింతము.

భగవద్దూతయై, వాహనమై, అవాంతర విఘ్నవిరోధియై, భగవత్పరతంత్రమై ఉండెడిది మంత్రము. ఈ లక్షణములన్నియు సమృద్ధముగ గలవాడు, హనుమ. దూతయై సందేశమును వినిపించినాడు. వాహనమై శ్రీరామునకుపచరించినాడు. అవాంతర విఘ్నవిరోధియై కార్యములను ఫలవంతమొనర్చినాడు. భగవత్పరతంత్రుడై ప్రకాశించినాడు. ఈ పారతంత్ర్యము శరౌపమ్యమున సూచితము. సర్వులకు ప్రశంసార్హమైన వ్యక్తిత్వమును జీవలక్షణమును కల్గి, ఆదర్శమును అభినందన పాత్రమును అయినాడు. నేటికిని భక్తులకు ఉపాస్యదైవతమైనాడు.

ఈతని వలననే సుందరకాండము - ఏకదేశమైనను, స్వతంత్ర ప్రతిపత్తికల్గి, పూర్వాపరనిబంధ విరహితమైన పారాయణ గ్రంథమైనది. మంత్రమై ఉపాస్యమైనది. సర్వవ్యాధి నివారణకు, సంసార బంధవిముక్తికి, భూతప్రేతాది భయనివారణకు, బుద్ధిమాంద్యము తొలగుటకు, అఖండ సంపదలు కలుగుటకు, దుఃస్వప్నదోషనివారణకు, సత్త్వగుణాభివృద్ధికి, విశ్లిష్ట బంధుసమాగమమునకు, ఆ పత్ప్రశాంతికి ... ఇట్లా కామ్యార్థసిద్ధికి పారాయణం చేయటం మనకి అలవాటులోనున్న ఆచారం.

ఇష్ట కార్య నిర్విఘ్నపరిసమాపనంకై చేస్తున్నాం. మనోవ్యాధ్యుపశమనాని కి సుందరకాండ పారాయణం చేయటం మనదేశంలో ప్రహతంగా వస్తూన్న ఆచారం. నష్టద్రవ్యలాభం కోసం చేయటం మనం చూస్తున్నదే!

ఇదంతా హనుమదనుభావం వల్లనే ! ఇంతటి మహత్త్వపూర్ణమైన వ్యక్తిత్వం గలవాడిని వానరుడంటామా ? నరుడంటామా ? వేదవేత్త అంటామా ? నవ వ్యాకరణ వేత్తగా ప్రశస్తి కెక్కినవాడు, శ్రీరామునిచే (సాక్షాత్తూ వేదవేద్యుడాయన), చతుర్వేదవేత్తగా ప్రశంసించబడినవాడు, హనుమ ! ఈతడు సాక్షాత్తూ, వేదమే ! అనగా, మంత్రమే ! అంటే, భగవత్ప్రాపకుడే ! ఇందులో అతిశయోక్తి లేదు, దీనికి విప్రతిపన్నులెవరూ ఉండరు.

## అధోజ్ఞాపికలు :

1. మంత్రాధీనంతుదైవతమ్

2. యామునులు – కాంతాచతుః శ్లోకి

3. ప్రత్యక్షేణానుమిత్యావా యస్తూపాయో న బుధ్యతే,
ఏనం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా.

4. వ్యాకరణ ప్రక్రియా జ్ఞానపూర్వక శబ్దోచ్చారణ విషయమున భగవత్ పతంజలి – 'ఏకఃశబ్దః సమ్యగ్జ్ఞాతః సుష్ఠు ప్రయుక్తః స్వర్గే లోకే చ కామధుగ్ భవతి'.

5. ఛందః పాదౌతు వేదస్యహస్తే కల్పోథ కథ్యతే,
జ్యోతిషామయనం చక్షుః నిరుక్తం శ్రోత్రముచ్యతే॥
శిక్షాఘ్రాణంతు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతమ్,

తస్మాత్ సాంగమధీత్యైవ బ్రహ్మలోకే మహీయతే ॥
(పాణినీయ శిక్షా – 41, 42)

''ప్రధానం చ షట్ స్వంగేషు వ్యాకరణమ్' - శబ్దానుశాసన ప్రయోజనాధికరణమున - పస్పశములో, భగవత్పతంజలి.

6. అంతఃకరణ గ్రాహ్యే.

7. దేహేపి మూలాధారేఽస్మిన్ సముద్యతి సమీరణః

8. కుండలినీ మూల ప్రకృత్యాత్మికా మహదాదిభిర్వేష్టితా సర్పవత్ తిష్ఠతి. మూలాధారాదుత్థితః పవనో నాడీ ద్వారేణ కార్యాణి కరోతి. (కుంజికాటీకా)

9. గుదలింగాంతరే చక్రమాధారాఖ్యం చతుర్దలమ్,
అస్తి కుండలినీ బ్రహ్మశక్తి రాధార పంకజే ॥
ఆధారాద్ ద్వ్యంగుళాదూర్ధ్వం మేహనాద్ ద్వ్యంగుళాదధః,
ఏకాంగుళం దేహమధ్యం తప్త జాంబూనద ప్రభమ్ ॥ (సంగీతరత్నాకరం)

10. లఘుమంజూష - స్ఫోటనిర్ణయం - శాబ్దసృష్టిప్రక్రియ

11. లఘుమంజూష - స్ఫోటనిర్ణయం - శాబ్దసృష్టిప్రక్రియ

12. లఘుమంజూష - స్ఫోటనిర్ణయం - శాబ్దసృష్టిప్రక్రియ

13. లఘుమంజూష - స్ఫోటనిర్ణయం - శాబ్దసృష్టిప్రక్రియ

14. ఏతదవస్థాత్రయమపి సూక్ష్మతమ సూక్ష్మతర సూక్ష్మప్రణవ స్వరూపం

15. లఘు మంజూష

16. ... వ్యానోదానాభ్యాం సహ వైఖరీరూపం ప్రతిపద్యతే.

17. ఉచ్చైర్గతిర్జగతి సిధ్యతి ధర్మతశ్చేత్
తస్యప్రమాచ వచనైః కృతకేతరైశ్చేత్... (భోజరామాయణం)
'రామో విగ్రహవాన్ ధర్మః'; 'ధర్మాత్మా సత్యసంధశ్చ' (రామాయణం)

18. త్రైఞ ధాతువు కానరాదు. త్రైజధాతువు పాలనార్థములో కలదు.
(చవర్గానునాసికము మార్గణీయం!)

19. వర్ణోత్పత్తి స్థానమును అంజన అని పెద్దలు చెపుతున్నారు. కానీ, రసోత్తమము, రసవత్తమము ఐన కావ్యానికి జీవాతువు, ధ్వన్యభిధానమై శోభాధానహేతువైన వ్యంగ్యార్థమునిచ్చు ఒక శబ్దశక్తిని ఆలంకారికులు అంజనా అంటున్నారు. ఐతే. ఇది వ్యంజనాశక్తిగా ప్రచురం. హల్లులకు వ్యంజన వ్యవహారముంది. 'సర్వః శేషో వ్యంజనాన్యేవ' - ఋగ్వేద ప్రాతిశాఖ్య. 'పరేణ స్వరేణ వ్యజ్యతే ఇతి వ్యంజనమ్' - అని తైత్తరీయ ప్రాతిశాఖ్యపై వైదికాభరణ భాష్యం.



# మంత్రిగా హనుమ

హనుమను భక్తునిగా సేవకునిగా కార్యదక్షునిగా మన మెరుగుదుం. మంత్రిగా సైతమతడు ప్రచలితుడే, వాల్మీకంలో స్ఫుటంగా అతని మంత్రిత్వం కనవస్తుంది. సుగ్రీవుని కథ పతాక కనుక, హనుమ అందులోని పాత్ర కనుక - అది కథాగతికి ఎంత వరకు అవసరమో అంత మాత్రమే వాల్మీకి గ్రహించి నందువలన హనుమ సాచివ్యం మనకు సమగ్రంగా భాసించదు. అయినప్పటికీ, ' ఉత్తరాత్ప్రశ్న ఉన్నేయః ' అన్నట్లు - తావన్మాత్రమైన ప్రశంసను పురస్కరించుకొని హనుమ సాచివ్యాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేస్తాను.

రాజ్యాన్ని రక్షించేవాడు రాజు అయినా పరోక్షంగా తత్పరిరక్షణ బాధ్యతను వహించేది, మంత్రే! మంత్రం, మంత్రాంగం అన్నవి రాజనీతి విచక్షణతను, ధీనైశిత్యైక క్షమమైన వ్యూహరచనా వైభవాన్ని వ్యక్తపరచే పదాలు, కదా! అంటే రాజ్యపరిరక్షణకు రాజు బాహుబలమెలా అవసరమో, మంత్రి బుద్ధి బలమూ అంత అవసరమే. రాజు సేనాబల్మంతో సాధిస్తాడు. కానీ మంత్రి, ధీశక్తితో కదలక్కరలేకుండా కావలసినవన్నీ సమకూర్చగలడు. మంత్రి గొప్పదనం కానీ, ఉనికి కానీ - ఎప్పుడో ప్రత్యేక పరిస్థితుల్లో బయల్పడేదీ, ఉపయోగపడేదీ కాక, నిత్యం, ప్రతిపదం అవసరమయేదే రాజుకీ, రాజ్యానికీ అత్యంతం అవసరమయేది మంత్రి మనీషా విశేషం!

మంత్రి సప్తాంగాల్లో ద్వితీయుడైనా, నిజానికి అద్వితీయుడు. రాజు ఎంత ముఖ్యుడో, మంత్రీ అంతే. క్వాచిత్కంగా వీరు అన్యూనాతిరిక్తంగా ఉన్నా, చాలా చోట్ల 'సచివస్త్వతిరిచ్యతే' అనటం సాహసోక్తి కాదు. అలా ప్రథితులైన వారు యథార్థ నిదర్శనాలుగా నేటికీ వినవస్తారు. చరిత్ర పుటల్లో స్ఫుటంగా కనవస్తారు. అమాత్యమాత్రంగానే కాక - అంతరంగమిత్రులుగా, హితులుగా, సన్నిహితులుగా వాసికెక్కిన ఘనసంపన్నులెందరో! రాజక్షేమం అపేక్షించి కుటిల నీతి ననుసరించి,

దానినే రాజనీతిగా చలామణీ చేయించిన చాణక్య ప్రతిభులు, ప్రాణాలనే పణంగా పెట్టి ప్రహృష్టాంతరంగంతో ప్రభుపరిణయాలు కావించిన యౌగంధరాయణ ప్రభృతులు, గొడ్డలి పెట్టును 'పక్క'కునెట్టి కొనగోట ఘనకార్యాలనెన్నిటినో సాధించి నిమ్మకునీరెత్తినట్లు కిమ్మనకుండే తిమ్మరుసులు, ఆత్మనాశాన్నే కాక ఆత్మీయనాశాన్నీ లెక్కచేయక నిజరాజాభిమానంతో పరిక్రమించే రాక్షస ప్రతిభులు .... ఎందరో! ....'నందోరాజా భవిష్యతి' అని ఆనంద వాక్యంతో భావినా శాసిస్తూ మంత్రాంగం నెరపిన పురంధ్రీమ తల్లులెందరో! అలనాటి నుండి నిన్నటి పలనాటి వరకు మహిళామతల్లుల మంత్రాంగం జగమెరిగిందే. అయినా, మంత్రి ఆలోచన గుణసీమితం కావాలి. దాన్నే హెచ్చరించి చెప్తాడు - భారవి,

'సకింసఖా సాధు నశాస్తి యోధిపం
హితాన్నయస్సంశృణుతే సకింప్రభుః'
(కిరాతార్జునీయం - 1 - 5)..

మంత్రి మాట వినని రాజా కుత్సితుడే. రాజుని సరియైన మార్గాన నడపని మంత్రీ అంతే. మంత్రిత్వం అంటే మాటలా? అసిధారావ్రతం! అంతః పురాలు, ఆంతరంగిక స్థావరాలు, ఆలోచనా మందిరాలు, అంతర్గత సమస్యలు, ప్రజల ఆలన - పాలన, రాజ్యక్షేమం, సుస్థిరత - విస్తరణ - శత్రువులు - సామంతులు, వారితో రాచకార్యములను, రాయబారములను జాగ్రత్తగా నిర్వహించటం ....... అబ్బో! ఇది మాటల్లో పనికాదు. ఒక మంత్రికార్యభారాన్ని రాక్షసమంత్రే చెప్తాడు, ముద్రా రాక్షస నాటకంలో.

రాజుని ఊరికే, ' నామ్‌కేవాస్తే 'గా కూర్చోబెట్టి, అధికారం చెలాయించిన వాళ్ళు ఉన్నారు. రాజుగారు కొంచెం మెతకదనం కనబరిస్తే తమ చాకచక్యంతో పనులు చక్కబెట్టుకొనే గడసరి మంత్రులూ ఉన్నారు. రాజుకే కర్తృత్వాన్ని అంటగట్టి, తాము ప్రయోజక కర్తలుగా (కింగ్స్‌గా కాక కింగ్ మేకర్స్‌గా) తెరవెనక భాగోతం నడుపుతూ తెలివిమీరిన వాళ్ళూ ఉన్నారు. అభిమానంతో,

ఆభిజాత్యంతో, ఆప్యాయనంతో ఆదరంతో, రాజభక్తి తరంగితమైన రక్తనాళాలతో, ప్రజాభ్యుదయ క్షేమకామనతో మెలిగినవారూ, రాజ్యస్థిరతాభివృద్ధుల కోసం ప్రాణాలర్పించి వెలిగినవారు ఉన్నారు. రాజభోగాలనుభవించి రాణమీరిన వారున్నారు. ఆపత్సమయాలలో రాజాంకురాలను దాచి ప్రోచి పెంచి జగజ్జెట్టిగా తీర్చిదిద్ది ఓలగ మెక్కించి కృతార్థులు చరితార్థులూ ఐన మహామేధావులూ ఉన్నారు. రమణీలోలులైన రాజులు వచ్చి రాజవ్యవస్థకే బూజుపట్టే పరిస్థితులలో రాజ్యభారాన్ని తమభజస్కంధాలపై వహించి వాసికెక్కిన వారూ ఉన్నారు. అసలీ మంత్రుల చరిత్రే మహాశ్చర్యంగా ఉంటుంది.

మంత్రి పదానికి సమానార్థకాలుగా వినవచ్చేపదాలు చూడండి – అమాత్య, సచివ, మౌలి. ఇవన్నీ సమానార్థకాలుగా వాడబడుతూన్నా, నిజానికి వీటి మధ్య తారతమ్యముంది. అభిధాన సామర్థ్యంతో వీటినిలా విశ్లేషించవచ్చు.

**<u>మంత్రి</u>** :– మంత్రియతే ఇతిమంత్రీ. (మంత్ర – మంత్రణే– ణిని – కృ. ప్ర). మంత్రాంగం – అంటే రాజ్య నిర్వహణలో, బుద్ధి ద్వారా అంటే – ఆలోచన ద్వారా, తన్నిర్వహణానికి తోడ్పడేవాడు.

**<u>అమాత్య</u>** :– అమా అనేదానికి – తో, దగ్గర అని అర్థం. దీనికి త్యప్ప్రత్యయంచేరి అమాత్యపదం నిష్పన్నమైంది. అంటే సహజీవనం సాగించేవాడనీ, ఒకే ఇంట్లే కలిసి ఉండేవాడనీ అర్థం. ఈ అర్థాలనుండి క్రమంగా రాజానుచరుడనే అర్థానికి పరిణమించి, తరువాత మంత్రి పర్యాయంగా స్థిరపడిందన్న మాట!

**<u>మౌలి</u>** :– ఈ శబ్దానికీ మంత్రి అన్న అర్థం ఉంది. అతడు వంశపారంపర్యంగా అనూచానంగా వస్తున్నవాడని అర్థం. అంటే వైయక్తికమైన శక్తి సామర్థ్యాలు అపేక్షితాలా? అనపేక్షితాలా? అనికాక, ఆ పరంపరలో, ఆ కోవలో – తదనుగుణంగా పెంచబడి, దానికై తయారు చేయబడిన వాడని సాంప్రదాయకమైన అర్థం.

**సచివ** :- షచ - సచ (సమభావే) + ఇన్ = సచివః.

సచి + వా + క (కృ.ప్ర) = సమభావమును నెలకొల్పువాడని అర్థం. స్నేహితుడు, సహచరుడు, మంత్రి అనే అర్థాల్లో వాడుక. ఇతడు నిజానికి రాజకీయవ్యవహారాలలో కాక, రాజుగారి వైయక్తిక ఆంతరంగిక కార్యసహకారిగా ఉంటాడు. నర్మసచివ, కార్యాంతర సచివ వంటి సమాసాలు దీన్నే తెలియజేస్తాయి.

ఇంకా, వ్యాపృత, శమథ, సామవాయిక, గ్రంథిహారాది పదాలున్నా అవి కోశ మాత్ర పరిమితాలు. వీటన్నిటిలో మంత్రి అమాత్య సచివ పదాలే ప్రచురాలు. అయినా మంత్రి పదం అమాత్యపదం కంటే ఉన్నత పదవీ నిర్వాహకుని తెల్పుతుంది. అమాత్యులు రాజుకు - ఏయే సమయములందేయే కార్యములాచరించాలో, అంటే వారి రోజు వారీ, నిత్యకృత్యాలను - గుర్తుచేస్తూంటారు. (అర్థశాస్త్రం - 1-1-8). అలాంటి వారి శక్తిసామర్థ్యాలను పరిశీలించి వారిని అమాత్యులుగా పరిగ్రహించాలే తప్ప, మంత్రులుగా వీరు పనికిరారు - అంటాడు కౌటిల్యుడు. మంత్రులు ప్రధానములైన రాచకార్యమలలో రాజుకి సలహాలు చెప్తారు. వీరి పదవి అమాత్యుల పదవికంటే ఉన్నతమైనది. అంతేకాదు గూఢచారి నియామకం కూడా మంత్రే చేస్తాడు. 'రాజానశ్చారచక్షుషః' అని, చారుల ద్వారా ప్రపంచమంతా తెలిసికొంటారు. అలాంటి చారులను మంత్రి నియమించాడంటే, వారంతా రాజాధీనులు కాక, మంత్ర్యధీనంలో ఉంటారన్నమాట. దాని వల్ల రాజు ఇతని గుప్పిట ఉన్నట్లు తెలుస్తోంది. ఇంతటి ప్రముఖమైన వ్యక్తి రాజకీయవ్యవస్థలో మంత్రి!

మంత్రికి ఉండవలసిన గుణాలని నిర్దేశించాడు, కౌటిల్యుడు. అవన్నీ ఉంటే అతడుత్తమమైన మంత్రి. అందులో మూడు వంతులున్నవాడు మధ్యముడు. సగం మాత్రం ఉన్నవాడు అధముడు. మంత్రి నియమనంతో అతని శుచిత్వాశుచిత్వాలు, శక్తి సామర్థ్యాలు మొ॥ పరిగణనకు వస్తాయి. తరువాత అతడు నియమింపబడతాడు. అమాత్యనియామకంలో రాజు, మంత్రి సలహాలు

తీసుకొంటాడు. దీన్ని బట్టీ మంత్రిపదవి ఉన్నతమైనదనీ, అమాత్యపదవి అంతకంటే తక్కువదనీ తెలుస్తోంది. మహామాత్రపదం మంత్రి సామాన్యార్థంలో కనవస్తోంది (మేదినీ కోశం).

సచివ, మౌలి పదాలు సమానార్థకాలుగా వాడబడుతున్నాయి. ఇందులో మౌలిపదం విరలంగా ప్రయుక్తం. రామాయణాదులలో మంత్రి, అమాత్య, సచివ పదాలు సమార్థకాలుగానే వాడబడినాయి. అంటే సాంకేతికంగా వీటికి భిన్నత్వమున్నా, సామాన్యార్థంలో సమానార్థకాలుగానే సాహిత్యలోకసామాన్యం అన్నది గమన్యార్హం! దశరథుని మంత్రుల్ని ప్రశంసిస్తూ – వాల్మీకి, 'తస్యామాత్యాః' 'ఈదృశైః తై రమాత్యైః' అంటాడు. కనుక సామాన్యదృష్టిలో ఇవన్నీ సమానార్థకాలు, పర్యాయవాచకాలు.

ఇక మంత్రి సంఖ్య – ఇది, ఇదమిత్థంగా ఇంతని చెప్పలేం. కానీ అష్ట సంఖ్యాకులుగా అనూచాన సంప్రదాయం ప్రకారం పరిగ్రహింపబడిన దాఖలాలున్నాయి. దశరథుని మంత్రులు ఎనిమిది మంది. వీరిలో సుమంత్రుడు, సూతుడు కూడా. పట్టాభిషేక సర్గలో కనవచ్చే – అష్టవసువులతో ఉపమింపబడిన వారెవరు? మంత్రులేనా? పురోహితులా? కొందరు మంత్రులుగా కనవస్తారు. మంత్రిత్వం పురోహితత్వం రెండూ రెండు చేతులా నిర్వహించిన పరిణత ప్రజ్ఞులున్నారు. వశిష్టాదులుదాహరణం. మంత్రుల సంఖ్యపై, మనువు – ఏడు లేక ఎనిమిది ఉండాలంటాడు. ఎక్కువ మంది ఉండటం అభిలషితమే ఐనా దానివల్ల మరో ఇబ్బందీ ఉంది. రాజు, మంత్రి పరిషత్తులో ఆలోచించినా, తరువాత మళ్ళీ సూక్ష్మంగా దానిపై చర్చించాలంటే మరో ఆంతరంగికుడు దొరకడు. దీనికే అనవస్థాదోషమని పేరు. దీన్నానుసరాగా చేసుకొనే, బహుశా – ముఖ్య–ప్రధాన భేదాలు, తారతమ్యాలు, అభ్యర్హితత్వం ఏర్పడినాయి.

పైన చెప్పిన గుణపౌష్కల్యంతో పాటు అభ్యర్హితపూర్వత కూడా కల మంత్రి హనుమ! సుగ్రీవుడే అంటాడు, హనుమ నా మంత్రులలో ఉత్తముడని!

హనుమ మొట్టమొదట తనని రామలక్ష్మణులకు పరిచయం చేసుకొంటూ అంటాడు - 'తస్యమాం సచివం .....' అని. రావణునితోనూ అంటాడు, 'సుగ్రీవ సచివుణ్ణి' అని. అలాగే సుగ్రీవుడు చాలామార్లు కంఠోక్తిగా హనుమ నా సచివుడు, నా సచివోత్తముడు అంటాడు. సంపత్సమయాల్లో సుఖాలలో పాలుపంచుకున్నాడో లేదో తెలీదు కానీ, ఆపత్సమయాల్లో ఆదుకొని రక్షించి ప్రాణాలు నిలబెట్టి రాజ్యాన్ని ఇప్పించి పట్టాభిషిక్తుని చేయించినవాడు. ఇది హనుమ మంత్రప్రయోగకౌశలం, నీతి విచక్షణత!

ఈ సాచివ్యాన్ని సాధ్యమైనంత వరకు చూచేప్రయత్నం చేద్దాం.

రామలక్ష్మణులు సుగ్రీవ సాహాయ్యాపేక్షతో రావటం, హనుమ భిక్షు రూపంలో వారిని సందర్శించి - పరామర్శించటం, అక్కడ వారి సంభాషణం, ఆ సమయంలో హనుమ ఆలోచనలు - మాటలు.. ఇది హనుమలోని మంత్రిని ఆవిష్కరించే ఘట్టం!

తతః ప్రహృష్టో హనుమాన్ కృత్యవానితి తద్వచః,
శ్రుత్వామధుర సంభాషం సుగ్రీవం మనసా గతః.
భవ్యో రాజ్యాగమస్తస్య సుగ్రీవస్య మహాత్మనః
యదయం కృత్యవాన్ ప్రాప్తః కృత్యంచైతదుపాగతమ్.

ఇంతకుముందు సర్గసమాప్తిలో - 'మనస్సమాధ్రాయజయోపపత్తౌ సఖ్యంతదా కర్తుమియేషతాభ్యాం' అంటాడు, వాల్మీకి. అంటే అప్పటికే విషయోపపత్తి నిమిత్తమైనదిగా రామాగమనం స్ఫురించింది. దాంతో సుగ్రీవునితో సఖ్యం చేయించడానికి నిశ్చయించుకొన్నాడు. అంతేనా? సుగ్రీవుని రాజ్యం నిష్పన్నప్రాయమని తలచాడు, హనుమ. దీనివల్ల అతని రాజభక్తీ, రాజ్యానురక్తీ విదితమవుతున్నాయి. నిజానికతడు వచ్చింది వారు వాలితరపు మనుషులేమోనని తెలుసుకోవడానికి. అంతకంతె అధికంగానే వారి నుండి విషయాలను రాబట్టి,

వారిచే ప్రశంసితుడై వారి ఎదలలో చోటుచేసుకుంటాడు. (తరువాత తన ఎదనిండా రామణ్ణే నింపుకొన్నాడు. అదలా ఉంచండి).

ఇక్కడ వాలి మనుష్యులన్న భయంకానీ, అన్యరాజన్య కుమారులన్న చింతకానీ లేక రాజైన సుగ్రీవుని క్షేమాన్ని గురించి చింతించే హనుమ ఉత్తమ మంత్రికాక మరేమిటి? ఇక్కడ హనుమద్వైశిష్ట్యంతో పాటు రామాయణ మహాత్మ్యాన్నీ కించిత్పరిశీలించటం ఆవశ్యకం.

సుగ్రీవో మారుతింత్రత పేషయామాస -
మారుతి ప్రేషణంశ్రుత్వా సద్గురుంలభతే నరః,
రామ మారుతి సంవాద శ్రవణాద్రాజ్యమాప్నుయాత్.
(స్కాందపురాణం)

మనోజ్ఞ గంభీరమైనటువంటి ఈ విషయాన్ని వ్యాఖ్యాతలు - 'అనేన ఏతావద్ ఆచార్యాభిమాననిష్ఠః తేషాం కార్యం తద్వచనా దేవకరిష్యామీతి భగవతః ప్రతిజ్ఞా సూచితా' అంటూ ఉదాత్త రమణీయంగా తత్త్వార్థగహనమైన సన్నివేశ సమావిష్కరణం చేస్తారు.

సర్వవానర బంధువులతో వాలి కౌర్ధ్వ దైహిక క్రియల నాచరించి ఆర్ద్రవస్త్రాలతో వచ్చినిలచిన సుగ్రీవుని, రామునికి చూపి తదనంతర కార్యం నిర్వహించమని ప్రరోచన కావిస్తాడు, మంత్రి ఐన హనుమ.

భవత్ప్రసాదాత్ సుగ్రీవః పితృపైతామహం మహత్,
వానరాణాం సుదుష్ప్రాపం ప్రాప్తో రాజ్యమిదం ప్రభో!
భవతా సమనుజ్ఞాతః ప్రవిశ్య నగరం శుభం,
సంవిధాస్యచ కార్యాణి సర్వాణి ససుహృజ్జనః ...
... కురుష్వ స్వామి సంబంధం వానరాన్ సంప్రహర్షయన్.
(కి॥ 26-4-8)

వాలివధ నీ వలన జరిగింది, అవటంలో స్వభావతః (చపలతగల) వానరులైనప్పటికీ వాలికి భయపడి ఒదిగి ఉన్నారు. ఇప్పుడు వాలిని మించిన వాడివి నువ్వున్నావు. నీకు భయపడి పాదాక్రాంతులై ఉన్నారు, వీరంతా. నీ దయవలన సుగ్రీవునికి పారంపరికంగా రావలసిన రాజ్యం సంప్రాప్తిస్తోంది. నీ వనుజ్ఞనిస్తే నగరాన్ని ప్రవేశిస్తాడు – చూడండి, ఎంతనీతితో, మరెంతో వినయంతో సంప్రార్థిస్తున్నాడో హనుమ!

సుగ్రీవునలా నిలబెట్టాడు. తానే సర్వమూ నిర్వహిస్తున్నాడు. ఈ కార్యపరంపరంతటికీ దయావ్యయ పయోనిధి దాశరథి హేతువని ఆతని ప్రశంసిస్తూ – కృతజ్ఞతావిష్కరణం పేరున, ఒక వేళ ఎవరేనా వాలిపక్షం వారు ఉండి, రేపు మళ్ళా అంతర్గత కలహాలు లేవనెత్తుతారేమోనన్న శంకతో, వారి మనోబుద్ధి ప్రక్షాళనం చేయడానికి ఈ ప్రసంగం కావించాడు మహామంత్రి హనుమ.

అంతేకాదు, 'నీ వనుజ్ఞనిస్తే నగరాన్ని ప్రవేశిస్తాడు'. అంటే, ఇన్నాళ్ళు నీలాగే అరణ్యాలు పట్టుకు తిరిగాడు. ఆ తిరగటంలోనూ నీకు స్వేచ్ఛ ఉంది. ఇతడికదీ లేదు. వాలి భయం వల్ల మతంగాశ్రమ ప్రాంతంలో మసలి, నీ వల్ల ఆబాధలనుండి విముక్తుడయ్యాడు. రాజ్యప్రవేశానికి నీవనుజ్ఞ ఇయ్యి. ఈ కష్టం నీకు తెలుసు. కనుక అనుక్రోశంతో ఆదుకో. వానరులంతా హర్షోత్కర్షని ప్రకటిస్తున్నారు. వారికి రాజుగా సుగ్రీవుని నీ చేతులతో చెయ్యమని అంటాడు, హనుమ.

శ్మశానం నుండి తడిబట్టలతో వచ్చి ఉన్నారు వారు. అక్కడ చితిపై శవమింకా పూర్తిగా కాలలేదు. అప్పుడే రాజ్యాభిషేకం! అంటే, రాజ్యం అరాజకం కాకూడదు. సుగ్రీవునికి లభించిన అవకాశం వృథా పోకూడదు. వాలి తరపువారెవరూ తలెత్తకుండా ఉండాలి. ఏకక్రియతో బహ్వర్థాలను సాధించదలచుకొన్నాడు. కనుకనే భారమంతా రాముని భుజస్కంధాలపై పెట్టాడు, ప్రశంసావ్యాజంతో – వీటిని వేటినీ బయల్పడనీక. ఇది హనుమ బుద్ధిమత్తకు ప్రబలోదాహరణం.

వాలిచే తరిమివేయబడి సుగ్రీవుడు నాలుగు దిక్కులకీ పరుగులు తీస్తాడు. వాలి వెంటబడతాడు. ఇది దీర్ఘ క్రోధమే కాదు, పగ! బద్ధ శత్రుత్వం వహిస్తాడు, వాలి. అపుడు హనుమ తన ధీచాతుర్యంతో వాలికి మతంగ మహర్షి యిచ్చిన శాపోదంతాన్ని గుర్తుచేసి, మతంగాశ్రమ ప్రాంతం మనకి క్షేమంకరమని అక్కడ తలదాచుకొందామంటాడు. ఆ అనటం భవిష్యత్తుని దృష్టిలో ఉంచుకొనే అని ఉంటాడు. పొంచి ఉండే లక్షణం ఇక్కడ కనవస్తుంది. ఈ రకంగా వాలిబారినుండి సుగ్రీవుని రక్షించడంలో సైతం హనుమ మంత్రిత్వమవగతమవుతోంది.

తరువాత, సుగ్రీవుని హెచ్చరించే సందర్భం గమనించదగినది. శరత్తువచ్చినా సుగ్రీవునిలో సీతాన్వేషణ సరంభం కనరాదు. ఆంజనేయుడు సుగ్రీవుని హెచ్చరిస్తాడు. ఐనా, రాజ్యమదం వల్ల సర్వావినయాధిష్ఠానతను పొంది – 'కాలదష్టాఇవ మహామంత్రై రపి నప్రతిబుధ్యంతే' అని శుకనాసుడన్నదీరీతిలో సకలదోషాయతనమై ప్రవర్తిస్తాడు.

ఈ దోషాలన్నిటివల్లా సుగ్రీవుడు హనుమ మాటలను అలక్ష్యం చేసి, తరువాత రాముని క్రోధానికెరవుతానన్న భయంతో సీతాపదాన్వేషణ కార్యనియోజన చేస్తాడు.

సుగ్రీవునిలో ఓ మనోజ్ఞమైన గుణం ఏమంటే, ఎప్పుడూ మంత్రులతో కూడి ఉండటం. ఆయనచుట్టూ ఎప్పుడూ మంత్రులుంటారు. సుగ్రీవుని ఆలస్యం చూసి తానతని దృష్టిలో చుల్కన ఐనానా అన్న శంకతో జానకీ వియోగవ్యథ రెట్టింపు అయి, లక్ష్మణుని ద్వారా హెచ్చరిస్తాడు, సుగ్రీవుణ్ణి – రాముడు. అంతఃపురాలలో ఎక్కడో అయిపు లేకుండా ఉన్నవారికి అంగదునిద్వారా వార్త పంపుతున్నాడు, లక్ష్మణుడు. అంగదునితో పాటు మరో ఇద్దరు మంత్రులుంటారు. వారూ లోనికి వచ్చి సుగ్రీవుని వద్ద రామలక్ష్మణులను ప్రశంసిస్తూ ప్రసంగించి ప్రతిపక్షనిరాసాధ్యవసాయం నుండి నీవు జారిపోయి

రాజ్యభోగపరుడవై రామచంద్రునిపట్ల అపచరిస్తున్నావు. ప్రణిపాత ప్రసన్నులైనవారి అనుగ్రహాన్ని అభ్యర్థించు – అని హెచ్చరిస్తారు. వీరు ఆంతరంగికులు. ఎందుకంటే 'దారదర్శినౌ' అంటాడు కవి. అంటే అంతఃపురస్త్రీలున్నపుడు సైతం అక్కడికీ వెళ్ళి రాజుతో రాజకీయ ప్రసంగాలు చేయగల్గినవాళ్ళు అని అర్థం. అంతేగాక, 'మంత్రేషు పరినిష్ఠతులు!' కనుక ఆంతరంగికుల య్యారు. (దశరథ మంత్రుల్లో సుమంత్రుణ్ణిలా సంభావిస్తాడు, రాముడు).

ఈ సందర్భంలో హనుమ సుగ్రీవుని దగ్గరే ఉంటాడు. కానీ, ఏం మాటాడడు. ఎందుకంటే – అంతకుముందే తాను సుదీర్ఘమైన ఉపదేశాన్ని చేస్తాడు. ఇది హనుమ మంత్రిత్వానికే కాదు వ్యక్తిత్వానికీ మణి దర్పణం.

మనకి కావలసిన పని అయిపోయినదని, నూతన రాజ్య ప్రమదాలాభంతో కామవ్యాపారపరతంత్రుడై అన్యమెరుగక ఉన్నవానికి కిష్కింధాప్రస్థాన సమయంలో రామానుజ్ఞాతమైన కాల మాసన్నమైనదని కామాసక్తుడైన వలీముఖ ప్రముఖుని హెచ్చరిస్తూ-హితం తత్త్వంచ పథ్యంచసామధర్మార్థ నీతిమత్ – ఐన వాక్యాన్ని, 'ప్రసాదవాక్యైర్మధురైర్హేతు మద్భిర్మనోరమైః'... ఇటువంటి మాటలతో చెప్తాడు. ఇదంతా పెడచెవిని పెట్టిన సుగ్రీవుడు, క్రోధంతో మండిపడే లక్ష్మణుడు ద్వారదేశంలో ధనుష్టంకారాలతో నిలువబడి ఉన్నాడనివిని, ఉల్కిపడతాడు. ఐనా సర్దుకొని, 'నమేదుర్వ్యాహృతంకించిత్ నాపి మే దురనుష్ఠితమ్' అని, నా గురించి కిట్టనివాళ్ళెవరో రామునితో చెడుగా చెప్పారు. ఐనా, రామలక్ష్మణులకు నేను భయపడటం లేదు. మిత్రత్వం! అందుకే బాధపడుతున్నాను – అని నిజభయకృత మానస చలనాపహ్నుతిని ఆస్థాన కోప సంభావనం చేత ప్రకటిస్తాడు. అంత వరకూ మౌనంగా ఉన్న హనుమ పెదవి విప్పుతాడు.

'ఉవాచ స్వేన తర్కేణ మధ్యేవానరమంత్రిణామ్'. ఇక్కడ హనుమతర్కాం గమనింపదగ్గది. ఇది కేవలం సుగ్రీవునితో పల్కినదికాదు. మంత్రులందరి మధ్యా

సుగ్రీవునితో అన్నది. అంటే అప్పటికే చిన్న 'సైజు' సమావేశం ఏర్పాటయిందన్నమాట. అందులో యథార్థాన్ని యథాతథంగా చెప్పటం (సోపపత్తికంగా), గమనించాల్సింది.

'సర్వథా నైతదాశ్చర్యం యస్త్వం హరిగణేశ్వర,
న విస్మరసి సుస్నిగ్ధముపకారకృతం శుభమ్.
రాఘవేణతు వీరేణ భయముత్సృజ్య దూరతః
త్వత్ప్రియార్థం హతో వాలీ శక్రతుల్య పరాక్రమః
సర్వథా ప్రణయాత్క్రుద్ధో రాఘవోనాత్ర సంశయః
భ్రాతరం సంప్రహితవాన్ లక్ష్మణం లక్ష్మివర్ధనమ్.'
(కి॥ 32 = 10-12)

ఉపకారం మర్చిపోలేదు. ఇది ప్రశంసే నిజానికి. కానీ, దీనివెనక ఎత్తి పొడుపు ఉన్నది. చేసిన మేలు మరిచి పోలేదంటున్నావు. అందులో ఆశ్చర్యపడలసిందేమీ లేదు. ఆ మేలు పొందావు కనుకనే ఈనాడిలా భోగాలనుభవిస్తున్నావు. లేకపోతే, ఒక్కమాటు ఊహించుకో, నీ స్థితి ఎలా ఉంటుందో, మరి! ఇంతటి ఉపకారం చేసినవానికి ప్రత్యుపకారం చేస్తానన్నావు. ఆ మాటే మరిచిపోయావు - ఇంత నిగూఢభావంతో అంటే సుగ్రీవుడు అర్థం చేసుకోలేడేమోనని -

త్వం ప్రమత్తో న జానీషే కాలం కాలవిదాంవర....
ప్రాప్తముద్యోగకాలంతు నావైషి హరిపుంగవ,
త్వం ప్రమత్త ఇతి వ్యక్తం లక్ష్మణోయ మిహాగతః,
ఆర్తస్య హృతదారస్య పరుషం పురుషాంతరాత్,
వచనం మర్షణీయంతే రాఘవస్య మహాత్మనః,
కృతాపరాధస్య హి తే నాన్యత్ పశ్యామ్యహం క్షమమ్,
అంతరేణాంజలింబధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్.'
(కి॥ 32 = 13-17)

అని, వాచ్యంగా వాని దౌష్ట్యాన్ని విప్పి చెప్పాడు. ఇక్కడ కృతాపరాధమన్నమాట అపరాధనిశ్చాయకం. అనుమానమేం లేదు. నిశ్చయంగా నీవు అపరాధం చేశావు. అయిపోయింది. పోనీ, అపచారారంభం ఐతే, అప్పుడైనా అనుతాప మేర్పడితే, ఏదో లఘు ప్రాయశ్చిత్తం ఆచరించి పాపవిముక్తుడు కావచ్చును. కానీ, ఇక్కడ - అపరాధం జరిగిపోయింది. దీనికి నీ ప్రమత్తత హేతువు. అప్పుడేం చెయ్యాలి? సాంత్వనమే కార్యం! లక్షణస్వామి పాదాలమ్రోల సాంజలివై సాగిలపడు. మంత్రిగా ఉండి ఇదా నీవు చెప్పేది? ఇది, నాకూ నా రాజ్యానికీ అవమానం కాదా? అని, అహంకరించవద్దు. నా పరుషవచనాలకి, నీకు, ఆగ్రహం రావటం సహజమే. కానీ,

'నియుక్తైర్మంత్రిభిర్వాచ్యోహ్యవశ్యం పార్థివోహితం,
అత ఏవ భయంత్యక్త్వాబ్రవీమ్యవధృతం వచః.'

హీనవృత్త్యోపదేశం కాదు. నిజాన్ని నిర్భయంగా చెప్తున్నాను. రాముని ఎదిరించి నీవు నిలువలేవు. అంతేకాదు, నీవు సమయభంగం చేసి దుష్టుడవుకావద్దు. ఆయన బలం = కేవలం స్వాభావికమైనది = దివ్యాస్త్ర ప్రమేయ విరహితమైనది, ఏమిటో నీకు తెలుసు. సాలగిరిభేదనం దృష్టాంతం. కనుక ఆయన ఆజ్ఞను అతిక్రమించి అన్యథా ప్రవర్తించటం ఎంత ప్రమాదకారో తెలుసుకో! రామశాసనాభ్యుపగమ నియమనానికి ఆయన స్వాభావిక బలమే పర్యాప్తం. ఇంక దివ్యాస్త్రాలూ, మరోటి, మరోటీ... అనపేక్షితాలు - అని, వాలి పథానుగమనం నుండి సుగ్రీవుని రక్షించాడు, తన మంత్ర నిపుణత వలన హనుమ.

నిజానికి తన మాటలింతకు ముందు నిరాదరించాడు. తిరస్కరించి, నిరాకరించి పోయాడు. ఇవి బయటకి బాహాటంగా వెల్లడించకపోయినా రెండోవారు వుళ్ళా హనుమ ఇంతగా వివరించనక్కరలేదు. కానీ రాజ్యక్షేమంతోబాటు సుగ్రీవ క్షేమం కోరాడు, హనుమ. సుగ్రీవుడు సుఖంగా ఉండాలి. ఆ ఉండటంకూడా సర్వప్రశంసనీయమైన [illegible]లో, పద్ధతిలో ఉండాలి.

కనుకనే భ [illegible] పని చేపట్టినా, వదలక వెన్నంటి ఉండి క్రమంగా కార్యాన్ని సాధించుకుంటాడు హనుమ.

ఈ విధంగా హనుమ కిష్కింధా సామ్రాజ్య మహా మంత్రిగా మనకు కనవస్తాడు. సుందరకాండలో హనుమ సుగ్రీవ సచివునిగా తనను తెల్పుకొంటాడు.

వాల్మీకే - 'దదర్శ పింగాధిపతేరమాత్యం' **(31-19)** అంటాడు. 'అహం సుగ్రీవ సచివో హనుమాన్నామ వానరః' **(34-39)** అని సీతమ్మకి తనని పరిచయం చేసుకొంటాడు. రావణసభలో - మంత్రిననడు కానీ, దూతను, భృత్యుణ్ణీ అంటాడు. మళ్ళీ, లంకనుండి తిరిగి వచ్చి - యావద్వృత్తాంతాన్నీ సహచరవనచరులకు నివేదిస్తూ 'రామ దూతంచమాం విద్ధి సుగ్రీవ సచివం కపిం' **(58-133)** అని పల్కినట్లు చెప్తాడు.

ఏమైతేనేం, హనుమ సాచివ్య మీరకంగా సాక్షాత్కరిస్తుంది. దీని వలన ఆయన నీతికుశలత, మంత్ర ప్రయోగ నైపుణ్యం, రాజ్యపరిరక్షణ దక్షత, రాజ కుటుంబాభిమానం వ్యక్తమౌతున్నాయి. అభిమాన - ఆభిజాత్యాలతోపాటు మొగమోటమిలేక ముఖం మీదే పొగడ్తేనా తెగడ్తేనా తెగవేసి చెప్పేధీరతా మనకు తెలుస్తున్నాయి. తానే కాక, తనవారంతా నీతిమంతులుగా, బుద్ధిమంతులుగా, శ్రద్ధాళువులుగా, కృతజ్ఞులుగా, అకృతఘ్నులుగా, మాట నిలుపుకొనే మంచి మనుషులుగా, మనస్వులుగా, మనగలగాలని ఆకాంక్షించే మహా మంత్రి హనుమ.

విద్వాంసుడు, మాటకారి, ఉద్దిష్టకార్యాలతో పాటు ఆనుషంగిక కార్యాలనీ సాధించి, చక్కపెట్టే నేర్పరి. కనుకనే మంత్రిగానే కాక దూతగా, యోద్ధగా కూడా ప్రకాశించిన వాడితడు. రాముడు, అసలితనిలోని దూతలక్షణాలనే ప్రశంసిస్తాడు. రావణాదులు ఇతని లోని వీరత్వానికి వెరచారు.

సుగ్రీవుడితనిలోని ధిషణకు దాసోహమన్నాడు. ఎంతో ప్రత్యయాన్ని ప్రకటిస్తాడ
'హనుమాన్ యత్ర నేతాస్యాత్ న తస్యగతి రన్యథా' అని!

అలాంటి బుద్ధిమతాంవరిష్ఠుని ధీవైభవాన్ని అందినంతవరకు అంచ
వేసే ప్రయత్నంలో ఎంతవరకూ కృతకృత్యుణ్ణి అయానో? ఏమైతేనే
ఏటికేతామెత్తలేంకదా!

# దూతగా హనుమ

హనుమ కనేక నామములున్నను ఆయనను రామదూత అని వ్యవహరించుట ఆయనకు పరమామోదమును కూర్చునది. తాను స్వయముగా 'దూతోహం', 'దాసోహం'[1] అని తనను గూర్చి చెప్పుకొంటాడు.

దౌత్యం పటుకరణ ప్రాణి సాధ్యం. మబ్బుతునకల చేత, గాలిపెరల చేత చేయించు దౌత్యములు కావ్య ప్రపంచ పరిమితములు. లోక వ్యవహారమున జీవనాధారభూతమైన వ్యక్తు ల మధ్య ఘటక శక్తులుగ వ్యవహరించి, వారి బతుకుల నతుకు సామర్ధ్యము కల్గి ఉన్నవాడే దౌత్యక్షముడు. ముఖ్యముగ దూత వినీతుడు కావలెను[2]. వాగ్మి కావలెను. దీనికి జన్మ సహజమైన సంస్కారముతో పాటు చక్కని విద్యా వ్యాసంగము తోడుండవలెను. 'దూతంచైవ ప్రకుర్వీత సర్వ శాస్త్ర విశారదమ్' అని, సర్వ శాస్త్రాభిజ్ఞుని దూతగా నియమించాలి. కానీ, ఆబాలగోపాల సాధారణమైన లోక వృత్తాంతాన్ని సైతం వ్యక్తీకరించలేని వానరమా?[3] అంటే, అలాక్కాదు - హనుమ ఆదర్శప్రాయుడైన దూత - లోకమున, కావ్యలోకమున కూడా విజ్ఞతతో, విచక్షణతో వ్యవహరించిన వాడీతడు. రామునికి ప్రథమ సందర్శనమున హనుమలో సద్దూత లక్షణములే కన్పించినవి. వాని మాటలలో వాగ్మి కనపడెను. అందుకే రాముడు హనుమద్ వాగ్విలాసాన్ని [4] ప్రశంసించాడు. ఆ ప్రశంస కేవలం ఔపచారికం కాదు. ఔపచారిక ప్రసంగానికక్కడ తావులేదు. అది యధార్థం. హనుమ యొక్క వైదుష్యాన్ని బుద్ధికౌశలాన్నీ ప్రశంసించి - ఒకరాజుకి అట్లాంటి వ్యక్తి ఎంతటి సహాయకారో చెప్తాడు.

క్రొత్తగా మనకొక వ్యక్తి కలసినపుడు మొహామ్మీదే ''నువ్వెవరు? నీ పేరేమిటి? ఎందుకొచ్చావు?'' అని ప్రశ్నించటం అమర్యాద. రామలక్ష్మణుల్ని కలసిన హనుమకీ ప్రశ్నలన్నిటికీ సమాధానం కావాలి. కానీ, అలా అడగడు. ఐనా, సమాధానాలను రాబట్టటానికి, ప్రశంసా వ్యాజంతో కులగోత్రనామధేయ

నిజం బయటపడుతుంది. ఇది వాక్చాతురి. అయితే, మాటలలో పొందికే కాదు. మాటలాడే తీరూ వ్యక్తి యొక్క వైశిష్ట్యాన్ని వైలక్షణ్యాన్నీ పట్టియిస్తుంది. కనుకే హనుమవాణిలో 'అంతర్వాణి' భాసించింది శ్రీరామునికి. హనుమ యొక్క వాక్చాతుర్యాన్ని ప్రశంసించి, బుద్ధి చాతుర్యాన్ని ప్రశంసిస్తూ ఇట్లాంటి వాడు దూతగా ఉంటే, రాజుకి ఎంత ప్రయోజనం ఏర్పడుతుందో చెప్తాడు.

ఏవం విధోయస్య దూతో నభవేత్ పార్థివస్యతు,
సిధ్యంతి హి కథం తస్య కార్యాణాంగతయోనఘ,
ఏవం గుణగణైర్యుక్తా యస్యస్యుః కార్యసాధకాః,
తస్య సిధ్యంతి సర్వార్థా దూతవాక్య ప్రచోదితాః
(కి॥ 4 = 34 - 35)

హనుమలాంటి వాడుంటే సరే, లేకుంటే? అందుకే ముందు (ఆ ప్రశ్నకి జవాబా అన్నట్లు) అలాంటి దూత లేకుంటే రాజుకి ఏ పనీ జరగదు అంటాడు. శాస్త్రకారులు, దూతల్ని నియమించేటపుడు తీసుకోవలసిన జాగ్రత్తలూ, నియమాలూ చెప్పారు.

దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్ర విశారదమ్,
ఇంగితాకార చేష్టజ్ఞం శుచిందక్షం కులోద్గతమ్,
అనురక్తః శుచిర్దక్షః స్మృతిమాన్ దేశకాల విత్,
వపుష్మాన్ వీతభీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే.
(మను-7 - 63, 64)

ఇది మనూక్త దూతలక్షణం. వాఙ్మాధుర్య వైధుర్యం సుహృదులకు కూడా అప్రియమే. ఇక దుర్హృదుల మాట చెప్పనక్కర లేదు. కనుక దూతకు ద్రాక్షాధిక్షేపదక్షమైన వాగ్మిత ఆవశ్యకం. సామాన్యంగా దూతలకు అభిలషితమైన

ఈ సామగ్రి సమగ్రత ఉండదు. కానీ, హనుమ విషయంలో ఆ లోటు లేదు. ప్రతి లక్షణం లక్షణంగా హనుమలో ద్యోతకమవుతుంది.

హనుమ శాస్త్రవిశారదుడు. నవవ్యాకరణ పండితుడు. ఇంగితాకార చేష్టజ్ఞుడు [5]. ఇంగితజ్ఞత అనగా - అవతలివ్యక్తి మనసులోనున్న మాటను అతడు చెప్పకుండగనే తెలిసికొనగల నేర్పు. ఇంగితజ్ఞత - సుగ్రీవ, శ్రీరామ కార్యనిర్వహణంలో మనకు ద్యోతకమవుతుంది. శుచిత్వం చెప్పనక్కరలేదు. రావణాంతఃపురంలో అంతఃపుర స్త్రీల మధ్య సీతాన్వేషణైక చిత్తంతో సంచరిస్తూ, సీతను కానక, పరస్త్రీలను పరికించి చూచి పరిశీలించవలసి వచ్చినందుకు పరితాపాన్ని ప్రకటిస్తాడు.

వీతభీః - తానొకడు. వంద యోజనాల సముద్రాన్ని దాటివచ్చాడు. పరప్రదేశం. శత్రువులో, నిశాచరులు! ఐనా, అట సంచరించటానికి గానీ, అన్వేషించటానికిగానీ, ఆపై రాక్షసులతో తలపడటానికిగానీ, రావణసభలో రావణాదులు తర్జించి, చంపమని తర్జనభర్జనలు చేసినపుడుగానీ చలించని ధైర్యశాలి. సముద్రాన్ని ఎగిరి దాటడమెలాగో, దానిలోని సులువు- బలువు లేమిటో, లంక ఎంతదూరంలో ఉందో, ఎలా దుర్గాన్ని ప్రవేశించాలో......... ఏమీ తెలీకపోయినా, సముద్రలంఘన, లంకాభిగమన, సీతాన్వేషణాది కార్యాలు అత్యంతావశ్యకమని సిద్ధపడతాడు.

దేశకాలాల్ని ఎరిగి మాట్లాడటం - ఇది అసలు కావలసింది. ప్రతివ్యక్తీ మాటాడతాడు. ఎప్పుడు, ఎవరిముందు, ఏ మాట ఎలా మాటాడాలో తెలిసినవాడే వాగ్మి. ఇది హనుమకు తెలిసినంతగ మరొకరికి తెలియదు. కనుకనే సుగ్రీవుడు హనుమని పంపుతాడు. రామలక్ష్మణులని (అనుమానిస్తూ వారి) ఎరించి తెలిసికోవడానికి. అప్పటి హనుమ మాటలు - దాన్ని రాముడు ప్రశంసించటం గమనించాలి. అంతేకాదు హనుమ దూతల్ని గురించి, వారి అహంభావాన్ని గురించి ప్రసంగించి నిరసిస్తాడు. ఎంతో సంయమనం కనబరుస్తాడు.

వ్యక్తికి కావలసింది వ్యక్తిత్వం! మనిషికి కావలసింది మానవత్వం! సాధారణంగా ఇవి మృగ్యాలు. అవి ఉంటే వాడు మనిషి కాదు, మనీషి! మానవ్వుడు కాదు, మహనీయుడు!

హనుమ రాక్షసీగణ మధ్యంలో సీతను కలుసుకోవటానికి ముందు అంతఃపురంలో అభ్యంతరమందిరంలో ప్రత్యవకాశం గాలించి, శోధించి సీతని కానక ఎంతో ఓపికతో ప్రతి స్త్రీని పరికించి చూచి, లక్షణాలను బట్టి వివేచించి, ఔనా? కాదా? అని, నిశ్చయించాల్సి వస్తుంది. దానికి కారణం సీత నాతడెరుగకపోవడం. అందువల్ల స్త్రీ గణాన్నంతటినీ ఎంతో నిశితంగా పరిశీలించాలి. దానికి జాగరూకత, విమృశ్యకరణం కావాలి. కనవచ్చే రాచకన్నెల్లో జనకసుత ఏదో వివేచించాలి. చూసీచూడగానే పోల్చలేకపోవచ్చు. అలా పొరబడే పరాభూతుడయాడు కవిచేత - 'నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్!) (సుం - 10 - 54).

సరే, ఇలా అన్వేషిస్తున్న హనుమ స్త్రీగణమధ్యంలో సంచరించటం 'అనుచితం' అనుకుంటాడు. కానీ, దానిని సమర్థించుకొని, తనకే విధమైన మనోవికారం కలగక పోవటం వల్ల[6]. తన బ్రహ్మచర్యవ్రత చ్యుతి యేర్పడలేదు. 'మనో హి హేతు స్సర్వేషామింద్రియాణాం ప్రవర్తనే, శుభాశుభా స్వవస్థాసు తచ్చమే సువ్యవస్థితమ్'.

నష్టమైన వస్తువులను వెతకటానికి - ఆ వస్తు జాతిలోనే వెతకాలి. 'నశక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుం' అని అంటాడు అది సరే, సాబే!

లంకాదహన కారణం - పుచ్ఛాన్ని కాల్చటం, దానికి కారణం - వనభంజనం, దానికి కారణం - రావణదిదృక్ష. దానిక్కారణం - కార్యాంసుగమం

దౌత్య ప్రేరణ - సీతారాముల అనురూప్యం!
యాతుధానాధి నాథ సదనంలో బంధీకృత అయిన ఆమె!
వైదేహీ విశ్లేష వైక్లబ్య విదూయమాన మానసుడాతడు!
'రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా' (సుం. 17-15).

ఈమె కోసం ఎన్ని పనులు చేశాడు, రాముడు! వాలివధ, కబంధనిపాతనం, విరాధవధ, చతుర్దశ సహస్ర సంఖ్యాక రాక్షస సంహననం, ఖరత్రిశిరసుల వధ, దూషణ నిషూదనం, వీటన్నిటికంటే ముఖ్యమైంది. నా సముద్ర లంఘనం. ఈమె కోసమే కదా! సకల సాగరవేలావలయిత మహా మహీమండలాన్నే కాదు సకల చరాచర జగత్తునీ - ఈమె కోసం - తలక్రిందులు చేసినా ఉచితమే. త్రిలోక సామ్రాజ్యాన్నీ సీతతో పోలిస్తే- ఆ సామ్రాజ్యమంతా సీతలో ఒక అంశమాత్రానికి సరితూగదు. అట్లాంటి సీతనెడబాసి- 'దుష్కరం కురుతే రామః!'.

రాముని కోసం ఆమె, ఆమె కోసం రాముడు ప్రభవించారు. వారిమధ్య విశ్లేషం వారికే కాదు మనకీ బాధాజనకమే అని మళ్ళీ వెతకటానికి ఉద్యమించాడు. భూయిష్ఠంలోళితా లంకా..... లోళితా వసుధా సర్వా....ప్చ్!.... సీత కనబడలేదు. ఆమె... వినష్టా.... వా..... ప్రణష్టా.... వా....మృతా....వా..?... ఎందువల్లనంటే, అక్కడి సన్నివేశ మట్లాంటిది! రావణాంతఃపురంలో, కాదు లంకానగరంలో ఎక్కడున్నా రాక్షసుల తర్జనం-భర్త్సనం - ఇప్పుడేం చేయాలి? సీతను చూడక వెనుకకు పోయేటట్లయితే నేనేం సాధించినట్లు, ఎందుకీ సముద్రలంఘనం చేసినట్లు? లంకలో ఎందుకు ప్రవేశించినట్లు? నేను తిరిగి వెళ్లడమేవిఁటి, సుగ్రీవాదులు విశేషాలు అడుగుతారు. రామునికేం చెప్తాను? సీతకనబడలేదంటే, రాముని ప్రాణాలు నిలుస్తాయా? 'సీతా నిమిత్తందుర్వాక్యంశ్రుత్వా స న భవిష్యతి!'.

'సోహం నైవం గమిష్యామి కిష్కింధాం నగరీమితః' - వెళ్లను. వానప్రస్థుడినై ప్రాయోపవిష్టుడనై ఇక్కడే ఉంటాను. లేదా జలప్రవేశం చేస్తాను. సీతను చూసేంతవరకు ఇక్కడనుంచి కదలను. సీత కన్పించేంత వరకు ఈ లంకలో మళ్ళీ మళ్ళీ:... మళ్ళీ మళ్ళీ... వెతుకుతూనే ఉంటాను.

ఇది సమతుల సమాలోచనం! (Balanced thinking). పని సానుకూలం కానపుడు ఉద్రేకంతో మొత్తం పనిని పాడుచేయటం మానవ సహజం! అలా కాకుండా, తితిక్షతో - పూర్వాపర కార్య వివేచనతో కార్యాన్ని సానుకూల పరచటం వివేకి లక్షణం. కనుకనే హనుమ ఇంతగా మంచి చెడ్డల్ని బేరీజు వేస్తాడు. తాను తొందరపాటుగా తిరిగి వెడితే జరిగే అనర్థం ఏమిటో నిశ్చితంగా తెలుసు కనక, మళ్ళీ వెతకాలని సిద్ధమవుతాడు. సాధిస్తాడు.

సీత కన్పించినది. నా పని సీత జాడ తెలుసుకోవటమే. తిరిగి వెళ్ళి రామునికీ, సుగ్రీవునికీ ఈ సంగతి నివేదించటం, అంతే! కానీ, అప్పుడు సీత ఉన్న పరిస్థితి చూస్తే- రాక్షసీ గణమధ్యంలో - సంభర్త్స్యమానయై, భయత్రస్తయై, విరహ విత్రాసంతో, జీవన్మరణ దుస్సహ సంకటస్థితిని తలచుకొని శోకాకులయై ఉంటే, ఆమెను పల్కరించి, ఓదార్చాలా? అక్కరలేదా? నేను కనుపించి, మాటాడకుండా పోతే - 'పరిత్రాణమవిందంతీ జానకీ జీవితం త్యజేత్'. కనుక ఈమెను పలుకరించి ఓదార్చటం యుక్తం. కానీ, నిశాచర సహచారిణుల మధ్య నున్న ఈమెతో మాట్లాడట మెలా? ఈ రాత్రి గడాచేలోగా మాటాడాలి. లేకుంటే, సీత ప్రాణత్యాగం చేస్తుంది. సందేహం లేదు. అక్కడ, రాముడు - 'సీత ఏమంది?' అని అడిగితే నేనేం చెప్పాలి? సీతా సందేశరహితుడనైన నన్ను రాముడు చూపులతో కాల్చేస్తాడు. లేదూ, సుగ్రీవుని యుద్ధ సన్నద్ధుడిని చేసి తోడ్కొని వచ్చినా, అదీ వ్యర్థమే అవుతుంది. ముందసలు సీతను ధైర్యంగా ఉండమనాలి. ఈ రాక్షసులు ఏమరి ఉండగా మాటాడాలి. కానీ, నేను 'అతితనుః' 'వానరః!'. సంస్కృతంలో మాట్లాడాలి. అప్పుడు సీత నన్ను రావణుడిగా భావిస్తుందేమో? వానరం మాటాడితేనే వింత కదా! ఐనా మాటాడాలి.

రాక్షసులవల్ల భయమందిన ఈమె 'భూయః(తాసంగమిష్యతి' అప్పుడేమైనా అరచిందో, రాక్షసులు మేల్కొంటారు. విఘ్నం అవుతుంది. అంతేకాదు, రావణుడు క్రుద్ధుడై రాక్షసుల్ని నాపైకి పంపుతాడు. పెద్ద యుద్ధమవుతుంది. హింసాభిరుచిగల వారు సీతను కూడా హింసిస్తారు. నేను వారిని యుద్ధంలో జయిస్తాను. కానీ, ఆ పై సాగరలంఘనం కష్టం! అప్పుడు సీత జాడ రామ సుగ్రీవులకు తెలియదు. పర్యవసానంగా ఉద్యమం మొత్తం వ్యర్థమవుతుంది. సీతానభిభాషణం వల్ల ఇంతటి అనర్థం వాటిల్లుతుంది. దేశకాల విరోధులైన దూతలు కార్యాలను ఇలాగే నాశనం చేస్తారు[8]. పండితమ్మన్యులైన వారు కార్య విఘ్నం మాత్రమే చేయగలరు.

న వినశ్యేత్కథం కార్యం వైక్లబ్యంన కథంభవేత్,
కథంను ఖలు వాక్యంమే శ్రుణయా న్నో ద్విజేత వా.

ఇతి సంచింత్య హనుమాన్ (చకార మతిమాన్మతిం) - రామగుణ సంకీర్తనం ప్రారంభిస్తాడు. సంకీర్తనం సీతా ప్రత్యయార్థం. సీత సందేహించింది. తన వాక్పుణ్యంతో ఆమెకు ప్రత్యయం కల్గించాడు. మరుభూమిలో మరకతాలు మొలకెత్తినట్లు ఆమె హృదయ కేదారంలో రామసమాగమ కాంక్ష ఆశాంకురమై మోసులెత్తింది. తాను వచ్చిన పని పూర్తి అయినది. కాదు, ఇంకా కొంత మిగిలి ఉంది. రాక్షసుల బలం, దుర్గ నిర్మాణ విధానం పరీక్షించాలి. చతుర్విధోపాయాలలో దండమే తగినది. తామసులు వీరు. కనుక సామము పనికి రాదు. ధనమదాంధుల వద్ద దానము కుదరదు. బలదర్పితులు భేదముచే అభేద్యులు. కనుక పరాక్రమమే వీరి యెడ ఉచితం. ఇక, రావణుని హృదయమును, రాక్షస బలమును తెలిసికొనుటకు యుద్ధం చేయాలి. వనభంజనం ద్వారా అది సిద్ధిస్తుంది. కొందరు రాక్షసులను చంపితే వారు భయపడతారు. అంతేకాదు - వారి బలం, పౌరుషం, యుద్ధ పద్ధతీ, వ్యూహరచనా, ఎదుర్కొనే తీరు.... వీటన్నిటినీ తెలిసికోవచ్చు. అదే అసలు పరమార్థం. శత్రువు బలం - మన బలం, ఈ తారతమ్యాన్ని తెలిసికొని కిష్కింధకేగాలి. అప్పుడే హనుమ ప్రభుశాసనాన్ని

పాటించినట్లు. రాక్షసులతో బలవంతంగా యుద్ధం కల్పించాలి. దాంతో రావణుడు మంత్రి సహితంగా సభలో ఉండగా చూచి వాని మనసులోని అభిప్రాయాన్ని తెలుసుకోవాలి. అలా రావణుడిని చేరటానికి ఒకటే ఉపాయం. అది, వనభంజనం!

కోరిన యుద్ధం సంప్రాప్తించింది. లంకా పట్టణమంతా భయభ్రాంతమైంది. ఎట్టకేలకు హనుమ పట్టుబడ్డాడు. రావణుడు మండిపడగా, మంత్రులు ప్రశ్నించగా – 'నేను వానరుడిని. నీ దర్శనం కోసం వనభంజనం చేశాను. ఆత్మ రక్షణకై రాక్షసుల నెదుర్కొన్నాను. నేనొక రాచకార్యం పై వచ్చాను. 'దూతోహం... రాఘవస్య..... నీకు హితాన్ని కూర్చే నా మాట విను....' అని చాలా ప్రియంతో హితవచనాల్ని పల్కుతాడు[10].

దాంతో ఆగ్రహోదగ్రుడైన రాక్షసాధిపతి దూతవధకాజ్ఞాపించాడు. విభీషణుని శాస్త్రోపస్కృత సుందర వచనాలతో తగ్గి' లాంగూల దహనాని కాజ్ఞాపిస్తాడు. పరమానందంతో రాజాజ్ఞను పాటించి తన శరీరానికి అలసటను కల్గిస్తున్నా – 'న మేస్తి మనసఃశ్రమః' అని వారిపై కోపం ప్రకటించడు. హనుమ ద్రుమచీరలతో, శణవల్కలాలతో బద్ధుడై ఉన్నాడు. ఈ రాక్షస కృత్యాన్ని రాముని కోసం సహిస్తానంటాడు. తైల పరిషిక్త కూర్పాసకపరివేష్టిత లాంగూలాన్ని దహిస్తారు. శృంగాటకాలలో చారీకుడని చాటుతూ లంకంతా తిప్పుతారు. లాంగూలాగ్ని ప్రజ్వలిస్తోంది. ఐనా హనుమ భయపడలేదు, రామ ప్రభావంపై ఆయనకున్న నమ్మకం వల్ల! సముద్రలంఘన సమయంలోని నిదర్శనాలు అంతటి ప్రత్యయాన్నే ర్పరచాయి. సీతా ప్రభావం వల్ల హిమాయితము, పరిమళసుమాయితమూ అయి ప్రకాశించాడు, ఆజ్యాభిషిక్తుడై లాంగూలాగ్ర సుస్థితుడైన స్వాహావల్లభుడు, వాత్సల్యం ప్రకటిస్తూ. అపుడు హనుమ కృతజ్ఞతతో అగ్నిదేవునికి సంతృప్తి కల్గించటానికి, అలాగే రాక్షసులకి ప్రత్యపకృతి ద్వారా సంతాప సంజననానికి – ద్వ్యర్థికరియైన ఏకక్రియ లంకాదహనమేనని నిశ్చయించి – వనాల్ని పాడుచేశాను, బలశాలులయిన రాక్షసుల్ని కొందర్ని చంపాను. కొంత సైన్యాన్ని నాశనం చేశాను.

సాధించవచ్చు. వీతిహోత్రుని ప్రీతిపాత్రుని చేయాలన్నా అదే ఉచితం. లంకని దహిస్తాను, అని అంటించేస్తాడు ఒక్కొక్క భవనాన్నీ.

లంకాంతా కాలిపోతుంది. హనుమకి భయం వేసింది. ఏం పని చేశాను? కోపం ఒళ్ళు తెలియకుండా చేసింది. దేని కోసం ఇంత ప్రయత్నం చేశానో, అది సమూలంగా నాశనమైంది. దహింపబడుతున్న లంకలో సీత కూడా నశించి ఉంటుంది. నా తెలివి తక్కువ తనం వల్ల నేను తలపెట్టిన కార్యం పాడైనచో నేను కూడా ఇక్కడే ప్రాణత్యాగం చేయాలి. ఇప్పుడు సుగ్రీవుని గాని, రామలక్ష్మణుల్ని గానీ ఎలా చూస్తాను? రోషంతో తొందరపాటు పనిచేసి – లోక ప్రసిద్ధమైన వానరచాపల్యాన్ని చూపించాను. ఛీ ఛీ! ఏమి రాజసభావం! ఏమి స్వాతంత్ర్యం! ఏమి చాపల్యం! సీతమ్మను రక్షింపగల్గి ఉండీ, రజోగుణం వల్ల కల్గిన ఆగ్రహంతో రక్షించలేకపోయాను.

"ధర్మిష్ఠమైన ఇక్ష్వాకు వంశానికి నాశం కల్గిస్తున్నాను. సుగ్రీవునికి వంశచ్ఛేదకరమైన పని చేశాను. దురదృష్టవంతుడిని! ధర్మార్థాలు రెండూ చెడిన వాడిని. రోష దోషం కమ్మిన వాడిని. లోక వినాశకుడిని....." అని పరితపిస్తూ- కొన్ని శకునాలవల్ల సీత సుఖంగా ఉన్నదని భావించి, ఆమెను చూచి, ఆమె యొక్క పాతివ్రత్య ప్రభావమునకు ఆశ్చర్యంతో, సంతోషంతో పొంగి, ఆమెకు మ్రొక్కి ప్రత్యాగమనానికి అనుజ్ఞనంది, లంకనుండి తిరిగివచ్చి, తనకై ఎదురుచూస్తూ ఉన్న వానరులను కలసి, సీతావృత్తాంతాన్ని నివేదిస్తాడు.

అంగద జాంబవత్ ప్రముఖులతో కలసి, రామలక్ష్మణయుతుడైన సుగ్రీవుని దర్శించి – రామునికి 'దృష్టాసీతా' అని సీతా వృత్తాంతాన్ని విన్నవించి, సీతారాములను సంఘటిత పరచు ఘటక శక్తివలె వ్యవహరించినాడు. రాముని గాఢ పరీరంభ గౌరవాన్ని పొందాడు. శ్రీరామ పట్టాభిషేక సమయమున సీతచే సమ్మానితుడై, రామునిచే ప్రశంసింపబడినాడు. అక్కడి సీతా సమ్మానము రామ ప్రశంసాపూర్వకము. హృదయదఘ్నముగ కృతజ్ఞతను ఆ దంపతుల ఎదలలో నింపిన వాడీతడు. ఇది

దౌత్యఫలితము. హనుమ సద్భ్రాతగా వ్యవహరించి సీతారాముల హృదయపు ప్రమిదలను ఆశాస్నేహ ప్రపూరితం చేసి ప్రేమ జ్యోతుల నానాడు ఎగసనతోయుగా. నేటికీ ప్రణయ సామ్రాజ్య దీధితులతో జగత్తు ప్రకాశిస్తోంది[11].

సామాన్యంగా భుజశాలి బుద్ధిశాలి కాడు. కానీ, హనుమ దానికి అపవాదం. క్వాచిత్కంగా భుజబలం బుద్ధిబలాన్ని అధిగమించటం గమనిస్తాం, హనుమ ద్విషయంలో. ఐనా సద్యోవికసితమైన బుద్ధి ఔచితీ నిబద్ధంగా కార్యసానుకూల సాధనమవుతుంది.

హనుమ బుద్ధికుశలతపై కార్యకరణ దక్షత పై నమ్మకమున్నవాడు కనుకనే మధువనభంజన వార్త విన్నా సుగ్రీవుడు కోపించడు. పై పెచ్చు ప్రశంసించాడు. ఎందుకంటే, హనుమ చేసే ప్రతి పనీ హేతుమంతం, సర్వ ప్రశస్యం! పితృపైతామహమైన మధువనాన్ని కోతిమూక ధ్వంసం చేసిందన్న వార్తవిని ఉగ్రుడై, ఆగ్రహోదగ్రుడై – మధువనభంజన నిమగ్నులు, రసానంద వ్యగ్రులు అయిన వానరుల్ని దండించాలి. కానీ హనుమన్నేతృత్వంలోని యూథం చేసేది అపరాధం కాదని, అది హేతుమత్తనీ, సీతా సందర్శన జనిత సంతోష పారవశ్యంతో వనవిహార మధుభక్షణాది సాహసకృత్యం అదనీ, ఆ దర్శనం కూడా హనుమే చేశాడనీ (చేసి ఉంటాడనీ –)

విచిత్య దక్షిణా మాశా మాగతైర్హరి పుంగవైః ................ ప్రమధితం మధువనం, దృష్టాదేవీ నసందేహో న చాన్యేన హనూమతా. నహ్యన్యః సాధనే హేతుః కర్మణోస్య హనూమతః. కార్య సిద్ధిర్మతిశ్చైవ తస్మిన్ వానరపుంగవే. వ్యవసాయశ్చ వీర్యంచ శ్రుతం చాపి ప్రతిష్ఠితం. హనూమాంశ్చాప్యధిష్ఠాతా న తస్య గతిరన్యథా. – అని నిర్ధారణ చేస్తాడు.

నిశ్చిత కార్య సాధన సామర్థ్యం నీకే ఉందంటాడు, హనుమతో సుగ్రీవుడు, సీతా పరిమార్గణానికి వానరులని సర్వదిశలకు పంపే ముందు – సీతాభిగమ రూపకార్య నియోజనం చేస్తూ –

న భూమౌ నాంతరిక్షే వా నాంబరే నామరాలయే,
నాప్సువా గతి సంగంతే పశ్యామి హరిపుంగవ!
సాసురా: సహ గంధర్వాః సనాగనరదేవతాః,
విదితాః సర్వలోకాస్తే ససాగరధరాధరాః.
గతిర్వేగశ్చ తేజశ్చ లాఘవంచ మహాకపే!
పితుస్తే సదృశం వీర! మారుతస్యమహౌజసః,
తేజసావాపితే భూతం సమంభువి న విద్యతే.
తద్యధాలభ్యతే సీతా తత్త్వమేవోపపాదయ,
త్యయ్యేవ హనుమన్న స్తి బలం బుద్ధిః పరాక్రమః
దేశకాలను వృత్తిశ్చ నయశ్చ నయపండిత! (కి॥ - 44 - 3-7)

సముద్రలంఘన సమయంలో విఘ్నాలను విఘ్నంచేస్తూ పరిక్రమించే హనుమను ప్రశంసిస్తూ - హనుమలో నాల్గు విలక్షణమైన గుణాలున్నాయని అందువల్లనే అతడు సంకల్పిత కార్య సమగ్ర సాధకుడనీ, అలా సాకల్యంగా కార్యాన్ని సాధించడాన్కి తద్గుణ చతుష్టయం[12] అవశ్యమనీ, అవి ఉన్నవానికి తమ కార్యాలలో జయం లభిస్తుందనీ అంటారు.

అలాగే రాముడు - తన పట్టాభిషేక సమయంలో భంగ్యంతరంగా హనుమని ప్రశంసిస్తాడు. శ్రీరాముడు తనకు సహాయభూతులైన మిత్రులకు కాన్కలిస్తాడు. ప్రత్యుపకృతి కాకున్నా కృతజ్ఞతా సూచకంగా హనుమను సమ్మానింప దలచి, రాముడు ఒక ముక్తాహారాన్నిచ్చి, నీవు ఎవరికి ఇవ్వదలచావో వారికే ఇయ్యి- అంటాడు, సీతతో. కానీ, ఆమె వానర వీరులను భర్తను మార్చి మార్చి చూడటంతో ఆమె మనోభావాన్ని గమనించి, రాముడు - ప్రదేహి సుభగే! హారం యస్యతుష్టాసిభామిని! అంటాడు. అంతేనా, ఇంకో మాటన్నాడు. 'పౌరుషం విక్రమో బుద్ధిః యస్మిన్ ఏతాని సర్వశః' అని. దాంతో - 'దదౌ సా వాయుపుత్రాయ'.

హనుమలో తప్ప మిగిలిన వారిలో పౌరుష విక్రమ బుద్ధుల సమగ్రత ఉండదని భావం. ఓ గుణం ఉండవచ్చు, రెండు గుణాలుండవచ్చు. లేదా మూడూ ఉన్నా అసమగ్రంగానో పరస్పరభంజక – బాధాకరాలుగానో ఉండవచ్చు. కానీ, హనుమలో గుణాలు అన్యగుణసహిష్ణువులే. సర్వకార్య దక్షుడైన హనుమ 'క్షోదక్షమమైన పరిశ్రమ చేతనేగాక ఇలా సర్వజన సమాదరణీయమైన గుణసంపదతో ప్రకాశించే హనుమ' వివేచనతో విమృశ్య వ్యవహరించే హనుమ – కస్యానారాధ్యతే చిత్తం?

'ఇత్యాఖ్యాతే పవనతనయం మైథిలీవోన్ముఖీ సా' అని ఔదార్య ఔత్సుక్యాల వల్ల ఉచ్ఛ్వసిత హృదయ, సాదర సమ్మాన కటాక్ష వీక్షణాలతో అప్రమత్తయై వింటుందిట, శ్రోత్ర పేయమైన భర్తృ సమాగమాత్కించిదూనమైన సందేశాన్ని. అట సీతా హనుమదుపాఖ్యాన జ్ఞాపనం మేఘ యక్షణులకు దూతగుణ సంపత్తినీ[13], పాతివ్రత్యాన్నీ వ్యంజింప చేయడాన్కి.

మేఘం అర్వాక్కాలిక సర్వదూతలకూ బజ్జబంతి. ఆ మేఘానికి మార్గదర్శి హనుమ. ఆకాశవీధీ విహరణ పూర్వకంగా నిరూపించాడు దౌత్య మార్గాన్ని. ఈ విధంగా దౌత్యక్షమమైన వ్యక్తిగా బహుధా ప్రశంసించబడి, పూర్వకార్యావిరోధంగా – యథోక్తకారిగా మాత్రమే కాక, దేశకాలోచితంగా నిర్దిష్ట కార్యంతోపాటు మరికొన్ని ప్రయోజనాలనీ నిర్దుష్టంగా సాధించినవాడు, హనుమ. యుద్ధతంత్రం, కౌశలం, ఎదిరి శక్తియుక్తులు తెలిసికొని వారికి తనబలం తెలిపి- భావిలో జరుగనున్న – లోక ప్రసిద్ధమైన అనన్వయానికి ప్రబలోదాహరణమయిన, రామరావణ యుద్ధానికి పూర్వ రంగాన్నేర్పరచిన రాజనీతివేత్త. సాధారణంగా సందేశహరులు మాత్రమే దూతలు. అంతకు మించి వారి ప్రమేయం ఉండదు. దౌత్యానికి హనుమ ఆదర్శం, అందరికీ. కానీ హనుమలో తప్ప నాన్యత్రా దర్శనీయం ఇతర కార్యసాధన, పూర్వకార్యా విరోధంగా!

✳ ✳ ✳

**అధోజ్ఞాపికలు :-**

1. సుందరకాండలో - **1-142, 155; 35-52,72; 36-2; 42-1; 43-9** చూడుము.
2. లేకుంటే ఆ పరహిత ప్రవణల్ని ఉపాలంభించాల్సి వస్తుంది. పాణిన్ని తిట్టుకోవలసి ఉంటుంది.
3. ఇది వానరమా, నరజాతిలో అన్యతమమా, అన్నదో ప్రశ్న!
4. నానృగ్వేద......... ...... ఉద్యతాసేరరేరపి. (కి॥ **4 = 28-33**)
5. ఇంగితం హృద్గతోభావః.
6. 'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవధీరాః' - కాళిదాసు.
7. రామలక్ష్మణుల్ని కలిసినపుడు హనుమ భిక్షురూపంలో సంస్కృతంలో మాట్లాడాడు.
8. భూతాశ్చార్థా వినశ్యంతి దేశకాల విరోధితాః, విక్లబందూతమాసాద్య తమః సూర్యోదయేయథా. అర్థానర్థాంత రేబుద్ధిర్నిశ్చితాపి న శోభతే, ఘాతయంతి హి కార్యాణి దూతాః పండిత మానినః (సు'' **3 = 38,39**).
9. కార్యేకర్మణి నిర్దిష్టే యోబహూన్యపి సాధయేత్, పూర్వకార్యావిరోధేన సకార్యంకర్తు మర్హతి, నహ్యేకః సాధకోహేతుః స్వల్పస్యాపీహకర్మణః, యోహ్యర్థం బహుధావేద స సమర్థోర్థ సాధనే (సుం. **41 = 5,6**).
10. ధర్మార్థోపహితం వాక్యం - ఇహంచ - అముత్రచ క్షమమ్ (సుం. **51=3**).
11. ఆ దీధితులలో తణుకులీనే మణిశలాక, భవభూతి నాటకసౌధ దీపకళిక 'ఇయం గేహేలక్ష్మీ రియమమృత వర్తిర్నయనయోః' అని సంభావిత.
12. ధృతిః (ధైర్యం), దృష్టిః (ఆ... సూక్ష్మేక్షణం);
మతిః (అర్థతత్త్వనిశ్చయః), దాక్ష్యం (క్రియావత్త్వం).
13. తద్గుణాస్తు రసాకరే - బ్రహ్మ... రీ బలీ ధీరో ... ష్టర్జితః
దీమానుదారో నిశ్శంకో వక్తా ...ప్రియాభవేత్.
(ఋల్లినాథుడు)



# బలోద్ధుృడుగా హనుమ

బుద్ధిమతాంవరిష్ఠునిగా ప్రస్తుతించినా హనుమను చాలామ బలవంతునిగానే ఎరుగుదుం, మనం. సర్వధా ఆయన బలవత్తనే గమ బుద్ధివంతుడు కూడా కావటంచేత చేపట్టిన కార్యాలన్నీ పర్యవసాయాన్నందుతాయి. బుద్ధి నిదానంగాను బలం ఆవేశానురోధ ప్రవర్తించట మిందుకు కారణం. ఐతే, బలం అనేది సాపేక్షమా? నిరపేక్ష బలాన్ని ఎలా నిర్ణయించడం, అన్నదీ ప్రశ్నే మరి!

బలం అనగానే అంగబలం, అర్థబలం, బుద్ధిబలం, విద్యాబలం... ఎన్నో స్ఫురిస్తాయి. బల మే రూపంలో ఉన్నా ఆత్మ – ఆత్మీయ రక్షణకు, సంహారణానికీ ఉపయోగిస్తుంది. తననీ తనవారినీ పెంచుకోడానికి ఉపయోగిస బలవంతుడైనాక తానే తప్ప తానవారెవరూ కానరాని స్థితికెదగడమూ కద్దు రజో గుణ విజృంభణం వల్ల. పరమ సాత్త్వికులు మాత్రం వైయక్తిక లాభాకే కాక సమష్టి ప్రయోజన దృష్టితో ప్రకాశించటం క్వాచిత్కమే ఐనా విడ్డూరమనిపించుకోదు. ఎవరు అటువంటి బలశాలి? ఎవరు ఆత్మీ బుద్ధితో ప్రకాశించిన మహానుభావుడు? ఎవరు తన బలప్రభావం వల్ల సముపార్జి కీర్తి ప్రతిష్ఠల్ని నిర్మమంగా నిర్మలంగా తనవారికందరికీ కట్టబెట్టిన సౌజన్యమ సత్త్వగుణ స్ఫూర్తి! ఇంకెవరు? హనుమే !

కిష్కింధా సామ్రాజ్య మహావీరులలో హనుమ అభ్యర్హితుడని అంటుఃు ఇది స్థూల దృష్టితో మనం తేల్చిన విషయం. సర్వవానర వీరుల బలాబల హెచ్చు తగ్గులు, తేడాలు, భేద సాదృశ్యాలు, సారూప్య వైరూప్యాలు అం గడితేగానీ అసలు సిసలైన ప్రథమ గణ్యుడైన బలవంతుడు తేలడు. అప్పుడ అభ్యర్హిత పూర్వత్వం అంటగట్టడానికి వీలుచిక్కదు. స్థూలంగా బ యుద్ధాదుల్లో ప్రహరణాదులకి వాడినా, వలీముఖ ప్రముఖుల విషయంల

ప్రహారణ, కార్యసాధక, ప్లవన కృత్యాలకు పరిమితం చేసి పరిశీలించవచ్చును. ప్రహారణ శక్తిని శత్రు ప్రహారణ, శత్రువస్తు విధ్వంసనాలకీ, కార్యసాధక శక్తిని దుష్కార్యసాధక బలోపేతులుగా వారి నాయా కృత్యాలలో సమీక్షించటం వల్లా, ప్లవన శక్తిని ఆయా తావులా గమనించవచ్చు. ఐతే ఈ వానరవీరులంతా ఆత్మ ప్రత్యయంతో కాక అహంకారాతిశయంతో తమ బలాధిక్యాన్ని బాహాటంగా ప్రకటిస్తారు. హనుమ మాత్రం తన గొప్పదనాన్ని ఏదో ఒకటి రెండు సందర్భాల్లో తప్ప చెప్పడు. పైగా, అవకాశం ఏర్పడినప్పుడల్లా తోటి వానరులను ఎంతో గొప్ప చేసి చెప్తాడు. ఐతే, ఈ గొప్పచేయటం వాస్తవ విరుద్ధమా అనిపిస్తుంది. అవాస్తవ కథనం అనృత దోషాపాదకమే కాక అసత్యగుణారోపణం గౌరవహాని కల్గించదా? – అన్నది పరిశీలించాల్సిందే. హనుమ ఏ పరిస్థితుల్లో అలా మాట్లాడేడో తెల్సికొంటే – అపుడు, అది న్యాయబద్ధము – నీతి నిబద్ధమూ అవునో కాదో తెలుస్తుంది. చూదా మిప్పుడే ఆ సంగతి.

హనుమ వానరవీరులను 'ఏకోత్పాతేన తే లంకామేష్యంతి హరియూథపాః'[1] అంటాడు. ఇది అక్షరాలా అబద్ధం. ఈ అక్షరానికి రెండు వైపులా బెసగనీయకుండా రెండు గట్టి కట్లున్నాయి. మొదటిది కిష్కింధాకాండాంతంలోని వానరవీరుల బల సమీక్ష. ఇది లంఘన సామర్థ్య విచారణ వివేచన పూర్వకమైనది. ఇక్కడ వారి లంఘన సామర్థ్యం నిర్ధారించబడింది. ఒక్కొకడు పది యోజనాలు మొదలుకొని తొంభై యోజనాల వరకు ఏకగుణితంగా[2] తమతమ సామర్థ్యాలని విశదపరుస్తారు. హనుమ నిర్లిప్తంగా ఊరుకున్న సన్నివేశమది! రెండవది సేతు నిర్మాణం. సీతాముఖ కమల సముల్లాసహేతువైన సేతువు వానరసేన దాటడాని కుద్దిష్టమైందే. ఓ వేళ వీరు హనుమలాగే ఒకే దూకులో లంకను చేరగలిగే వారే ఐతే – నువ్వుదాటగలవా? నువ్వుదాటతావా? అన్న ప్రశ్నలు, బలాబల చర్చలు, సామర్థ్య ప్రసంగాలు, ప్రశంసలతోడి మీమాంస కవకాశమెక్కడ? అవాచీదిశాన్వేషణ వ్యగ్రులైన వారంతా అహమహమికతో అంగలార్చుకు పరుగులు తీస్తూ అపారపారావారాన్ని అధిగమించే వారు. దక్షిణదిక్కంతా కలసికట్టుగా

ఎవరూ అంతటి సమర్థులు కారన్నది కిష్కింధాకాండ కంఠోక్తిగా చెప్తోంది. వారంతట వారే ఒప్పుకొన్న సత్యమే ఐనా, హనుమ అర్జునుడిగా - అర్థాంతరంగా తనవారంతా ప్లవన ప్రయోజనైక పర్యాప్తబలసమన్వితులని కతపత్రాన్ని కట్టబెడతాడు. ఏదో తనవారి పై ప్రీతితో అన్నాడులే అని ప్రక్కకి తిప్పేద్దామంటే (సుందరకాండలో) ఎన్నిమార్లో అంటాడు. ఏమిటి అతని అభిప్రాయం. అసలాతని ఉద్దేశ్యం ఏమిటలా అనడంలో?

సీతమ్మ హనుమతో - ఈ లంకలోకి ఎవరు రాగలరు? ఏదో నువ్వూ, వాయుదేవుడూ, గరుత్మంతుడూ [3] తప్ప అంటుంది. అప్పుడు హనుమ - 'వానరవీరులేం తక్కువవారు కాదు. చాలా బలవంతులైన వారున్నా రక్కడ. భూమినంతటినీ చుట్టు ముట్టేసారు. ఒక్క దూకులో లంకలోకి రాగలరు' అని అంటాడు. ఇలా వానర వీరుల గొప్పదనాన్ని ఒక్క సీతతోనే గాక, రాక్షస వీరులతోను, రావణునితోనూ చెప్తాడు, కొంచెం అన్యూనాతిరిక్తంగా ఇవే మాటలు. మొత్తం మీద వానరులెంతో గొప్పవారని తాత్పర్యం. తిరిగివచ్చి వానర వీరులతోనే అంటాడు - 'ఇలా చెప్పానండోయ్ మీ గురించి[4]' అన్నట్టు. అంటే మీ బలాన్ని పెంచుకోండి ధైర్యాన్ని తెచ్చుకొని విజృంభించండనా? ఏమిటిందులో రహస్యం.

ఒక మాటకి అర్థాన్ని యథాతథాంగా గ్రహించం. వక్తృవైలక్షణ్యాన్ని ఆశ్రయించుకొనో, శ్రోతృసామర్థ్యాన్ని పురస్కరించుకొనో అర్థగాంభీర్యం ప్రకాశిస్తుంది. దేశకాల పాత్రలనుబట్టి వక్తృమనో గతాభిప్రాయాన్ని బట్టీ ఆ మాట యొక్క సత్యాసత్యాలని నిర్ధారిస్తాం. అసలా మాటలోగల జీవాన్నావిష్కరిస్తాం. కేవలం బాహ్యంగా కనవచ్చే వాచ్యార్థంకాక, లక్షణను బట్టో - లేక దాన్నీ అవతలనునట్టో - రసవత్తమమైన వ్యంగ్యార్థం పరిగ్రహిస్తాం. దాంతో ప్రాకరణిక సత్య సౌందర్య సమావిష్కారం జరుగుతుంది. ఇక్కడందుకేమన్నా తావుందా! అంటే, అదీ లేదనే చెప్పాలి. హనుమ మాటాడిన వేవీ ఔపచారికాలుకావు. అన్నీ



వాచ్యార్థ ప్రతిపాదకాలే. ముక్కుకు సూటైన మాటలే. వ్యంగ్యంలేదు. భంగ్యంతరం లేదు. అర్థగోపనం లేదు. అసత్యం లేదు. బాహ్యాభ్యంతరాల రెండిటా బాహాటంగా లౌక్యం తెలీని ఛాందసునిలా ప్రవర్తిస్తాడు. లేకపోతే నిక్షేపంలా సీతని చూసి రాక, పట్టుబడటం, వారిని మట్టుబెట్టడం, కోరి కష్టాల్ని తెచ్చుకోడం అనవస్థిత కపిత్వాని కద్దం పట్టదూ! అలాగే ఈ మాటలూ అందామా అంటే, ఒకమాటా? ఒకరితోటా? పదేపదే పలవరించిన వాట్ని పరాకు మాటలుగా పక్కకు నెట్టేస్తామా? లంకలో, కొత్తచోటు కనుక, సీతాన్వేషణైక వ్యగ్రమనస్కుడు కనుక, రాక్షసుల నుండి సీతాపరిత్రాణ పరాయణతతోనో, రాక్షసుల్ని బెదరించడానికో అన్నాడని సరిపెట్టుకున్నా – అప్రమత్తంగా, సుస్థిరంగా, సాధించుకుని వచ్చిన సంతోషాంత రంగంతోనూ వానర మధ్యంలో మళ్ళీ అన్న మాటల మాటేమిటి? దాన్నెలా నిరసిస్తాం? నిరాదరిస్తాం? నిరాకరిస్తాం? – అంటే, ఆ రెండిటి వెనకా బ్రహ్మాండమైన రాజనీతి ఉంది. మనస్తత్వ శాస్త్ర విశ్లేషణాత్మక విశేష జ్ఞానముంది. చూదాం –

హనుమ మొదట సీతతో అన్నాడు. సీత చాలా భయపడి రాక్షస స్త్రీల తర్జన భర్త్సనాలకి తట్టుకోలేక, రావణుడింకా రెణ్ణెల్లు గడువిచ్చినా, నెలకంటె జీవించి ఉండలేనన్న స్థితిలో కనపస్తే ఆమె నాశ్వాసించడానికి, ఆమె కుత్సాహాన్ని కల్గించడానికీ అన్నదీ మాట. రాక్షసుల బలం, మాయలు, భయంకరమైన అమానుష హృదయ విదారక దారుణ చేష్టలు తెలుసు వారిద్దరికీ. ఆయనా విన్నాడు చెట్టు పైనుండి. బ్రతికి ఉండగానే గుండె ఒల్చుకు తినేద్దామనేవారు, కావలి ఉన్న స్త్రీలు! ఇంక పురుషుల సంగతి చెప్పనే అక్కరలేదు. వారంతటి ఘనులో దీన్నిబట్టి ఊహించవచ్చు. వారి మధ్య ఎలాగో పదినెలల జీవితాన్ని ఈడ్చుకొని వచ్చిన ఆమెను ఊరడించటం ముఖ్యం. సత్యాసత్యాలు, యథార్థాయథార్థాలు అనటంకంటే, ఆమెకు మనస్సంతోషాన్ని కల్గించేది, ఆమెకు గుండె ధైర్యాన్నిచ్చేది– హనుమ మాటాడటం అవసరం. ఇక్కడి హనుమ మాటల్లో ఆ అంశమున్నదో లేదో అన్వేషించాలి గానీ, సత్యమా? అసత్యమా? అన్నది కాదు. ఇది సీత ప్రశ్నకు సమాధాన రూపమైనది కానీ, హనుమ స్వతంత్రముగా అన్నది కాదు.

సుమహాంస్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర!
కథం నుఖలు దుష్పారం తరిష్యంతి మహోదధిం,
తాని హర్యృక్ష సైన్యాని తౌవా నరవరాత్మజౌ.
త్రయాణా మేవ భూతానాం సాగరస్యాస్య లంఘనే
శక్తిః స్యా ద్వైనతేయస్య తవ వా మారుతస్య వా.
తదస్మిన్ కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే
కిం పశ్యసి సమాధానం త్వం హి కార్యవిదాం వరః
(సుందర - 39 = 24-27)

ఇది సీతకు కల్గిన సందేహము. ఆమె మాటలను భీరువై పల్కిన మాటగా తీసివేయువీలులేదు. కారణమది అర్థోపహితము, హితయుతము, హేతు సంహితమూను. దానికి హనుమ చెప్పిన సమాధానమిది. ఇక్కడ 'ఏకోత్పాతేన' అనడు. 'వారందరు రాగలవారే. నాకంటే విశిష్టులు. ఇలాంటి చిన్న పన్లకి చిన్నవారిని పంపుతారు కానీ, పెద్దవారిని కాదు కదా! మరి నేను వచ్చానంటే మిగిలినవారు ఎలాంటి వారో, చూడు. నా కంటే గొప్పవాళ్ళు. నాతో సమానులు తప్ప నా కంటే తక్కువ వాడెవడూ కాడు' అంటాడు. ఇందులోని తత్త్వమును గ్రహించుటావశ్యకము. ఇది కేవలము సీతా సాంత్వనోద్దేశ్యముతో చెప్పినది. ఇది హనుమ బుద్ధిమత్తకుదాహరణము. ఇందు హనుమ వినీతత విస్పష్టముగ గోచరించును.

తక్కిన వానరవీరులు దిక్కులు చూచుచు బిక్కుబిక్కుమనుచున్నారు. తానొక్కడే దాటిరాగల వాడనని, సముద్రమున కీవలి కథ చెప్పినచో ఏమున్నది? మరి కథలేదు. పండిత మానులగు దూతలను తూర్పారబట్టి, యథోక్తకారులు, ఉక్తకార్య విధ్వంసకారుల కంటే విశిష్టమైన వ్యక్తిగా తనను సంభావించుకొన్నవాడు అట్లు మాటాడునా? అందుకే అక్కడి సన్నివేశమునకు అనుగుణముగా సముచితము, సమీచీనము ఐన సమాధానమును చెప్పాడు. ఇది హనుమ ఇంగితజ్ఞతకు,

ఉచితజ్ఞతకు ఉదాహరణ. రాజనీతి తంత్రజ్ఞతకు తారకాణ. సీత కూడా దుఃఖార్త అంటే, ఇంకేం చెప్పాలి? నా గుండె కూడా కరిగిపోతూంది. మనసు సైతమూ మరగిపోతూంది. అని, బ్రహ్మాచారీ కపిప్రవరుడూ అన్నాడంటే, ఆవేదనను ప్రకటించాడంటే – హనుమ ఎంతటి సౌమనస్యం కలవాడో తెలుస్తోంది. ఈ సందర్భంలో ఆమె పై జాలితో అన్నదీ మాట! కాదండీ, 'వాచ మర్థోనుధావతి' అని జరుగబోయేది సూచించాడు. వానరులంతా సామర్థ్యాసామర్థ్య విచక్షణ జ్ఞాన విరహితంగా 'ఏకోత్పాతేన' లంకకు రావాలి అని ఆదేశించాడు. వస్తారు, నీకేం భయం లేదన్నాడు. అంతే! అంటే మరీబాగుంది.

సీతా సంభాషణానంతరం తనరాక తెలియబరచకోరి రాక్షస వీరులతో తగవు తెచ్చుకున్నాడు. కింకరులను హతమార్చి హెచ్చరికగా ఇలా అంటాడు –

మాదృశానాం సహస్రాణి విసృష్టాని మహాత్మనాం, బలినాం వానరేంద్రాణాం సుగ్రీవ వశవర్తినాం,
అటంతి వసుధాం కృత్స్నాం వయమన్యేచ వానరాః, దశనాగబలాః కేచి త్కేచిద్దశగుణోత్తరాః
కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః, సంతిచౌఘబలాః కేచి త్కేచిద్వాయుబలోపమాః
అప్రమేయబలాశ్చాన్యేతత్రాసన్ హరియూథపాః, ఈ దృగ్విధైస్తు హరిభిర్వృతో దంతనఖాయుధైః
శతై శ్శతసహస్రైశ్చ కోటీభిరయుతైరపి, ఆగమిష్యతి సుగ్రీవో సర్వేషాఘ్రావో నిఘాదనః

(సుందర ॥ 43 = 20-25)

ఇక్కడ ముక్తాయింపుగా ముచ్చటైన మాటొకటి అంటాడు హనుమ. 'ఆగమిష్యతి సుగ్రీవః'. ఇది సమీప భవిష్యత్తు. అద్యతన భావి. వస్తాడు. అప్పుడేమవుతుంది? 'నేయ మస్తి పురీలంకా నయూయం న చ రావణః'. ఇక్కడ 'అస్తి' అన్నది వర్తమానకాలికమై భావికన్వయించే కాలవ్యత్యయ పదంగా కాక, నిజంగా వర్తమానాన్ని చెప్పేదే. 'మీ లంక లేదు'. ఉన్నదాన్ని లేదనట మెట్లా? సుగ్రీవుడు తన సైన్యంతో వచ్చాకగా లేకపోకడమనేది. అతడు తనవారితో వచ్చి రాక్షసులనీ లంకనీ నాశనం చేస్తాడు. అప్పుడూ లేకపోవటం. అవన్నీ జరిగాక, ఈ నాశరూప ఫలం కానరావటం. ఇది కార్యకారణ భావోపేతమూ కాదు, అతిశయోక్తిగా

తద్విపర్యయం వల్ల కారణకార్య సంబంధమూ కాదు. కేవలం సామాన్య వ్యావహారిక సిద్ధం. హనుమ చాలా సాధారణంగా (Casual గా) అన్నాడు - 'లంక లేదర్రా. మీరూ లేరు. మీ రాజూ లేడు'. ఇదెంతటి సహజమైన పలుకుబడో! నుడికారమో! మాటతీరో!

మనసులోని మాట నావిష్కరించేందుకు మహా ప్రయత్నం కాక ఎంత సహజంగా, చులాగ్గా అన్నాడో! మనం రోజూ అనేదే, ఓ చిన్న ఉదాహరణ గమనిద్దాం. ఎవరేనా మనింటికి వచ్చి తలుపు కొడితే, మనం వెంటనే 'వచ్చే' అన్నమాట 'వచ్చేను' అనా, 'వస్తున్నాను' అనా? అలాంటిదే ఇక్కడ హనుమ అన్నదీను. ఇందులోని భాషావిషయకమైన వైశిష్ట్య వైలక్షణ్యాల కంటే, హనుమ హృద్గతమైన లంకావినాశ విషయక జ్ఞానం - ప్రత్యయం అతని చేత అలా పల్కించాయి. సరి, అదలా ఉంచుదాం.

హనుమ రాక్షసుల ముందు వానరవీరుల గొప్పదనాన్ని ప్రస్తావించడానికి కారణం రాక్షసుల్ని భయపెట్టడం. ఇదెంతో లౌక్యంతో అన్నది. రాజనీతి విలసితమైంది. అదీకాక, సీతనెంతో భయపెట్టారు, భయపెడుతున్నారు. అందులో ఇదెన్నోవంతుకు వస్తుంది? తానొక్కడే ఎడాపెడా చంపేస్తూంటేనే, తనలాంటి వాళ్ళు, తన కంటే గొప్పవాళ్ళూను అవతలున్న వాళ్ళు. వాళ్ళువస్తే - మన గతేం కావాలి? అని, భయపడి ఛస్తారు రాక్షసులు. అందుకన్నాడు హనుమ. అదీ కాదండీ - ఎవడేనా శత్రువు పైని యుద్ధానికి ఏగినపుడు తనగురించి, తన వర్గం గురించీ గొప్పగా చెప్పుకుంటాడు కానీ, తక్కువగా చెప్పడు కదా! అలాగే హనుమ అన్నదీను. ఐతే, ఇది అక్షరాలా నిజమెలాకాదో అంతగా అత్యుక్తీ కాదు. అసలు రహస్యమేమంటే నిశితమైన తన దృష్టికి నిహీనమైన వారి ప్రవర్తన సుతరామూ సొక్కలేదు. దాంతో రాక్షసులంటే చిన్న చూపు ఏర్పడి, ఎల్లిదపుటెత్తిపొడుపుగా అన్నాడు. అంతరంగంలో తనవారి పట్ల అతిశయితమైన అనురాగం పెల్లుబికింది. యథా శక్తి వారు విక్రమిస్తారు గానీ ఇలాంటి నీచకార్య వ్యాపృతులు కారన్న దర్పంతో ఇప్పుడు కొంచెం డాబుగా, అన్నాడు.

తిరిగి వచ్చి సహవానరులతో సంభాషిస్తూ – 'దేవతానాం సకాశంచ యే గచ్ఛంతి నిమంత్రితాః'[6] అంటాడు. తరువాత, ఉత్పతనం, ప్లవనం కాదుగానీ వానరుల బలాన్ని, యోద్ధృతను నిరూపిస్తూ ప్రశంసిస్తాడు. మళ్ళీ, రామ సుగ్రీవుల వద్ద తన గవేషణ కార్యవిశేషాలనుటంకిస్తూ – సీతా సందేహం, తన సమాధానం విన్నవిస్తూ – 'ఏకోత్పాతేన తే లంకాం'[7] అంటాడు. ఇది ఇతర వానర వీరులతో పాటు సుగ్రీవునికీ హర్షదాయకమే. కానీ, రాముడంగీకరిస్తాడా? వీళ్ళంతా ఎగుర గలవాళ్ళేనా? ఒహవేళ వాళ్ళంతా ఎగర గల్గినా, తామెట్లా పోతారు? ఇవన్నీ సందేహాలే. ఎవరికి? మనకి! రామునికీ విషయాలు పట్టవు. 'మధురామధురాలాపా కిమాహ?' అంటాడు. ఇదీ, ఆయన ప్రశ్న. ఆయన మనోబుద్ధులనంతటినీ ఆక్రమించినది సీతా చింత.

ఇక్కడ హనుమ అట్లా ప్రస్తావించడానిక్కారణం – తమ కార్యపురోగతిని సూచించడం, సమయాతీతమవుతోందని చింతిస్తున్న రామలక్ష్మణులకు సాంత్వనాన్ని తమవల్ల జరిగిన కించిత్కారానికి సంతోషాన్నీ వ్యక్తం చేసి వానరులనుత్సాహ పరచడం – పోతే,

హనుమకు తెలుసు నిశ్చయంగా – ఎవరు రాగలరో, ఎవరు రాలేరో? ఎవరు వస్తే కల్గే ప్రయోజన మేమిటో? అందుకే అంటాడు – 'చతుర్ణామేవహి గతిః' (సుందర – 2-30).

మళ్ళీ – 'కుముదాంగదయో ర్వాపి సుషేణస్య మహాకపేః,
ప్రసిద్ధేయం భవేద్భూమిః మైందద్వివిదయోరపి'

అంటాడు. జాగ్రత్తగా గమనించాల్సిందిది. ఇది వారికి తెలిసినది. రావటం వారికే శక్యం కాదు. ప్రసిద్ధమంటే దుష్ప్రవేశం చేత ప్రసిద్ధం. అంటేదాన్ని గూర్చి విన్నవారు తెలిసిన వారు వీరు మాత్రమే. మిగిలిన వారికి ఏతావన్మాత్రమైన పరిచయమూ లేదు. మరి రాగల వారెవరంటే – వివస్వతస్తనూజస్య హరేశ్చ కుశపర్వణః,

మరో నల్గుర్ని చెప్తున్నాడు. అంటే, చింతా ప్రకార విశేషం! హనుమ లంకలో ప్రవేశిస్తూనే నగరాన్నంతటినీ ఆగంతుకునిలా కాక రాజకార్యసమాగతునిలా చూశాడు. ప్రకృతి సమస్తం ఒదిగి ఉంది, రావణ భయంతో. వారి కట్టుదిట్టమైన ఏర్పాట్లను చూశాడు. సామాద్యుపాయాల్లో ఏవి చేయగలరో ఆలోచిస్తాడు. ఇది హనుమ బుద్ధిమత్త. అడుగు పెట్టాడో - లేదో - ఆలోచనలో ఎంతదూరం వెళ్లాడో చూడండి! సరే, వానరవీరుల్లో ఎవరు రాగలరో చూస్తున్నాడు. వస్తే రాగలరు. నిశ్చయంగా రాగలరని కాదు. 'నాన్యంపశ్యామి' యో హతే మయి వానరః, శతయోజన విస్తీర్ణం లంఘ యేత' అంటాడు.

అసలు హనుమే అనుమానిస్తాడు - నతుశక్ష్యామి సంప్రాప్తుం పరంపారం మహోదధేః,[8] అంటూ - ఎందువలన? అంతకు ముందు ప్లవనోన్ముఖుడైనపుడు- అనే నైవహి వేగేన లంకలోకి వెడతాను. సీత అక్కడ దొరకకపోతే, శ్రమ లేకుండా స్వర్గానికైనా వెడతాను. సరావణంగా లంకను పెకలించుకొని వస్తాను, అంటాడు. మరిప్పుడీ అధైర్యమేమిటి? భీతి ఎందుకు? అంటే, హనుమ ఆ మాటల్లోనూ యాథార్థ్యముంది. ఇక్కడి ఈ మాటల్లోనూ ఉంది. అక్కడి ప్రతి మాటా సత్యమే. ఉదాహరణకి - రామబాణంలా వెడతానన్నాడు.[9] అవిశ్రాంతంగా ప్రయాణించాడు. స్వర్గాద్యన్యతమ ప్రాంతాలకు వెళ్ళాల్సిన అవసరం ఏర్పడలేదు. ఏర్పడితే వెళ్ళేవాడే! అక్కడా వంద యోజనాలు ఎగిరి వచ్చినా శ్వాస ఎగపీల్చి ఆయాస పడలేదుట! అంతేనా? ఇదో లెఖ్ఖా? ఇలాంటివెన్నేన దాటేస్తానంటాడు.[10] మరి అలాంటపుడు, ఈ వందా - వెనక్కి తిరిగిరాలేనేమోనన్న సంశయమెందుకేర్పడింది? అంటే - ఇప్పుడు హనుమ మనస్థితి గమనించాలి నిరాలంబమైన ఆకాశంలో, అపరిచిత మార్గంలో, అనుకూల - ప్రతికూల శత్రువుల్ని అధిగమిస్తూ ఎట్టకేలకు ఎట్లాగో వచ్చిచేరాడు, లంకను. అక్కడి సీత పరిస్థితి చాలా దయనీయంగా ఉంది. ఆమెతో మాట్లాడటానికే ఎంత సంశయించాడు. అవకాశం కోసం ఎంతగానో నిరీక్షించాడు. మాట్లాడాలా వద్దా? మాటాడితే ఏం మాటాడాలి? ఎలా మాట్లాడాలి? అన్నీ ప్రశ్నలే! నన

అన్యధా శంకించి సీత భయంతో అరచినట్లైతే రాక్షసులతో యుద్ధం ఏర్పడుతుంది. వారిని నిరోధించి, నిర్జిస్తాను. కానీ, తిరిగి అవతలి ఒడ్డుకు వెళ్ళగలశక్తి నాకు ఉంటుందా? ఇది హనుమ అన్నది. ఇది కేవలం అనుమానం. ఆలోచన - కార్యరూపానికి ఆలోచనాత్మకమైన స్థితిలో హనుమ మనస్సులోని మాట ఇది. ఉపక్రమించే వరకు ఉత్తుత్తి మాటలే. ఉపరి, ఉపక్రమిస్తే - పరాక్రమంతో విక్రమించి విజృంభిస్తాడు. కార్యానికి సిద్ధమయే ముందు ఎంతనిదానిస్తాడో దీనివల్ల తెలుస్తుంది.[11] ఇదీ, హనుమ బుద్ధిమత్తను పట్టి చూపే ఘట్టమే!

ఇక్కడింత నీరసంగా ఆలోచించిన వాడు, నవపరిభవ సంతాపంతో మొహమెర్రగా చేసికొని - 'స పర్వతవనోద్దేశాం..... నయితుం శక్తి రస్తి మే'[12] అంటాడు. అంటే, హనుమ శక్తి నిర్దిష్టంగా ఇంత అనలేం. ఇయత్త నేర్పరచలేని అతని శక్తి అపరిమేయం. ఐతే, సామాన్యంగా ఉన్నపుడు తనే ఊహించలేడు. ఆవేశం (అది పరాభవజన్యం కావచ్చు, ప్రోత్సాహనభవ్యం కావచ్చు) కల్గితే - అపుడు ఆయన అంచనాల కందుతుంది. ఇది హనుమలోని లోకోత్తర విశేషం. ఇలాంటపుడు కూడా కార్యసాధనోపాయంగానే దాన్ని వినియోగించడం, ఇతరులను తక్కువ చేయకపోవటం గమనించాల్సింది.

హనుమ మాత్రమే కాదు, లంఘన దక్షులైన వానరవీరులను గూర్చి చింతించింది. విభీషణుడు కూడా. హనుమను వధించండని రావణుడాదేశిస్తే, శాస్త్రానురోధంగా వర్తించమని నయాన నచ్చజెప్తూ -

అపి చాస్మిన్ హతే రాజన్ నాన్యంపశ్యామి ఖేచరం,
ఇహ యః పునరాగచ్ఛేత్ పరంపారం మహోదధేః (58-20)

అంటాడు. (హనుమ కూడా - 'ఓ వేళ నేనిక్కడ నిరోధింపబడితే, మరింకెవరు రాగలరు?' అనటం గమనించ తగ్గది). దీనివల్లా, సీత మాటలవల్లా, హనుమ ఆలోచనవల్లా వానరుల శక్తియుక్తులు ఎంతటివో మనం ఊహించవచ్చు. ఇవన్నీ

ఎందుకు? అసలు వారే చెప్తారు - 'నా శక్తి ఇంత' అంటే, 'నా శక్తి ఇంతే' అని. ఆ వివరాలు విచారించే ముందు ఈ వీరులే అన్న మరోమాటా పరిశీలిద్దాం.

సీతాన్వేషణకు బయలుదేరబోతున్నారు. రామలక్ష్మణ సుగ్రీవుల సన్నిధి, సుగ్రీవుడు నాల్గు భాగాలుగా చేసి నిర్దేశిస్తున్నాడు. ఎవ్వరూ ఏమడక్కుండానే పుసుక్కుమని- ఒక్కొకరు ఇలా వికత్థన విజృంభణం కావిస్తారు.

'నే నొక్కడినే జానకిని తీసికొని వస్తాను. పాతాళంనుంచైనా సరే!'
'నే నైతే, చెట్టుపీకి రావణునిపై పడేసి, వాణ్ణి నిర్జిస్తాను'.
'నేను కొండలు విసిరి చంపుతాను'
'నేను భూమిని చీల్చేస్తా'
'నేను సాగర మిగిర్చి...... '
'ఒక యోజనం ఎగురుతా. సందేహం లేదు'.
'ఒ హటా! వంద యోజనాలు అవలీలగా దాటేస్తా!'

ఇవి - వానరులన్న మాటలు (చూ. కిష్కింధ - **45-13-15**) కపిత్వమనవస్థిత మంటారా? సరే, అసలు విషయానికి వద్దాం.

సంపాతి చెప్పాడు, సీతజాడ. వెళ్లి నిర్ధారించుకొని వచ్చి సుగ్రీవుని కెరిగించాలి. సముద్రాన్ని చూచి బిక్కచచ్చిపోయి బితుకు బితుకుమంటూ కూర్చున్న వారిని ప్రోత్సహిస్తూ[13] 'ఎవడి ప్రభావం వల్ల మనం ఇళ్లకు చేరి పెళ్ళాం-పిల్లల్ని చూడగలుగుతాం?' అంటే, కిక్కురుమనడు, ఎవడూ! పూర్వ ప్రసంగం మనసులో మెదిలిందో, అంగదుని ప్రోత్సాహం ప్రోద్బలకమైందో, సవ్రీడంగానే తమ తమ యథార్థ శక్తుల్ని బైటపెడతారు. ఇందులో అత్యుక్తుల్లేవు. భేషజాలు లేవు. గర్వాహంకారాల్లేవు; నిజం తప్ప. అన్నీ నిజశక్తికి నికషమైన మాటలే. అందరివీ ఆత్మ ప్రత్యయావధికమైన మాటలే!

| | | | | | |
|---|---|---|---|---|---|
| గజ | - 10 | యోజనాలు | మైంద | - 60 | యోజనాలు |
| గవాక్ష | - 20 | ,, | ద్వివిద | - 70 | ,, |
| గవయ | - 30 | ,, | సుషేణ | - 80 | ,, |
| శరభ | - 40 | ,, | జాంబవంతుడు | - 90 | ,, |
| గంధమాదన | - 50 | ,, | అంగద | - 100 | ,, |

వీళ్లంతా 'గమిష్యామి' వెళ్ళగలనన్నవారే. తిరిగి రాగలననలేదు. అంటే, వందా పూర్తి ఐతే కదా వెళ్లటం, రావటమూను. కనుక రాగలనన్నదే లేదు. అంగదుని వద్దకు వచ్చిన తరువాత ఈ ప్రశ్నకు – 'వెళ్తాను, కానీ తిరిగి రాలేనేమో' అని అనుమానంగా అంటాడు. 'నివర్తనే తు మే శక్తిః స్యా న్నవేతి న నిశ్చితా (కి॥ 65-19).

నీవు రాజువి, అని – జాంబవంతుడాతని నివారించి, హనుమను ప్రోత్సాహ పరచి పంపే ప్రయత్నం చేస్తాడు. ఎన్నో యోజనాల దూరంలో గల సూర్యుని గ్రసించేందుకు పుడుతూనే ఎగిరాడు, అంటాడు. అప్పుడే అంతగా ఎగిరిన నీకు ఇప్పుడు ఎగరటం ఏమంత పని? అని అర్థం. ఈ విధంగా ఆభిజాత్యాన్ని, వరాలను, వరగోపనరహస్యాలనీ, నిజబలాన్ని, బలజ్ఞాన విరహితంగా సామాన్యంగా ఉండటాన్ని చెప్పి, తామంతా తనపైనే ఆశలు పెట్టుకొని ఉన్నామని, తమ ప్రాణాలు ఆతడు 'ఔ' ననటంపై ఆధారపడి ఉన్నాయనీ అంటాడు. 'వయ మద్య గతప్రాణాభవాన్నస్త్రాతు సాంప్రతమ్' (కి - 66-31). నీతో సమంగా ఎగిరేవాడు వాయువు, గరుత్మంతుడు మాత్రమేనని సంసిద్ధుణ్ణి చేస్తే – మొదట వానరుల కోసమే ఎగురుతున్నానని సిద్ధమౌతాడు. అప్పటి వానరుల స్థితి అలా ఉంది. ప్రాయోపవేశనానికి సిద్ధంగా ఉన్నారు. మొదట అందుకే వారికోసమే ఎగురుతానంటాడు. తరువాత సీత కోసం – లంకాకృత్యాలన్నీ అంటాడు. కానీ చివరకు రాముని కోసం! ఎందుకంటే తనకంటే – 'దుష్కరం కురుతే రామః'. ఏమది? 'హీనో య దనయా' – అందుకే కేవలం ప్లవనంతో సరిపెట్టలేదు. శాఖా చంక్రమణం! కోతి కొమ్మచ్చులు!

వానరులు లంకను చేరగలరా? అన్నది తెలిసికోడానికి. చేరలేరని అక్కడక్కడి వారి మాటల వల్ల గ్రహించాం. మరి హనుమ ఎందుకలా అన్నాడో గ్రహించాలి.

సహృదయులైన బుద్ధిమంతులు – 'హనుమను పంపించడానికే వానరులు వెనక్కు తగ్గారు' అని అంటున్నారు. అదేమంటే, అందులో కొందరు శతయోజన క్రమణ సామర్థ్యం కలవారుట! (చూ. కి॥ 45 సర్గ)[14]. అంగదుడు కూడా – నహి వో గమనే సంగః కదాచిత్ క్వచిత్ (కి. – 64) అంటాడు[15].

హనుమ కూడా – అతడు రాగలడు, ఇతడు రాగలడు – అని కొంతమందిని పేర్కొన్నాడు. కనుక సామాన్యోక్తిలో వీరంతా ఏకోత్పాత మాత్ర సాగరక్రమణ సమర్థులే! హనుమ, తనకీ గొప్పతనం కట్టబెట్టారన్న కృతజ్ఞత వల్లనో, నిజంగా వీరి సామర్థ్య మెరిగో ఈ మాటలంటున్నాడు – అంటారా? అభ్యంతరం లేదు. కానీ, రహస్సంచారం చేస్తూ రాజనీతితో ప్రతిపదం మెలగిన కిష్కింధా సామ్రాజ్య మహాప్రధాని ప్రకృష్ట విజ్ఞాన ప్రతిభానం ఈ తావుల కానరాదా, అన్నదే ప్రశ్న!

అంచేత, హనుమకి వారు అప్పగించారు, అంటగట్టారు అన్నది నిజమైనా కాకున్నా, హనుమ వినీతతే ఎక్కువగా కనవస్తుంది, ప్రతి పదమూను. ఎందుకంటే, లంకను చేరగల వారిని చెప్తూ తనను చివరన చేర్చటం గమనించాలి. ఎవరూ సాహసించక, రాలేమని చతికిల పడ్డపుడు, తను వచ్చాడు. నిజానికి తనను చెప్పుకొని, తర్వాత – 'వస్తే, బహుశః వీళ్ళు రాగలరు' అనాలి. అలా అనడు. అంతేనా, ఈవల నున్న వారంతా తనకంటె అధికులు. కాకుంటే సమానులు. ఇదీ హనుమతీరు, స్వభావం!

మరోమాట – హనుమకు కీర్తి పొందాలన్న తృష్తీ ఉంది[16]. ఇది హనుమ స్వయంగా సాధించిందే. ఆయన అవికత్థనుడు. అందుకు – శాపాలనడ్డం

వేయనక్కర లేదు. హనుమ కలుపుగోరుతనం, వానరులపట్ల ఆయనకుగల ఆత్మీయతాబుద్ధి గమనించాల్సినవి. నిజానికివి హనుమకు గొప్పదనాన్ని కట్టబెట్టినవి. అంగదుని తరువాత అంతటివాడు, హనుమ వానర సేనకు. అందుకు రుజువులు రెండు, ఒకటి కాదు.

> కోన్య స్తాం వానరీం సేనాం శక్తః స్తంభయితుం భవేత్,
> అన్యత్ర వాలితనయాత్ - అన్యత్రచ హనూమతః (కి - 64-15)

మధు భక్షణ సమయంలో అంగదుని ఆమోదం, హనుమ మాటపై. ప్రత్యాగత హనుమ దాహ్వానం, సంభావనం వానరులెలా కావించారో చూడండి. ఇవన్నీ హనుమ పట్ల వారికిగల అనురాగాన్ని వ్యంజింప చేస్తాయి. అంత పెద్ద మంత్రీ ఎంత సన్నిహితంగా ఉంటాడో, అంత సన్నిహితుడూ ఎంత అప్రధృష్యంగా ఉంటాడో! జాంబవంతుడనే వరకూ ఎవరూ హనుమ దరి చేరరు. మొత్తం పై-హనుమ అన్న ఆ ఒక్క మాట వెనకా ఇంతటి ప్రేమ పరిపుష్టమైన ఉపాధి ఉంది. కనుక ఆ మాటను నిరుపాధికమైందిగా కొట్టేయలేం.

పూర్వ (సుందర) కాండమంతా తమశక్తి హైన్యాన్ని, ఉత్తర (సుందర) కాండమంతా తమశక్తి వైశిష్ట్యాన్ని ఉగ్గడిస్తాడు. కారణం ముందు ముప్పై సర్గల్లోని మాటలు తనలో తాననుకొన్నవి. అక్కడి స్థితిగతుల్ని బట్టే, రక్షణ వ్యగ్రమై పటిష్టమైన పరివారాన్ని బట్టే, జలదుర్గాధీన ధైర్యాన్ని బట్టి - తమవారి శక్తియుక్తుల్ని అంచనా వేస్తాడు. రాగలరా? వచ్చినా ఎదురొడ్డి నిలవగలరా? ఇత్యాదిగ. ఈ నిశిత పరిశీలనం నిశ్చితంగా వానరవీరులను తక్కువ చేసేది కాదు. ఒక జాగరూకుడైన రాజనీతివేత్తను, సూక్ష్మబుద్ధితో కార్యాన్ని సాధించదలచిన వానినీ పట్టిచూపుతుంది.

ఇక తరువాత విజృంభిస్తాడు, సీత పరిభవించాక. కొందరు రాక్షస వీరులను చంపడంతో తనవారి ప్రశంస పరకాష్ఠకు చేరుతుంది. కారణం, వారి శక్తి తెలిసింది. ఒడుపు చిక్కింది. తన వారేం తక్కువ వారు కాదు. ఉత్సాహపరిస్తే

ఉప్పొంగిపోతారు. ఉరుకుల పరుగులతో ఉవ్వెత్తున ఎగసే ఉదధి ఉప్పరాని కెగసి దాటగల మొనగాళ్ళు ఔతారు; అనుకున్నాడు. అందుకే ఈ మాట బాహాటంగా అన్నాడు. అశోకవనంలో సీతమ్మ ననునయించడానికీ, రాక్షసులలో రవరవలు పెట్టడానికీ సరే, వ్రీడావిలసితుల నుత్సాహపరచడానికే - 'మీరూ దాటగలరని మాట ఇచ్చాను సుమా!' అన్నట్లు అంటాడు.

ఇందుకు హనుమ మాట సాక్ష్యం !

వాల్మీకి మనసూ సాక్ష్యం !



అధోజ్ఞాపికలు :-

1. సుందర - 68-17-23
2. One time more
3. సుందర - 39-26
4. సుందర - 68
5. 'ప్రవృత్తస్యావిరామే శాసితవ్యాభవంతీ' అని మహాభాష్యము. విశేష
తాత్కాలిక భవిష్యత్తునీ, ఆసన్నభూతాన్నీ కూడా చెప్తుంది.
6. సుందర - 58 - 142
7. సుందర - 68 - 17-23
8. సుందర - 30-35
9. రాఘవశరదృష్టాంతత్వేన స్వస్య అవిళంబత్వ అప్రతిహతత్వాదికం సూ
- గోవిందరాజులు.
10. సుందర - 2-3
11. లేదంటే - 'చుచుంబ పుచ్ఛం' అంటూ వాల్మీకి కూడా గేలి చేస్తాం
12. సుందర - 37-37
13. వానరులకు ఈదటం తెలియదు!
14. చూడుము - కిష్కింధా - 45 సర్గ.
15. కిష్కింధా - 64
16. సుందర - 35-78

* * *

# వినీతుడుగా హనుమ

హనుమ సీతాన్వేషణమునకై లంకను ప్రవేశించెను. ఆమెను గుర్తించి, ఆమెతో సంభాషించి, ఆమెకు విశ్వాసము కల్గునట్లు సాంత్వన వాక్యములు పల్కెను. రాముడు వానర సైన్యముతో వచ్చి శత్రువును పరిమార్చి నిన్ను రక్షించుననెను. సీత ఆ మాటలకు సంతసించియు, హనుమను ఒక సందేహమును గూర్చి ప్రశ్నించినది. పారావార పరం పారాభిగమ ప్రయత్నమున కృత కృత్యులెందరు? వారు ఎట్లు వచ్చి అనన్య సామాన్యుడైన శత్రువు నెదుర్కొన గలరు? ఇది ఈమె అనుమానము, దానికి హనుమ –

'అమ్మా! వానర సేనా నాయకుడగు సుగ్రీవుడు బలవంతుడు. నిన్ను రామునితో చేర్చుటకు కృతనిశ్చయుడై యున్నాడు. కొన్ని కోట్ల వానరులతో అతడు త్వరలో ఇచ్చటకు రానున్నాడు. ఆ సుగ్రీవుని ఆజ్ఞను పాలించి మనసుకన్న అధికమగు వేగముతో పోగల బలవంతులగు వానరులు కొన్ని కోట్లమంది కలరు. వారు – పైకి ఐనను, క్రిందికి ఐనను, అడ్డముగా నైనను పోగలరు. ఎంత గొప్ప పనులనైనను దిగులొందక చేయగలరు. వారు అనేక పర్యాయములు మహోత్సాహముతో, వాయు మార్గము ననుసరించి, భూమికి ప్రదక్షిణం చేసినవారు.

'మద్విశిష్టాశ్చతుల్యాశ్చ.....'. నేనే గొప్పవాడినని నీవనుచుంటివి. కానీ, ఓ అమ్మా! సుగ్రీవుని వద్ద నా కంటే గొప్పవారు, నాతో సమానులు ఎందరో కలరు. నా కన్న తక్కువ వాడెవ్వడును లేడు. ఇటువంటి పనులకు ఉన్నవారిలో తక్కువ వారిని పంపుదురు కానీ పెద్దవారిని పంపరు. అందుచే నన్ను పంపిరి. నేనే ఇచ్చటికి వచ్చినపుడు, వారి సంగతి చెప్పవలెనా?'' అని ప్రత్యుత్తర మిచ్చినాడు.

ఇందు రెండు విషయములు గమనార్హములు. ఒకటి – సీతను సాంత్వన పరచి ఆమెకు ధైర్యము కల్గునట్లు మాటాడుట. రెండు – హనుమ నైచ్యాను సంధానము.

ఇది యథాలాప ప్రసంగమా? నిర్దిష్ట లక్ష్యోపేతమా? స్వరూపానురూపమా? రాజనీతి తంత్ర విలసితమా? అను ప్రశ్నలు మనకు కలుగక మానవు. హనుమ ఈ వాక్యములలోని యాథార్థ్యమును గ్రహించుట ప్రస్తుతాంశము.

'మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవ సన్నిధౌ' నాకన్న తక్కువ వాడు సుగ్రీవుని వద్ద లేడు. ఇదెంత వరకు సత్యంము సమీచీనమన్నది పరిశీలింప దగినది.

సామాన్యముగ మనము వెనకనుండి పెద్దలను, అర్హులగు వారిని ముందు నిడుకొనుట సంప్రదాయ సముదాచారముగ చూచుచుందుము. అట్లే హనుమ అనెనా? లేక నిజముగ 'అవరులు' లేరా? అనిన, వానరుల బలాబలములను తారతమ్య వివక్షతో అనుశీలింపవలెను.

హనుమ దృష్టిలో వానరులు కొందరు దశనాగబలులు, వాయు సమాన బలులు కొందరు. కొందరప్రమేయ బలవంతులు. వైనతేయసములు కొందరు..... ఇలా వారి బలవత్తను గూర్చి హనుమ సీత వద్దను, రావణుని వద్దను ప్రశంసిస్తాడు. అంతేనా

వానరాణాం ప్రభావోపి న కేన విదితః పురా,
దేవతానాం సకాశంచ యే గచ్ఛంతి నిమంత్రితాః
(సు-58-142)

అని రాక్షసుల మధ్య వానరుల ఔత్కృష్ట్యాన్ని నిష్కృష్టంగా నిరూపించి, ప్రత్యాగమనానంతరం పునరాఖ్యానం చేస్తూ వీరి కుత్సాహ సంజనకంగా ఉండేందు కన్నమాటే ఐనా నిజమే కావచ్చు.

అంతేకాదు 'అహ మేకోపి పర్యాప్తః సరాక్షసపురీం, తాంలంకాం తరసా హన్తుం రావణం చ మహాబలమ్' అని, నేనొక్కడినే రణరంగంలో రావణుని (సపుత్రబాంధవంగా) సంహరించ సమర్థుడిని. ఇంత యుద్ధోద్ధతులైన మీమాట

చెప్పాలా! అంటూ – [illegible]
సమీక్ష చేస్తూ –

సముద్రం వేలాతిక్రాంతం కావచ్చు. మందరాచలం ప్రచలించవచ్చు – కానీ, అరివాహిని జాంబవంతుని కదల్చనైనాలేదు. సర్వరాక్షస సంహారణైక దక్షుడే యువరాజు, అంగదుడు. పనసుని ఊరు వేగానికి ఉరుమందరగిరి గిరగిర తిరుగుతుంది. ఇక రాక్షసుల మాట చెప్పాలా? అలాగే నీలుడు. దేవాసుర యక్షగంధర్వ పక్ష్యాదులలో మైందునకు ప్రతియోద్ధ ఏడీ? వానర సైన్యమంతా ఎందుకు? ఈ అశ్విపుత్రులు చాలు రాక్షస సైన్య నిర్మూలనానికి –

ఇవీ, లంకానగరంలో నామ విశ్రావణ పూర్వక జయోత్సాహ రణోత్ప్రేరకం కావాలని అన్నమాటలా? ఔపచారికంగా అన్నవా? లేక ఉన్నమాటేనా? ఇక – సుగ్రీవుడు వానరులను గూర్చి రామునితో ఇలా అంటాడు – 'ఆగతాః..... మద్విషయ వాసినః, త ఇమే బహు విక్రాంతై ర్హరిభిర్భీమ విక్రమైః, ఆగతా వానరాఘోరా దైత్యదానవ సన్నిభాః, ఖ్యాతకర్మాపదానాశ్చ బలవంతో జితక్లమాః పరాక్రమేషువిఖ్యాతా వ్యవసాయేషు చోత్తమాః, పృథివ్యంబుచరా రామ నానానగ నివాసినః, కోట్యగ్రశ ఇమే ప్రాప్తా వానరా స్తవ కింకరాః' (40 సర్గ – కిష్కింధా).

ఖ్యాతకర్మ – అపదానాః – అత్ర కర్మ శబ్దః అతి దూరలంఘన క్రియావాచీ, అపదాన శబ్దః పూర్వవృత్తాది విస్మయనీయ వీర్య శత్రు నిరసన రూప క్రియావాచీ – అని వ్యాఖ్యాతలు.

సీతాభిగమ రూప కార్యనియోజనం చేస్తూ, నిర్దిష్ట దిగ్గమనాని కాజ్ఞాపించి, వారికి తత్తదాశాలక్షణ నిర్దేశం చేస్తూ, అవధులేర్పరచి యావత్పర్యంత మభిగమ్యమో చెప్తాడు.

'ఏతద్వానరైశ్శక్యంగంతుం వానరపుంగవాః, అభాస్కర మమర్యాదం నజానీమ స్తతఃపరమ్' అంటాడు. అపుడు జిగమిషులైన వలీముఖ ప్రముఖుల ప్రగల్భాలు పరిశీలించాల్సినవి.

అహమేకో హనిష్యామి ప్రాప్తం రావణ మాహవే.
తతశ్చోన్మథ్య సహసా హరిష్యే జనకాత్మజామ్.
విధమిష్యా మ్యహం వృక్షాన్, పాతయిష్యా మ్యహం గిరీన్.
ధరణీం దారయిష్యామి క్షోభయిష్యామి సాగరాన్
అహం యోజన సంఖ్యాయాః ప్లవితా నాత్ర సంశయః
శత యోజన సంఖ్యాయాః శతం సమధికం హ్యాహమ్.

ఈ సమధికోత్సాహ సంరంభం, మిగిలిన వానరుల మాటెలాగున్నా, అవాచీదిశాన్వేషణ వ్యగ్రులైన వానరులను గమనిస్తే ఎలా నీరు కారిపోయిందో తెలుస్తుంది. గుహా నిర్గమ నాశక్తులైన వారు ఎలాగో బైటపడి సంపాతి స్నేహ సంపాదనంతో లంకాభిగమదక్ష వలీముఖ పరీక్షా వ్యగ్రులైన వారి వచనాలలోని గాంభీర్యం సంరంభాన్ని కాక సంయమనాన్ని, ఔద్ధత్యాన్ని కాక ఔచిత్యాన్నీ వెలువరించేది. కొండలు పిండి కొట్టేస్తాను సముద్రాన్ని ఎండబెట్టేస్తాను - అని డప్పాలు కాక, సౌహార్దంతో సరళమనస్కులై నిజంగా నిజశక్తిని - తమతమ స్తోమతనీ నిర్భయంగా - ఓ రకంగా చెప్పాలంటే కించిన్న్యూన మ్లాన దీన వదనాలతో విన్నవిస్తారు. పదియోజనాల నుండి తొంబది యోజనాల వరకు లెక్కలు కట్టి బేరీజు వేస్తారు. నిశ్చితంగా నేను వెడతానన్న వ్యక్తి లేడు. (అంటే అంతకుముందు వానరులన్న మాటలన్నీ ఊరికే ఉత్సాహంతో ఉద్రేకంలో అన్న మాటలే కానీ యథార్థాలు కావని తేలింది. దీన్ని బట్టి మొత్తం వానరుల బల సమీక్ష చేయవచ్చు. ఎందుకంటే మిగిలిన దిక్కులకు వెళ్ళిన వారికంటే దక్షిణ దిక్కుకి వెళ్ళిన సైన్యం శ్రేష్ఠమనీ వరిష్ఠమనీ సుగ్రీవుని వక్కాణ). జాంబవంతుడు కూడా తనగతి విక్రమ పురావైభవాన్ని, ప్రస్తుత గతి విక్రమ ప్రక్రమాన్నీ ప్రస్తావిస్తాడు. లంకా ప్రతిగమనైక శక్తి మత్వాన్ని ప్రకటించి, ప్రత్యాగమనాశక్తతను వెలువరించి విచారించిన యువరాజు అంగదుని - జాంబవంతుడు, ప్రేష్య ప్రేషక విభేద విశదీకరణంతో సాంత్వనపరచగా, అనన్యగతికులై ప్రాయోపవేశనమే శరణ్యం కాగా - ఏకాంత సుఖోపవిష్టుడైన హనుమను ప్రార్థించటం యోగ్యమని తలచి - తత్ప్రరోచనం చేస్తారు. పూర్వ - బాల్యోదంతాన్ని చెప్తారు.

'శతానిత్రీణిగత్వాథ యోజనానాం మహాకపే, తేజసా తస్య నిర్ధూతో న విషాదం గతస్తతః' అంటారు. ఇంద్రక్షిప్త వజ్రం మొరకు పోయిందని, తదాదిగా అనేక గాథల్ని గుర్తు చేస్తారు. ఆఖరికి - 'వయ మద్యగత ప్రాణా భవాన్నస్త్రాతు సాంప్రతం' అని, ప్రార్థిస్తారు. దాంతో, ప్లవనే నాస్తి మే సమః... అని ఉపక్రమిస్తాడు.

అయుతం యోజనానాంతు గమిష్యామీతి మే మతిః, అంటాడు. శతయోజనాంతరిత లంకాగమనం, కిముత? సరి, హనుమ ఎగిరి, కార్యాంతరములను సైతము సాధించి ఆదర్శప్రాయుడైనాడు.

<u>హనుమత్ప్రశంస</u> :- వానరులనందరిని నియోగించుచు ప్రత్యేకాదరమును, విశ్వాసమును హనుమద్విషయమున ప్రకటించినాడు, వానరరాజు. దానితో రాముడును హనుమ యందే కార్యసాఫల్యము నిశ్చయించి చూడామణి ప్రదానము ఆయనకే చేసినాడు.

విశేషేణతు సుగ్రీవో హనుమత్యర్థముక్తవాన్, సతస్మిన్ హరిశ్రేష్ఠే నిశ్చితార్థోర్థ సాధనే, న భూమౌనాంతరిక్షేవా నాంబరే నామరాలయే, నాప్సువా గతిసంగం తే పశ్యామి హరిపుంగవ సాసురాస్సహగంధర్వా స్సనాగనరదేవతాః, విదితా స్సర్వలోకాస్తే ససాగరధరాధరాః, గతిర్వేగశ్చ తేజశ్చ లాఘవంచ మహాకపే, పితుస్తే సదృశం వీర మారుతస్యమహౌజసః తేజసావాపి తే భూతం సమంభువి న విద్యతే, తద్యథా లభ్యతే సీతా తత్త్వమేవోపపాదయ త్వయ్యేవహనుమన్నస్తి బలం బుద్ధిః పరాక్రమః, దేశకాలానువృత్తిశ్చ నయశ్చ నయపండిత...

అని, హనుమద్వైశిష్ట్యాన్ని ఎలుగెత్తి కీర్తించటమే కాదు, తన ప్రతిజ్ఞ హనుమ ద్వారానే నెరవేరుతుందనీ, కిష్కింధా సామ్రాజ్య ప్రతిష్ఠ అతని ద్వారానే ఇనుమడించగలదనీ ఆ మాటలలోని అంతరార్థంగా భాసించటం గమనించ తగ్గది.

హనుమకు రాముని యందనురక్తి, రామునకు హనుమ శక్తి యుక్తులందు విశ్వాసము ఏర్పడినవి. రాజాజ్ఞ, రామానుమోదం, సోదరవానరుల ప్రరోచన

ఇవన్నీ హనుమ శక్తిని పెంచి, ప్లవనయోగ్యతనిచ్చు అధ్యవసాయమును ఏర్పరచినవి. దానితో –

హనుమ ప్రతిజ్ఞ : సాగరం శోషయిష్యామి దారయిష్యామి మేదినీం,
పర్వతాం శ్చూర్ణయిష్యామి ప్లవమానః ప్లవంగమాః
హరిష్యే మ్యూరువేగేన ప్లవమానో మహార్ణవం,
లతానాం వివిధం పుష్పం పాదపానాంచ సర్వశః
అనుయాస్యంతి మా మద్య ప్లవమానం విహాయసా.
(కి॥ 67)

సముద్రాన్ని దాటడమేకాదు స్వర్గలోకానికైనా వెళ్లి అమృతాన్ని తెస్తాను. 'లంకాం వాపి సముత్క్షిప్య గచ్ఛేయ మితి మే మతిః' అంటాడు. అంత జాంబవంతుడు – 'జ్ఞాతీనాం విపులఃశోకః త్వయా తాత వినాశితః' అని హర్షం ప్రకటిస్తాడు. ఇక్కడ వ్యాఖ్యాతలు – అమిత బల పరాక్రమశాలీ హనుమాన్ వస్తుతః స్వోక్త విశేషణ విశిష్టోపి – దుఃఖ సాగరమగ్న వానర వాహినీ సంతోషార్థ మేతాదృశాన్యౌద్ధత్య వచనాన్యుక్తవాన్ – అంటారు.

హనుమ మహేంద్రం పై చేయు సంరంభం, పర్వత పీడ, తద్వాసుల విత్రాసం, తరువుల అనుగమనం, హనుమ ప్రతిజ్ఞ, శరౌపమ్యం, సీతాన్వేషణయత్న వివరణం – ఆమె దొరికితే సరే, లేకపోతే స్వర్గంలోనైనా సరే వెతికి తెస్తాను అంటాడు. అంతటి సమర్థుడాయన!

మిగతా వానరుల ప్రతిజ్ఞలలో (ప్రగల్భాలనటముచితం) సీతా ప్రసక్తే ఉండదు. హనుమ తదర్థమై ఇవన్నీ చేస్తానంటాడు. ఇది గమనించాల్సింది. అక్షరాలా అన్నీ అమలు చేశాడు. చూడండి, సుందరకాండ ప్రారంభంలో ప్లవనోపక్రమావసరంలో వాల్మీకి విశద విచిత్ర వర్ణనం. స్వర్గం వరకూ వెళ్లనక్కర లేకపోయినది. లంకోన్మూలనం పాక్షికంగా జరిగినట్టే! అర్థముల వాగనుధావనమిది!

లంకను పెళ్ళగించటాని కుపష్టంభకం - జాంబవదుద్దిష్ట క్రమాన హిమవత్ పార్శ్వ వర్త్యోషధి పర్వతానయనం. హనుమ ధీ సంకుచితత్వాని కుదాహరణగా దీన్ని పేర్కొనటం మనం గమనిస్తాం. కానీ, తప్పు. చూచి రమ్మంటే కాల్చివచ్చాడు, ఓషధి తెమ్మంటే కొండనే పీకి పట్టుకు వచ్చాడు, అని విమర్శ. కానీ, ఓషధులంతర్హితాలైతే వెతికే అవకాశంలేక గత్యంతరంలేక సమూలంగా పర్వతాన్ని పెకలించుకొని వచ్చాడు. దానివల్ల అవాంతర కార్యాలు నెరవేరాయి.

చాలా శక్తిమంతుడు. తనశక్తి తనకు తెలియనట్లే ఉంటాడు. ఇతరులు చిన్నతన పరిస్తే ఓర్వలేడు. 'నవం పరిభవంకృతం' అంటాడు. పరాభవం ఎరుగనివాడు. అందుకే అది కొత్త ఆయనకి! దాంతో, నమే జానాతి సత్వం వా ప్రభావం వా' అని మహద్రూప సందర్శనం కావిస్తాడు. పంచముఖ-ఆంజనేయునిగా సీత ముందు నిల్చినట్లు వ్యవహారం. కానీ, వాల్మీకి పంచముఖునిగా కాక - పర్వత సంకాశః, తామ్రవక్త్రః, మహాబలః, వజ్ర దంష్ట్ర నఖః, భీమః - అగ్రతో వ్యవతస్థే చ సీతాయాః, అంటాడు.

'స పర్వత వనోద్దేశాం సాట్ట ప్రాకారతోరణాం, లంకామిమాంసనాథాం వా నయితుం శక్తి రస్తి మే.'

ముందు చేసిన ప్రతిజ్ఞకు సంవాది ఇది. రోషానలోద్దీపితమైన ఈ మాట శరధ్యుత్క్రమణోత్సాహోద్బుద్ధమైన ఆ మాటతో సంవదించటం గమనించాలి.

దాసోహం కోసలేంద్రస్య..... అని ప్రఖ్యాతను ప్రకటించినా అదొక ఆధికారిక చిహ్నంగా ముదావహమైనదిగా అరచి చెప్పి, నరావణ సహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్, అంటాడు. వారి నగరం నడిబొడ్డున అధిక సంఖ్యాకులైన సమధికోత్సాహంతో యుయుత్సులైన యాతుధానాధినాథు సైనిక యోధుల యూథ మధ్యంలో, ఒకమారు కాదు రెండుసార్లు అంటాడు. పునరుక్తి దోషం కాదా? అంటే - కాదు. తన రోషం ప్రకటించటానికి, వారి ఆవేశం రెచ్చగొట్టడానికి.

రాక్షస స్త్రీలు వనభంజనోత్సాహియైన ఆంజనేయుని వర్ణించటం, వీతిహోత్రునికి ప్రీతి పాత్రంగా భవన దహన హేతువైన దూత యమదూతేమోనన్న శంకాతంక మనస్కుల మాటలు....... హనుమ వీర విస్ఫురణాన్ని విశదీకరించేవే. యుద్ధ విక్రమణాన్ని మనం పరిశీలించనక్కర లేదు. ఇలా అడుగడుగునా వీరరసావతారంగా సాక్షాత్కరించే హనుమ 'మత్తః ప్రత్యవరో నాస్తి' అనటం ప్రహ్వతా ప్రకటనోద్దేశంతోనే.

విరాట్ స్వరూప ప్రకటనోపాధిగా 'మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి' అన్న జగదాచార్యుని మాట, రాశీభూత దాసభావం అన్న ఈ మాట సరళ రేఖలుగా, సలక్షణంగా సహేతుకంగా సర్వజనమనః ప్రహ్లాద సంజనకంగా ఉన్నాయనటంలో విప్రతిపత్తిలేదు. నతాంసంతో నాణ్యమైన మాట అన్నాడు, అమ్మ ముందు - హనుమ. ఆమె జగన్మాత. జగత్పతి రాముడు. వారి ముందే కాదు, సర్వవానరుల ముందూ తాను ప్రహ్వీభూతుడయి ఉంటాడు. కేవలం శత్రు సంహరణ సందర్భంలోనే హనుమద్విజృంభణం చూస్తాం. అట్లాంటి దాసుడాయన భగవద్ భాగవతులకు.

ఎంత బుద్ధిమంతుడో అంత బలవంతుడు. ఎంత బలవంతుడో అంతవినీతుడు. ఆయన వినయ సౌరభం సర్వకాల సర్వావస్థలా సహృదయ హృదయ కంజాతాలలో పరిమళిస్తూనే ఉంటుంది.



# వాగ్మిగా హనుమ

హనుమ ఎంత మాటకారో అంత మితభాషి కూడా. కొన్ని చోట్ల విశదంగా మాటాడే అతడు, కొన్నిచోట్ల 'టూకీగా' తేల్చేస్తాడు. వీళ్ళతో ఇంతచాలు అనో, ఈ విషయంపై ఇంత కంటె అక్కరలేదు అనో, ఈ సందర్భంలో ఇలాగే మాటాడాలి అనో! కారణం, అతనిలో రాజనీతిజ్ఞుడు, ఇంగితజ్ఞుడు కూడా దాగి ఉండటం కావచ్చు. సీతా(పదాన్వేషి) సంక్షిప్తతా, రావణ వధకథనోత్సాహి సమగ్రతా గమనించాల్సినవి.

సీతతో మాటాడే ముందు కొంత సన్నాహం (preparation) ఉంటుంది. ఏం మాటాడాలి? ఎలా మాటాడాలి? ఏ భాషలో మాటాడాలి?..... అన్నీ అనుకుంటాడు. రామునితో మాటాడే ముందు ఈ సన్నాహమేం కనిపించదు. రాముని ఆనుపాన్లు తెలుసుకోవాలి. ఎందుకొచ్చాడో తెలుసుకోవాలి. మిత్రుడా? శత్రువా?..... మిత్రుడని తెలియగానే వానర రాజ్యం సుగ్రీవుని హస్తగతమైనట్లే భావిస్తాడు. సీతతో మాటాడినపుడు - భాష - భావం - పద్ధతి - అన్నీ ఆలోచించుకొనే మాటాడతాడు. అక్కడ ఆమెకి నమ్మకం కల్గించడమే ముఖ్యం. రాముడు మనకి నమ్మదగ్గవాడా అన్న పరీక్ష ఇక్కడ.

ఇవి రెండూ హనుమలోని వాగ్మిని మనకు చూపించే ఘట్టాలు. ఇతర సందర్భాలలోనూ అతని ప్రసంగం - శ్లక్ష్ణం, మధురం అంటాడు మహర్షి. అట్లాంటి సందర్భాలు రామాయణంలో నాలుగయిదు చోట్ల కనవస్తాయి.

వాలి వినిపాతనం తరువాత హనుమ మాటల్లో - ఆతని రాజనీతి వైశారద్యం కనిపిస్తుంది. ఇక్కడ వాల్మీకి నిర్విశేషణంగా హనుమ వ్యాహారాన్ని పేర్కొంటాడు[1].

అలాగే సుగ్రీవ ప్రచోదనం కావిస్తూ సర్వవానర యోధుల్నీ సమీకరించమన్న సందర్భంలో హనుమ మాటలు ధర్మార్థయుతాలు, నీతి విలసితాలూ కావడంతో పాటు ఉపకార స్మృతితో కృతజ్ఞతా విష్కరణ సమర్థాలుగా భాసిస్తాయి[2].

సముద్ర తీరంలో ప్రాయోపవేశనం కావించాలని తీర్మానించిన వలీముఖ ప్రముఖుల మధ్య, అంగదుణ్ణి కిష్కింధకు మరలిపొమ్మంటున్న హనుమ మాటలు ప్రశ్రితాలు, ధర్మ సంశ్రితాలూను[3].

రావణుని హెచ్చరిస్తూ ఔపదేశిక ప్రతిపత్తితో హనుమ కావించిన సంభాషణం ధర్మార్థ సహితం మాత్రమే కాక - ఇహాముత్రచ క్షమంగా ఉంటుంది[4].

సముద్ర లంఘన సమయంలో మైనాక, సురసలతో కావించిన సంభాషణంలో ఆప్యాయతని, వినమ్రతనీ చూస్తాం. మధు భక్షణ (వనభంజన) సమయంలో హరివీరుల పట్ల ఆత్మీయతను అవలోకిస్తాం[5].

ఈ విధంగా హనుమ ఎక్కడ మాటాడినా ఆ మాటల్లో నీతి-ధర్మం, సభ్యత-సంస్కారం, దయా-దాక్షిణ్యం, విజ్ఞత-వినమ్రత, కృతజ్ఞత-సమయోచితత... ఉంటాయి. కార్యావిరుద్ధంగా ఉంటూ - రాజ్యక్షేమ, రాజనీతుల్ని పరిగణనలోకి తీసుకొంటున్నది గానే ఉండటం విశేషం. ఇలాంటి మాటలకి, వ్యసనవ్యగ్రులైనా, ఇద్దరు కయిసేసిన కతపత్రాల ద్వారా వాగ్మి అయిన హనుమ నవలోకిద్దాం.

సీతాన్వేషణ సమయంలో సుగ్రీవ సాహాయ్యాన్ని అపేక్షిస్తూ ఋశ్యమూక ప్రాంతానికి వచ్చారు, రామలక్ష్మణులు. వాలిబలానికి జడిసి ఎలాగో కాలం వెళ్ళదీస్తున్న సుగ్రీవుడికి, ప్రతి వ్యక్తీ అనుమానాస్పదంగానే కనవస్తున్నాడు. అందుకే రామలక్ష్మణుల్ని అనుమానించాడు. హనుమను పంపి వారి వివరాలు గ్రహించమన్నాడు. ధనుర్ధారులైన వారిని తమవారిగా చేయమన్నాడు.

హనుమ భిక్షు రూపం ధరించి వినీతునిలా వచ్చి నమస్కరించాడు. మాటాడనారంభించాడు-[6] శ్లక్ష్ణంగానూ, సుమనోజ్ఞంగాను. శ్లక్ష్ణం అంటే మృదువు అని అర్థం. సుమనోజ్ఞం అంటే అతిరమ్యం! శ్లక్ష్ణమైన ప్రతీదీ మనోజ్ఞం కానక్కరలేదు. అలాగే మనోజ్ఞమైనది శ్లక్ష్ణమూ కానక్కరలేదు. అలా అని రెండూ ఒకచోట ఉండవని కాదు కానీ, అరుదు. బహు విరళం!

మృదువైన మాట చెవికింపుగా ఉండవచ్చు. కానీ హృదయాన్ని అలరించి జయించేదిగా ఉండాలి. అలాంటి కర్ణపేయమూ, హృదయావర్జకమూ అయిన మాటలతో సంభాషణమారంభించాడు, హనుమ. మహర్షి మనోజ్ఞమని ఊరుకోకుండా, 'సుమనోజ్ఞం' అంటాడు.

వారిని ప్రశంసిస్తున్నట్లు బైటకి కనవచ్చే ఆ మాటల వెనక ఓ రాజనీతివేత్త- హఠాత్తుగా రాజ్యంలోకి అడుగుబెట్టిన ఆగంతుకుల్ని నిశిత పరీక్ష చేస్తూ వివరాలు రాబడుతున్న వైనం - కనవస్తుంది. అయినా అప్పటి హనుమ ప్రసంగం స్నేహయుక్తమట!

హనుమ యొక్క వాఙ్మాధుర్యానికి రాముడు ఆనందించాడు. ఆనందం దాచుకోలేక ప్రశంసించడానికే అన్నాడో - తమ్మునికి రాజనీతి శిక్షణకు అదను దొరికిందనే అన్నాడో, మరి!

నానృగ్వేద వినీతస్య, నాయజుర్వేద ధారిణః
నా సామవేద విదుషః శక్యమేవం ప్రభాషితుమ్,
నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతం,
బహు వ్యాహరతానేన నకించిదపశబ్దితమ్
న ముఖే నేత్రయోర్వాపి లలాటే చ భ్రువోస్తథా
అన్యేష్వపి చ గాత్రేషు దోషః సంవిదితః క్వచిత్

సంస్కార క్రమ సంపన్నా మద్రుతామవిళంబితాం, ఉచ్చారయతి కళ్యాణీం వాచం హృదయహారిణీం
అనయాచిత్రయావాచాత్రిస్థానవ్యంజనస్థయా, కస్యనారాధ్యతే చిత్తముద్యతాసే రరేరపి.
(కి॥ 4 - 28-33)

ఋగ్యజుస్సామ వేదాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. వ్యాకరణాన్ని పలుమార్లు విన్నాడు. ముఖంలోను మాటల్లోనూ అవలక్షణాలు లేవు. చంపాలని కత్తినెత్తినవాడు కూడా, ఈతని మాటలకి మెత్తబడిపోతాడు. అని ప్రశంసిస్తాడు శ్రీరాఘుడు.

మాటాడేటప్పుడు హనుమలోని సావధానత వలన ఋగ్వేదవినీతుడు అంటాడు, రాముడు. ఋగ్వేదానికి స్వరభూయస్త్వం వలన మనోనియమనం - ఏకాగ్రత - అవసరం. ఋగ్వేద వినీతుని ఆ లక్షణం హనుమలో గమనించాడు, రాముడు.

యజుర్వేద ధారి, ఇతడు. యజుస్సులో అనువాకాలు ఇతరానువాకాలతో కలసిపోనీక జాగరూకతతో ధారణ చేయాల్సి ఉంటుంది. అట్లాంటి ధారణ గుణాన్నీ గమనించాడు హనుమలో.

మంత్ర విపరిణామానికి ఊహతోపాటు రహస్యగర్భిత గానవిశేషాలవల్ల సామవేదం ఒకంత పట్టుబడేది కాదు. హనుమ అందులోనూ విద్వాంసునిగా కనిపించాడు. అధర్వణ వేదానికి అధ్యయన నియమంలేదు కనుక దాన్ని చెప్పలేదు. వేదం అంటే, 'త్రయీ'. నాలుగోది గతార్థం అంటారు కొందరు. ఏమైతేనేం హనుమ వేదవిద్యారహస్యవేత్త. కాకపోతే ఇలా ఎలా మాటాడగల్గుతాడు?

అంటే హనుమ మాటల్లో రామునికి - ఏకాగ్రత గోచరించింది. విశదంగాను, విశకలితంగాను ఉంది సంభాషణం. రహస్య గర్భితంగానూ ఉంది. రాముడు, హనుమలో వేదాధ్యాయినే కాక వేదాంగాలనీ అధికరించినవాని జాడ పసిగట్టాడు. వ్యాకరణాన్ని ఎన్నిమార్లు విన్నాడో! ఎక్కడా ఒక్క అపశబ్దం రాలేదు,

అంటే - హనుమ సంస్కృతంలో మాటాడుతున్న మాట! సామాన్యంగా, లోకంలో మాటాడేవారి ముఖంలో రకరకాల వికారాలు ద్యోతకమవుతాయి. ముఖం చిట్లించటమో, నుదురు చిట్లించటమో, కనులు చికిలించటమో, కనుబొమలు ముడి వేయటమో..... ఏదో ఒక చేష్ట కనబడుతుంది. నిజానికివన్నీ దోషాలు. హనుమ మాటాడుతున్నపుడు - ఎంత సూక్ష్మంగా పరిశీలించినా - ఈ దోషాల్లో [7] ఏ ఒక్కటీ కానరాదు. అందుచేత, హనుమను ఉత్తమవక్తగా ప్రశంసించాడు, రాముడు. ఇలా హనుమ ఉచ్చారణశక్తిని ఉపన్యసించి ఊరుకోకుండా, ఆయన వాక్యప్రయోగ చాతురినీ ప్రశంసిస్తాడు.

చాలా విస్తారంగా మాటలుండకూడదు. అలాగని సంక్షిప్తంగానూ ఉండకూడదు. పద వర్ణ సందేహానికి అవకాశం లేని విధంగా మాటాడాలి. మాటకీ మాటకీ మధ్య అపేక్షితవ్యవధానం మాత్రమే ఉండాలి. ఎక్కువైతే వక్తయొక్క అసామర్థ్యాన్ని తెలుపుతుందది. అలాగని తొందరా పనికిరాదు పరప్రత్యాయన దృష్ట్యా.... ఇలా చాలా దోషాలు పేర్కొన్నారు, శాస్త్రకారులు [8]. ఆ దోషాల స్పర్శసైతం సోకనివాడు, హనుమ. వ్యాకరణకృతమైన శబ్దశుద్ధి, వర్ణపదక్రమం, వ్యక్తాక్షరత కల్గిన కల్యాణాంచితాలు, మధురాలూను అని ప్రశంసించాడు, రాముడు, హనుమ మాటలని.

ఇలాంటివాడు దూతగా ఉంటే, ఆ రాజు కార్యాలకి వైఫల్యం ఉండదు. ఇలాంటి కార్యసాధకుడు కానీ దొరికితే, అసాధ్యం అన్నదే ఉండదు అని హనుమ బుద్ధిచాతురిని ప్రశంసిస్తాడు, రాముడు. హనుమద్రాముల అనుభావాన్ని ఆకళింపు చేసుకొన్న సౌమిత్రి చేసిన, విద్వన్! అన్న సంబోధన ఈ ప్రశంసాప్రసంగానికి మురువుగొల్పే ముక్తాయింపు.

ఇక, హనుమ - సీతతో మాటాడిన మాటలు - ప్రశ్రితాలు, మధురాలు, అవితథాలూను. ఐతే, సీతతో మాటలాడే ముందు కొంత గుంజాటన పడతాడు. ఏం మాటాడాలి? ఏల మాటాడాలి? భాష - భాషణం దగ్గర నుంచి

అంతా ఎలా నిర్వహించాలా అన్న ఆలోచనతో కొట్టుమిట్టాడతాడు. దైహికంగానూ, మానసికంగానూ, దేశికంగానూ ఆమె పరిదీన స్థితి హనుమ మనసునెంతగానో కదిల్చింది. ఆమెకు సాంత్వనంతో పాటు, విశ్వాసమూ కల్గించాలి, తన మాటలు. అపోహని కల్గించకూడదు. అందుకేమిటి మార్గం? ముందీమెకి సమాశ్వాసనం కల్గించటం న్యాయం. ఎలా? సాంత్వపరచకుండా నే వెళ్లిపోయినట్లైతే పరిత్రాణ మెరుగని జానకి జీవితాన్నే త్యాగం చేస్తుందేమో? రాక్షసీగణం ముందు ఎలా మాటలాడేది? చాలా చిక్కు వచ్చిందే! ఈ రాత్రి గడిచేలోగా మాటాడాల్సిందే. లేకుంటే, సీతే మిగలదసలు. నన్ను అపుడు రాముడు కోపాగ్నితో కాల్చేస్తాడు.

కానీ, ఎలా సంభాషించడం? శిష్టజనవ్యవహార భాష మాటాడేదా? బ్రాహ్మణ సహజమైన సంస్కృతం మాటాడేదా? ఓ వేళ సంస్కృతం మాటాడితే రావణుడనుకోదు కదా, నన్ను. దాంతో భీతురాలైన సీతతో నేనెలా మాటాడతాను? వానర రూపంలో సంభాషణమెలా కుదురుతుంది? అంటే తప్పనిసరిగా మనుష్యునిలా మాటాడాలి. మరింకోమార్గంలేదు. లేక వానర రూపంతోనే ఆశ్వాసనం కల్గించేదా? అలాగైతే, రక్షోభీత సీత ఇంకా భయపడుతుందేమో! అపుడామె అరచిగోల చేస్తే, చాలా ఇబ్బందుల్ని ఎదుర్కోవాలి.

నే వచ్చిన కార్యం చక్కబడేట్టుగా, ఆమెకి విశ్వాసం ఏర్పడేట్టుగా ఏమైనా చెయ్యాలి. అందుకేమిటుపాయం? ఇంకేముంది, రామకథాగానం చేస్తాను.

శ్రావయిష్యామి సర్వాణి మధురాం ప్రబ్రువన్‌గిరమ్ (సుం - **30/42**) అని సముద్యక్తుడౌతాడు. అపుడాతని వాక్కు - మధురమూ, అవితథమూనుట! ఇలా సీతతో కావించిన హనుమ సమభిభాషణలో సౌందర్యాన్ని మాధుర్యాన్ని మహర్షి చిత్రిస్తాడు. హనుమ మాటలో మాధుర్యం శ్రుతిమనోహారతకే కాక హృదయావర్జకతకీ ద్యోతకం. సీతే అంటుంది -

'చిత్తం హరసి మే సౌమ్య నదీకూలం యథా రయః' (34/19) మధుమయ ఫణితుల మహర్షి వ్యాహారసమాహారాన్నే కాక హనుమ సమభిభాషణాన్నీ, పాత్యేగేయేచ మధురమని, ప్రశంసించారు అభియుక్తులు.

ఇంద్రియాల ద్వారా విషయాలననుభవిస్తే జ్ఞాన ప్రసరణం వల్ల రసోత్పాదన మవుతుంది. ఇది లోక సహజమైనది. ఇక్కడ సీతా విషయంలో శబ్ద సంశ్రవణ మాత్రం చేత రసోత్పత్తి జరుగుతోందన్నది తెలియచేయడానికే మధురం అంటాడు, మహర్షి!

లోకంలో భోగానుభవకుశలుడెవడైనా - మధురాన్ని, అంటే - మాధుర్యాంచితమైన దివ్యపదార్థాన్ని అనుభవించాలి. అప్పుడు ఆ విషయానుభవం వల్ల ఇంద్రియాల ద్వారా మధురజ్ఞాన మేర్పడాలి. అపుడా రుచ్యవస్తువు రస్య మానమై అనుభోక్తకి రసోత్పాదన క్షమమై దివ్యానుభవ సుఖాన్ని కల్గించాలి. ఇదీ పద్ధతి. ఇంత పరిపాటి ఉంది. పదార్థంలోకాని, భోక్తలోకాని సౌష్టవం లేకపోయినా, భోగస్థానంకాని భోగోపకరణాలు కాని సముచితంగాను సమీచీనంగాను లేకపోయినా రసానుభవం సమగ్రం కాదు.

ఈ తంతుగానీ, తతంగంకానీ అక్కరలేకుండానే సీతకు హనుమ మాట శ్రవఃపథానకు రాగానే మాధుర్యమనుభవంలోకి వచ్చిందన్న మాట. అంటే హనుమ మాట అంత రసోత్పాదకంగాను, జీవసంధాయకంగాను, హర్ష ప్రదాయకంగానూ ఉందని తాత్పర్యం.

హనుమ కేవలం వాచ్యంగానే కాక కొంత గూఢంగానూ పరేంగిత ప్రకటన క్షమంగానూ మాటలాడిన సందర్భమూ మనం గమనిస్తాం. ఇదీ, సీతా సమక్షంలోనే, ఆమెతోనే! కారణం, ఆమెకు పరిపూర్ణంగా విశ్వాసం కల్గించాలి. ఇతడు రాముని వద్దనుంచే వచ్చేడని ఆమె నమ్మాలి. మారువేషంలో వచ్చిన మాయావి రావణునిగా ఆమె భావించి భయపడకూడదు. మరలాంటి స్థితిలో సీతకి నమ్మిక కల్గించడమెలా? దానికి అవకాశం ఆమే యిచ్చింది.

'క్వతే రామేణ సంసర్గః? కథం రామస్య విహ్నాని?' అన్న ప్రశ్న పరంపర-నిజ సంశయాపనోదనకే కాక, సంశయాస్పద మనస్సమాశ్వాసనకీ రామకథని ఉపకరణంగా ఉపయోగించుకొంటుందామె. హనుమ కూడా తన సాన్నిహిత్యాన్ని సావిహ్యాన్నీ నిరూపించుకోవడానికి ఈ సన్నివేశాన్ని వాడుకొంటాడు. సీత ఎంత గూఢంగా అడిగిందో, హనుమ అంత నిగూఢంగానూ సమాధానమిస్తాడు.

రాముని విహ్నాలు అంటూ హనుమ కావించిన సర్మభాషణం రామతత్వాన్ని అవగాహించిన తన అంతరాంగానికి అద్దం పట్టేది. వేరెవరికీ తెలియరాదు. తమకి మాత్రమే అర్థమయ్యే ఆ సంభాషణం హనుమ ఆర్జవాన్నేకాదు, అతని వాగ్విలసనాన్నీ ప్రస్ఫుటంగా ప్రకటిస్తుంది. రహస్య గోపన విద్య రాజనీతిజ్ఞులకు వెన్నతో పెట్టినది. విదేహ రాజతనయ సందేహాపనోదనార్థం వేసిన ప్రశ్నకి సుగ్రీవసచివుని సమాధానం అంతగోప్యంగానూ ఉంటుంది. దాంతో, సీతమ్మ హనుమను విశ్వసిస్తుంది.

'రామసుగ్రీవయో రైక్యం దేవ్యేవం సముజాయత' (సుం - 35/52) అంటాడు. అంటే, అంతఃపురస్త్రీల వద్దకు రహస్యంగా రాయబారాలను పంపేంతటి దగ్గరతనం ఏర్పడింది, అని!

ఐక్యం అంటాడు, హనుమ. అంటే - నామరూపాలు లేకపోయినా స్వస్వరూపాలు మారక, భేదింపరాని సమత్వదశలో ఉండటం. ఉదా॥ తుమ్మెదలు ప్రతి పుష్పంనుంచి తేనెను సమీకరిస్తాయి. అవి చేర్చిన తేనెను - ఇది ఈ చెట్టుది అనిగానీ, ఇది ఈ పువ్వునుంచి తెచ్చినది అనిగాని చెప్పలేం కదా! అలాగే, ఉప్పు, జలం కలిపితే ఉప్పునీరు తయారవుతుంది. ఉప్పు యొక్క పరమాణువులు వేరు, జలపరమాణువులు వేరు. కానీ ఉప్పు కరిగి, కలిసిపోయాక భేదాన్ని గమనించం. ఇదీ ఏకం కావడమంటే. అదే ఐక్యమవటం. అలా, వైయక్తికమైన ఘనతను కోల్పోయి, సౌశీల్యంతో కలసిపోయేంతగా మా స్నేహం ఏర్పడింది, అన్న భావాన్ని మనసులో నుంచుకొని - ఐక్యం అన్నమాటతో తమ దగ్గరతనాన్ని చెపుతాడు. ఇది హనుమ మాటల్లోని వైలక్షణ్యం.

రావణవధ వృత్తాంతాన్ని చెప్పవచ్చిన హనుమ వాగ్విలాసాన్ని సీతమ్మ ప్రశంసిస్తుంది. 'నానృగ్వేద వినీతస్య' అన్న రామకృత ప్రశంసకి దీటైనదిది!

అతి లక్షణ సంపన్నం మాధుర్య గుణ భూషితం,
బుధ్యాహ్యష్టాంగయా యుక్తం త్వమేవార్హసి భాషితుమ్.
(116-26)

అత్యంత లక్షణ సంపన్నం - ఆకాంక్ష, యోగ్యత, సన్నిధి - అనే లక్షణాలతో కూడిన వాక్యం. ఎంతసేపు మాటాడినా అపశబ్దం రాకుండటం, శబ్ద సాధుత్వ లక్షణం. దీన్నే రాముడు, నకించిదపశబ్దితం - అంటాడు. మాధుర్యగుణభూషితం- శ్రవణ మాత్రంచేత ఆనందజనకత్వరూప మాధుర్య గుణభూషితం. చెవులలో తేనెవానలు కురిపించేది. ఎదలలో అమృతధారలు వర్షించేది. అంతేకాక అష్టగుణయుక్త ధీయుక్తం[9].

ఇలాంటి మర్యాదాంచిత వాక్కులు, హనుమవి. కనుకనే హనుమ గొప్ప వక్త అయాడు. రావణునికి ఉపదేశించినా, విభీషణ శరణాగతి సందర్భంలో వలీముఖ ప్రముఖులను ప్రత్యాఖ్యానం చేసినా ఆయన మాట ఆమోదయోగ్యం అయింది. శత్రువైనా, మిత్రుడైనా, ప్రభువైనా, రక్ష్యాపేక్షలోనున్నా, ఎవరయినా-- ఆయన మాటను కాదనలేరు. ఇంత రావణాసురుడూ హనుమదుపదేశాన్ని కాదనలేకపోయాడు. కోపంతో మండిపడ్డా ఖండించలేకపోయాడు. కారణం ఆయన మాటలు - అర్థవంతాలు, అవ్యగ్రాలు, సౌష్ఠవోపేతాలు. ఆయన మాటల తీరు, పొందిక, వరుస, ప్రశంసమాటున దాగిన హెచ్చరికా, ఆయన తప్పిదాన్ని చెప్పినట్లూ కాని - చెప్పినట్లూకాని తనం, ధర్మాన్ని పొగడటం, అధర్మాన్ని తెగడటం, తనొక్కడే చాలునని - వారి బలాదుల్ని నిరసించటంలో దౌత్యాన్ని నెరపటంలో హనుమ వాగ్మిత కనవస్తుంది.

విభీషణ శరణాగతి సందర్భంలో - (యుద్ధ - 17-48)

'సంస్కార సంపన్నో హనుమాన[illegible]త్తమః

అంటూ, మహర్షి ప్రత్యేకంగా 'లఘు' అన్నా - వివరంగా ప్రతి వ్యక్తివాదంలో లోపాన్ని ఎత్తి చూపుతూ, తన వినయాన్ని ప్రకటిస్తూ, మీకు వ్యతిరేకంగా చెప్పాలనికాదు, కార్య గౌరవం వల్ల నేనిలా మాటాడుతున్నానంటాడు. 'కస్యనారాధ్యతే చిత్తముద్యతాసేరరేరపి' (కి॥ 4-33) అన్న రాముని మాటకి ఉదాహరణమిది. బుద్ధిమాన్, నీతిమాన్, వాగ్మీ అన్నది రామునికే కాక రామదాసుకీ అన్వయిస్తుంది. ఆయన బుద్ధిమత్తని నీతిమత్తని వాగ్మితలో అన్వయించి చూశాం.

చివరగా చిన్నమాట -

హనుమ ప్రసంగం ఎక్కడ చూచినా ధర్మయుక్తంగానే కనిపిస్తుంది. మధురంతో పాటు తప్పని సరిగా అవితథమూ అయి తీరుతుంది. అయితే ఈ సుమనోజ్ఞవక్త పరిగ్రహించిన భాష ఏది? రామాదులతో సంస్కృతం. రావణునితోనూ సంస్కృతమే. సీతతో మాటాడేటపుడు ఆలోచించాడు, అంటే సంస్కృతం కాక, మరో భాషా వ్యవహారంలో ఉందన్నమాట! నేటి link language, English లాగ నాడు సంస్కృతం ఉపయోగించేవారా?

సామాన్యజన వ్యవహార భాష వేరు, చదువరుల భాష వేరూనా? ప్రాంతీయ భాషలు - రాజభాషా వేరూనా? కిష్కింధలోని వారి భాషవేరు. దధిముఖ వృత్తాంతం దీనికి తార్కాణగా నిలుస్తుంది. సుగ్రీవాదులు సంస్కృతం లోనూ సంభాషించేవారన్న మాట!

మరి లంకలో భాష ఏమిటి? సీతతో తాను మాటాడవలసినపుడు హనుమ సందేహించాడు, కదా! మరి రాక్షసస్త్రీలు ఏ భాషలో మాటాడేవారు? వారి భాషణం సీత కర్థమయినట్లే కనవస్తుంది. దేశీయ భాషలోనైతే సీతకెలా అర్థమవుతుంది? అంటే వారిదీ సంస్కృతమే కావాలి.

శిష్టజన వ్యవహార భాష (పాకృతమా ఇది?), సంస్కృతం, దేశ్యభాష.... మూడూ ఉపయోగంలో ఉన్నట్లు మన మూహించవచ్చు. హనుమ కిష్కింధావాసుల

దేశ్యభాషలోనే మాటాడేట్లైతే సీతకి అది అర్థంకాదు. రాక్షసుల దేశ్యభాష తనకీరాదు, సీతకీరాదు. అందుచేత శిష్ట జనవ్యవహార భాష (దాన్నే మానుషీ మిహ సంస్కృతాం [10] అంటాడు, వాల్మీకి) లేదా ద్విజులు మాటాడే సంస్కృత భాషల్లో దేనిలోనైనా మాటాడాలి. అపుడే సీత అర్థం చేసుకోగల్గుతుంది. కానీ, రావణుడనుకొంటుందేమో! కారణం - అతితనుత్వం, వానరత్వం, మానుషవాక్కు, సంస్కృతం - అన్నీ సందేహాస్పదాలే!

హనుమ మాట అలా ఉంచి, లంకలో పదినెలలున్న సీతమ్మ, రాక్షసీగణం మాటలెలా అర్థం చేసుకొన్నదో ఓ మారు చూదాం. వారి తర్జన భర్జనలు కానీ, సలహాలు కానీ, తిరస్కరించేందుకు ముందు తానర్థం చేసుకోవాలి, కదా! వారి మాటలు సీత కర్థమైనట్లే భాసిస్తుంది. అంటే వారి భాషా, సీత భాషా ఒకటే. ఏమది? ప్రాకృతమో, సంస్కృతమో! ఎక్కడో సుదూర ద్వీపంలో నున్నవారే సంస్కృతం మాటాడితే - అదే భూభాగంలోనున్న కిష్కింధ వారికెందుకురాదు? అంటే-వానరులనో, అన్యజాతీయులనో అనాలి. లంకలోని వారు రాక్షసులైనా ప్రవృత్తి చేతనేగాని, జాత్యా వారు మానవులే. కనుక భాషలో సాజాత్యం ఉంది. అయితే భాషా సామాన్యం స్త్రీ జనానికీ వర్తిస్తుందా? రూపక మర్యాదానురోధంగా అవరోధభామినులకు సైతం సంస్కృతం వ్యాహారసాధనం కాదే. అది కేవలం నాటకీయంగా సర్ది తెరదించుతామా?

కిష్కింధ వారిది ఆరణ్యక దేశ్యమనీ, హనుమకు సంస్కృతం నిర్దుష్టంగా మాటాడటం వచ్చుననీ, నాటి సమాజంలోని శిష్టులంతా సంస్కృతంలోనే వ్యాహార వ్యవహారం నిర్వహించేవారనీ తెలుస్తుంది. కోతి మాటాడటం సందేహాన్నీ ఆశ్చర్యాన్నీ కల్గిస్తుందని, సీత 'అపనమ్మకం'తో అసలు సంభాషించదనీ హనుమ గుంజాటన పడ్డాడా? అయితే భిక్షురూపంలో రామలక్ష్మణుల్ని కలిసి మాటాడినట్లు మానుషరూపంతోనే సీతతోనూ మాటాడవచ్చు కదా! వానరరూపంతోనే ఉంటాడు, భాషావిషయమే సందేహిస్తాడు. [illegible]రూపవిద్యను రాక్షసమాయగా సీత భ్రమపడవచ్చునని బహుశా అందుకు సిద్ధంకాడు.

అధోజ్ఞాపికలు :-

1. కిష్కింధ - 26 సర్గ.

2. కిష్కింధ - 29, 32 సర్గలు.

3. కిష్కింధ - 54 సర్గ.

4. సుందర - 51 సర్గ.

5. సుందర - 1 సర్గ.

6. కిష్కింధ - 3 సర్గ.

7. గీతీ ద్రీఘ్రీ శిరః కంపీ తథాలిఖితపాఠకః,
అనర్థజ్ఞోల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః
నశిరః కంపయే ద్గాత్రం భ్రువౌ చాప్యక్షిణీతథా,
తైలపూర్ణమివాత్మానం తత్తద్వర్ణే ప్రయోజయేత్.

8. శంకితంభీతముద్ఘుష్టం అవ్యక్తమనునాసికం,
కాకు స్వరం శీర్షగతం తథా స్థాన వివర్జితం,
విస్వరం విరసం చైవ విశ్లిష్టం విషమాన్వితం,
వ్యాకులం తాలు భిన్నంచ పాఠదోషాశ్చతుర్దశ.

9. గ్రహణం ధారణంచైవ స్మరణం ప్రతిపాదనం,
ఊహో పోహోర్థ విజ్ఞానం తత్వజ్ఞానంచ ధీగుణాః.

10. సుందర - 30-17.

* * *

# యుద్ధకుశలుడుగా హనుమ

తతో రావణనీతాయాః సీతయాః శత్రుకర్శనః
ఇయేష పదమన్వేష్టుం చారణా చరితే పథి.

ఇది సుందరకాండ ప్రారంభశ్లోకము. ఇదిలుప్తకర్తృకము. కాదు, శత్రుకర్శనుడే కర్త! ఎవడీ శత్రుకర్శనుడు? హనుమ! సీతాన్వేషణములోని శత్రుకర్శనత్వమునుపలక్షించి, తదనుగుణముగ అనేక విఘ్నములను, తదధిగమనంకై హనుమ ఒనర్చిన దుష్కర కర్మలను, తద్ధేతు శత్రుకర్శనము, వీటిలో హనుమ చూపిన కౌశలము - ఈ కౌశలం ధీబల సంవలితము. వీటినన్నిటిని ఇముడ్చుకొన్నదీపదము. వాల్మీకి ఈ పదమును చాలా చమత్కారముగ ప్రయోగించెను. సామాన్యముగ, వీరులను అరివీరభయంకరాది బిరుదులో విశేషణములో చేర్చి చెప్పుట పరిపాటి. అవి సాభిప్రాయములు కావచ్చును, సామాన్యసాంఘిక మర్యాదతో కూడినవి కావచ్చును. ఇక్కడటువంటి విశేషణముగా కాక విశేష్యముగా ప్రయుక్తమగుట గమనార్హము. దీని అర్థము కిష్కింధాప్రత్యాగమన పర్యంత చర్యాపరామర్శకమగుట విశేషము. ఈ సందర్భమున మనము హనుమ యొక్క యుద్ధకౌశలమును, శత్రుకర్శనత్వమును కేవలము సుందరకాండను మాత్రమే గ్రహించి పరిశీలింతము.

హనుమ లంకకు వచ్చిన పనిపూర్తి అయినది. సీతాన్వేషణంకైవచ్చి, సీతను గుర్తించి, ఆమెతో సంభాషించి, తననామె విశ్వసించి అభిజ్ఞానప్రదానం చేయగా కిష్కింధకు తిరిగి వచ్చి రామునకా వృత్తాంత మెరిగించవలసి ఉంది. లంకకు వచ్చిన పని పూర్తి అయినా 'అల్పశేష మిదం కార్యం' అంటాడు. ఏమా కార్యం? అంటే- రాక్షసుల బలమేమిటో తెలిసికోవాలి. యథోక్తకారిగా కంటే, పూర్వకార్యా విరోధంగా కార్యాంతరకారి సమర్థుడంటాడు - హనుమలోని మంత్రి! కిష్కింధా సామ్రాజ్యమహామంత్రి కదా, హనుమ!

(యస్మాదిక్ష్వాకు నాథేన బద్ధంవైరం మహాత్మనా)

ఇందులోని హాస్యాన్ని గమనించాలి. వానరవీరుల శక్తి సామర్థ్యాలు హనుమకు తెలియవా? దాన్నే చెప్తాడు. 'దశనాగబలాఃకేచిత్.....' అని. సీతతో మాత్రం, వానర వీరులలో 'మత్తఃప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవసన్నిధౌ' అంటాడు. ఇది, నాగరకసహజమైన ప్రహ్వతాసూచకమే కాక, యథార్థమూ కావచ్చును-సామాన్య సందర్భాలలో. విశేషావసర మొస్తే హనుమ శక్తి శతగుణితమో సహస్రగుణితమో కావచ్చును. అది వేరే విషయం.

హనుమ, మొత్తం **80,114** మంది రాక్షసుల్ని చంపుతాడు. వారిలో **14** మంది సేనాధినాథులు. వారితో యుద్ధం ఒక క్రీడగా భావించాడు.వారు మరీ విజృంభించినపుడు- జాగు చేయటం బాగనిపించనపుడు తునుమాడాడు. ఆయసపరిఘతో పరిక్రమించే తన యుద్ధపద్ధతి వారికి భయోత్పాతాన్ని కల్గించి ఉంటుంది. మొత్తంపై వానరవీరులందరి యుద్ధపద్ధతి ఇదే అని వారు భయపడి ఉంటారు.

నేలమీద నుంటే, రథంపైనో మరేదో వాహనంపైనో ఉంటే- ఒక తీరులో బాణాద్యస్త్ర శస్త్రప్రహారాదులుంటే ఎదిరించవచ్చు. ఓరిమితో ఎన్నాళ్లైనా యుద్ధంచేయవచ్చు. ఎదర నిల్వక మిన్నెగసి కన్నులు మిరుమిట్లుగొల్పే మెరుపుతీగెల్లా గగన విహారం చేస్తూ ఎప్పుడు, ఎక్కడదూకి, ఎవరిమీద ఎలా విరుచుకుపడి దెబ్బతీస్తాడో తెలియని వానితో ఎలాయుద్ధం చేయాలి? ఎలాగో తికమకపడి ఎదిరిపై విరుచుకు పడి, నేలకరుచుకు పోయారు, రాక్షసవీరులంతా.

సరే, వచ్చిన రాక్షసుల్ని వచ్చినట్లు చంపేశాడు. యుద్ధం చేసినా దాన్ని వినోదంగా పరిగ్రహించాడు. ఇక్కడ వాని యుద్ధాన్ని గమనించాలి. నిరాయుధుడైన హనుమ-సుశిక్షితమైన రాక్షససైన్యం. దుర్గమం-దుర్భేద్యం అయిన తమనగరంలోకి

ఎవడో అనామకుడు ప్రవేశించి నానాబీభత్సాన్ని సృష్టిస్తూంటే-వాళ్ళువిలా రెచ్చిపోయి ఇష్టంవచ్చినట్లు వీరవిహారం చేస్తున్న ఆ ఆహవశూరులు హనుమకు ఆటబొమ్మల్లా అనిపించారు. మరిక లాభం లేదనుకున్నపుడు మాత్రమే వాళ్ళని సంహరిస్తాడు[3].

హనుమ యుద్ధం గమనింపదగ్గది. ఎంత మంది ఎలా విరుచుకుపడ్డా లెక్కచెయ్యక- నిరాయుధుణ్ణి, ఒంటరిని, నూత్నప్రదేశం అనే సంశయం లేకుండా వారిని ఆహ్వానిస్తాడు. ఒకరకంగా హనుమ యుద్ధసన్నద్ధుడై ఉన్నాడు. రాక్షసులకు హఠాదాపతిత మీ ఆపద. మూకుమ్మడిగా వచ్చి కింకరులు హనుమపై పడ్డారు. వారినందరినీ హనుమ ఏం ఉపేక్షించకుండా సంహరించాడు. కొందరెలాగో తప్పించుకొని పోయి యాతుధానాధినాథునకు నివేదిస్తారు. ఆతడు క్రుద్ధుడై ప్రహస్తసుతుడైన జంబుమాలిని పంపుతాడు. ఈ యోధుడు రాసభయుతరథంపై ఎక్కి హనుమపైకి వస్తాడు. హనుమ, వాడు బాణప్రయోగం చేసే వరకు ఊరుకొని, వాని విజృంభణాన్ని చూసి-ఒకపెద్దబండని వానిపైకి విసిరి చంపుతాడు. అపుడు సప్తమంత్రి సుతుల్ని పంపుతాడు, రాక్షసరాజు వారు మహాబలవంతులైన సైనికులతో హనుమపైకి యుద్ధానికి వస్తారు. ధనుర్ధారులైన వారితో హనుమ యుద్ధం చేయలేదు-క్రీడించెనట! ఘోరంగా శబ్దాన్ని చేస్తూ, సైన్యాన్ని బెదరగొట్టి చెదరగొడుతూ పరిక్రమిస్తాడు. అరచేతితో కొందర్ని చంపుతూ, పాదాలతో కొందర్ని కుమ్మి చంపుతూ, ముష్టిఘాతాలతో కొందర్ని సంహరిస్తూ, నఖవిదారణం చేస్తూ, గుండెతో ఢీకొంటూ, తొడలతో తొక్కివేస్తూ నానాబీభత్సం చేస్తాడు. ఆ ఆహవంలో హనుమ చేసిన సింహనాదాలకి గుండెపగిలి చచ్చిన రాక్షసవీరులూ లేక పోలేదు. రాక్షసులు బెదరి పారిపోతున్నా హనుమ యుయుత్సతో ఎదురుచూస్తున్నాడు. మంత్రి సుతుల్ని మట్టుబెట్టాడని విని మహారాజు మండిపడి, పంచసేనాగ్రనాయకుల్ని ప్రేరేపించాడు.

హనుమని పట్టి బంధించాలనే గట్టి పట్టుదల గల వారు వీరు. దుర్ధరుడు,

ఓ పద్ధతేంలేదు. ఊహాప్రమాణ్రాను విక్రమణం తికమకలు పెట్టి తిమిరంలోకి నెట్టేసినట్లుంది నా సమరంలో.

ఇంద్రజిత్తుకి పట్టుబడ్డాడు. అదెందుకంటే రావణుణ్ని, రాజసభనీ, సభామర్యాదని పరిశీలించడానికి. అశోకవనంలో రావణుని చూశాడు కదా! అంటే, అప్పుడు పత్రనిలీనమై తాను అతని కంటపడకుండా 'జాగ్రత్తపడటం'తోనే సరిపోయింది. రాజుగా కాక లాలసగలవ్యక్తిగానే అతడప్పుడు గోచరించాడు. పేరోలగంపై ఉండగా ఎలా ప్రవర్తిస్తాడో, శత్రువుతో ఎలా వ్యవహరిస్తాడో గమనించాలి.

హనుమ రాముడితో దౌత్యా (యుద్ధా)నికి రాలేదు. సీతాపదాన్వేషణానికే వచ్చాడు. ఐనా, రావణ సభలో 'దూతోహమితి విజ్ఞాయో రాఘవస్య' అని దూతగా తనని పరిచయం చేసుకుంటాడు. దూతవైతే తిన్నగా రాక, ఉద్యానవిధ్వంసమంతా ఏమిటని అంటారేమోనని ముందుగానే, నీ దర్శనం అలభ్యం కనుక- ఇంత చేస్తేనేగానీ దొరకదు కనుక చేశానంటాడు. మరి వాళ్ళనెందుకు చంపావు? అంటే- ఆత్మ సంరక్షణార్థం! ఇలా ముందుగానే తన పనులను సమర్థించుకొని, 'హితోపదేశం' ప్రారంభిస్తాడు. రాక్షసులెవరికీ విశ్వాసం కుదరలేదు. నానావిధాలుగా ఊహిస్తారు. నిజమే, మరి! ఇవన్నీ రావణదిదృక్షతో చేసినవంటే ఎవరునమ్ముతారు? 'కొట్టండి, చంపండి' అంటారు. వినీతుడైన విభీషణుడు దూతవధ దూష్యమని నీతిబాహ్యమని అంటాడు. దాంతో లాంగూలదహనము విధిస్తాడు, రాక్షసరాజు.

ఐనా, హనుమ చెక్కు చెదరలేదు. 'న మేస్తి మనసః శ్రమః' అంటాడు. వీటన్నిటినీ భరిస్తానంటాడు[4]. లాంగూలాగ్నికి సంతర్పణం చేయటం న్యాయం. ఎలా? అంటే, పురదహనం ద్వారా. భర్మమయప్రాసాదాలన్నీ భస్మరాశులయ్యాయి. విభూతి విబూదిగా పరిణమించింది. ఒక్క విభీషణునిగృహం తప్ప-- అన్నీ అంటించేశాడు హనుమ. ఎందుకిది? దీంతో రాక్షసులు రెచ్చిపోతారే! సీత వారి

అధీనంలో ఉంది. ఆమెకేదేనా అపకారం తలపెడితే? అసలా ఊహేలేదు ''అయ్యో! నగరమంతా కాల్చేశానే, సీతమ్మ ఎలాగుందో?'' అని ఈయన , 'శీతోభవ హనూమత:' అని ఆవిడా పరస్పరం ఒకరి క్షేమంకొరకు ఒకరు పరితపించారే తప్ప-సీత యొక్క ఉనికి , భద్రత-మనుగడ-వీటి గురించి చింతిచ రసలు.

మండిమసవబోతున్న లంకను చూసి అవిమృశ్యకారిత్వం ఎంతటి అనర్థాన్ని తెస్తుందో, సిద్ధకార్యం ఎలా పరిణమిస్తుందో, - దాని పర్యవసానమేమిటో... ఇది కాక, సీతాక్షేమాన్ని వర్తమాన కోణంలోంచే చూస్తాడు, హనుమ. తాను లంకను దాటిన తరువాత, మళ్ళీరావణాదులతో కలసి దాడికి వచ్చేవరకూ-ఈ ఉపహతులనడుమ ఆఅపహృత ఎలా ఉంటుందో, ఏమీ ఆలోచించడు. అంత ధైర్యం వారికుండదని, హనుమ ధైర్యం కావచ్చు. ఇంతైన తరువాత కూడా సీత జోలికి పోగల గుండె చేవ వారికుంటుందా అని! సీత మూలంగానే వనభంజనాదికం జరిగిందని రాక్షస స్త్రీలు తర్జన భర్జనలు చేసినా, ఏతన్మూలకంగానే ఈ అనర్థమంతా వాటిల్లిందని నిశ్చితంగా తెలిసినా ఆమె నేమనటానికీ సాహసించలేదు[5]. సీత కూడా వారి మధ్య తను మనగలనా అన్నయోచన చేయదు. ప్రియాగమనాత్కంచిదూనమైన కాంతోదంత్ర శ్రవణ జనిత హర్షంతో పులకితయైన ఆమె రామాగమన నిరీక్షణలో మునిగి - మిగతా ప్రపంచాన్ని లెక్క చేయలేదు.

ఈ లంకాదహన ప్రయోజనం [6] - దుర్గనిర్మాణం - శృంగాటకాలు - పురవీధులు - భవనాలు - వీటన్నిటినీ [illegible] అభిమాన వ్యధా ఉన్నది, లేదనలేం.

వందయోజనాల సముద్రాన్ని ఎందరు [illegible]? సేతు నిర్మాణ దృష్టి అప్పటికి లేదు కదా! కేవలం - ప్లవనం. ఎందరు రాగలరు, అలా! వచ్చిన తర్వాత యుద్ధం చేయగలరా? పరిశ్రాంతులెలా పరిక్రమిస్తారు? యుద్ధం చేయాలంటే, సజాతీయులైతే యుద్ధ పద్ధతుల్లోనూ సాజాత్యం ఉంటుంది.

యుద్ధ రీతి - నీతు లేమిటి? మొదలయిన సూక్ష్మాంశాలతో సహా పరిశీలించాలి. దానికే ఇంత తతంగం. అనన్వయానికి ప్రబలోదాహరణం అయిన రామరావణ సంగ్రామానికి పూర్వరంగమేర్పరచి మరీ చూస్తాడు, హనుమలోని యుద్ధవీరుడు. హనుమ యొక్క యుద్ధకౌశలమంటే కేవలం యుద్ధంలో నైపుణ్యంకాక - మహా యుద్ధానికి ప్రాతిపదిక నేర్పరచడంలో, వ్యూహరచనకనువైన ఆనుపాన్లని గమనించడంలో [7], శత్రుజాతి అంతటిలోని బల-బలహీన లక్షణాల్ని, ఒడుపుల్నీ ఒడిసి పట్టడంలో హనుమలోని మంత్రి సేనాధిప వీర త్రితయం గోచరమౌతుంది.

ఒక రకంగా చెప్పాలంటే, వాల్మీకి - యుద్ధకాండకి ఉపాధిగా సుందరకాండలోని ఈ హనుమద్యుద్ధ ఘట్టాన్ని ఏర్పరచినట్లు తెలుస్తుంది. అందుకే సుందరకాండ కెంతో ప్రాముఖ్యం. హనుమ యొక్క ఈ విస్ఫురణం సీతారాములకెంతో స్ఫూర్తి నిచ్చింది. రామరావణ యుద్ధాన్కి పునాది వేసింది. లేకుంటే యుద్ధం అగమ్యగోచరమై ఉండేది; విభీషణుడు ప్రక్కనున్నా.

హనుమను సీతావృత్తాంత కోవిదునిగా ప్రశంసించినా, చూచి రమ్మంటే కాల్చుకు వచ్చాడని అభిశంసించినా - పూర్వకార్యావిరోధంగా కార్యాంతర కర్తృత్వంలోనే ప్రజ్ఞద్యోతక మవుతుంది. సీతా పదాన్వేషణం జరిగినా, ఆమె నా చోటినుంచి మార్చకుండా, ఆమెకే అపకారం తలపెట్టకుండా ఉండాలి కాదా, - రాక్షసులు! ఇప్పుడది బహిరంగ రహస్యం కనుక సీతా విషయంలో భయమక్కరలేదు. యుద్ధం చేసిగానీ సీతను తీసుకురావటం కుదరదు. యుద్ధం చేయాలంటే కొన్ని విశేషాల్ని సేకరించాలి. యుథోక్తకారిగా కంటే యథోచితకారిగా ఉంటే తప్ప ఇవన్నీ కుదరవు.

నగరాన్ని శోధించి, రాక్షసుల్ని బాధించి, లంకను దహించి, మిగిలిన రాక్షసుల్ని భయోన్మత్తుల్ని చేసి [8] - మరీ వచ్చాడు యుద్ధనీతి విశారదుడైన హనుమ.



అధోజ్ఞాపికలు :-

1. శేషం సప్తతిసాహస్రం - దీన్ని చాలామంది అనుష్టుబ్బులు 8000 అని తనిగించారు. ఎనుబది వేల శ్లోకముల నెక్కుడు శౌర్యము గల్గువారలన్ - అని భాస్కర రామాయణం.

2. రాముడి కీదుర్వార్త వినిపించడానికై కొందర్ని ఆతడే వదిలేశాడో, మరివారే పారిపోయారో!

3. మూడు - సుందర - 43-23-23.

4. న ఖల్వయం నాభిభవేదవేక్షితః పరాక్రమో హ్యస్య రణే వివర్ధతః, ప్రమాపణం త్వేవ మమాద్య రోచతే నవర్ధమానోగ్నిరుపేక్షితుం క్షమః. (47-28).

5. ఇంకా ఓ చిన్న పనిమిగిలిపోయింది, అంటాడు. 'కింనుఖల్వవశిష్టంమే కర్తవ్యమిహ సాంప్రతం, యదేషాం రక్షసాం భూయః సంతాప జననం భవేత్' (సుం-54-2).

6. సీతవల్ల రాక్షసుల భయద ప్రవర్తన సుందరకాండలోనే - యుద్ధకాండలో కన్పించదు.

7. 'లంకాచారయితవ్యా వైపున రేవభవేదితి,
రాత్రౌ నహిసుదృష్టామే దుర్గకర్మ విధానతః,
అవశ్యమేవ ద్రష్టవ్యా మయాలంకా నిశాక్షయే' ..
(సుం॥ 53-14-15).

8. 'భూయః సంతాపజననం భవేత్' - రాక్షసులకు భయదుఃఖాల్ని కల్గించటమే తనలక్ష్యమన్నట్లు చాటి చెప్తాడు, ప్రవర్తిస్తాడు.

* * *

# యుగళో పాసకుడుగా హనుమ

లోకంలో 'ఒకరి కోసం ఒకరు పుట్టారా!' అన్నట్టు ఉండే జంటలు అపురూపంగా ఉంటాయి. కొన్ని జంటల్ని చూసి మురిసిపోవటం, మరికొన్ని జంటల్ని చూసి ముక్కువిరవటం మామూలే! అందమైన జంటను చూసి - 'Made for each other' అని ప్రశంసించటం, తద్విపరీతమైతే 'కాకి ముక్కుకి దొండపండు' అని అభిశంసించటం, లోకం తీరు. ఇది బాహ్య సౌందర్యాపేక్షతోనే. అలాంటపుడు - ఘటన అనీ, విధి అనీ సరిపెట్టుకోవటం రివాజు. ఓ వధువుకి ఓ వరుణ్ణి ఎంపిక చేయటంలో ఎన్ని నియమాలు! వరహీనం పనికిరాదు. వధువైతే రూప ప్రాధాన్యం. గుణం, శీలం, కులం..... ఇలా ఎన్నోవస్తాయి. ఒక్కో దగ్గర ఒక్కొకటి ప్రాధాన్యాన్ని సంతరించుకుంటాయి. కిముత సమవాయః? కానీ, అది అరుదు.

ఐతే, ఇందులో వైయక్తికమైన అభిప్రాయాలు, అభిరుచులూ ఉంటాయి. దీన్ని సామాన్యీకరిస్తూ (generalise చేస్తూ) లోకస్వభావాన్నిలా ఉదహరించాడు మల్లినాధుడు -

> ''కన్యావరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్,
> బాంధవాః కులమిచ్ఛంతి మృష్టాన్న మితరేజనాః''.

మనసుదోచుకొనే అందాని కాశపడుతుంది, కన్య. కూతురు, కలవారి కోడలు కావాలను కొంటుంది, తల్లి. చదువు సంధ్యలుండాలంటాడు, తండ్రి. కులసాంకర్యాన్నంగీకరించరు, బంధువులు. మిగిలిన వారు - వివాహ భోజనంబు- వింతైన వంటకంబు' అంటూ మృష్టాన్న సంతుష్టులయే ఇష్టజనులు - ఇది లోకంతీరు.

ఇక పెళ్ళి చేయడానికి - రెండు మనసులు కలిపి, వారి బతుకుల నతకడానికి- ఎంతగా ఆలోచించాలి? పూర్వాపరాలు, గోత్రప్రవరలు, ఆర్షేయ

పౌరుషములు, [illegible] ... [illegible], సాధించాలి. ముడిపడిన జంట ముచ్చటగా ఉండాలి! ముగ్ధ మనోహరంగా మురువు మీరాలి!

అయితే, ఒకరి కోసం ఒకరు పుట్టారనే లోకోత్తర ప్రణయమూర్తులు ఎందరుంటారు? అలాంటి సన్నివేశాన్ని ఓ పార్వతిలోనో, ఓ రుక్మిణిలోనో చూస్తాం. వారి పరితాపం ఎంతటి పరిపాకాన్ని పొంది పరిణయంగా పరిణమించిందో?

లక్ష్మీనారాయణులకు, సీతారాములకు వివాహ పూర్వావస్థ స్వల్పం. 'దారాః పితృకృతా ఇతి' రాముడాదరించినట్లే, 'వత్సేమాగావిషాద' మిత్యాది సాగరుని హెచ్చరికలవల్ల లక్ష్మి, నారాయణుని వరించింది. వీర్యశుల్కంగా ఆమె ఉపలబ్ధమైతే, వీక్షణ మాత్రం చేత అనురూపమైన భర్త నారాయణుడని గ్రహించినది, రమ. ఆది దంపతుల మాటలా ఉంచి, క్రమ కల్యాణమూర్తులు సీతారాముల దాంపత్యాన్నాలోకిస్తే - ఎంత సౌందర్యాలోకం లోకంలో! ఆణిముత్యాల్లాంటి ఆదర్శదంపతులు. పెండ్లైనాక వారి అనుభవ సర్వస్వాన్నీ భాసింపచేస్తాడు, వాల్మీకి. ఆ జంట అందచందాలు, ఆనందానుభవాలు, సుఖసంతోషాలు, విందు వినోదాలు, ముద్దు మురిపాలు, ముచ్చటలు - అచ్చటలు- అన్నీ గుప్చిప్. వాల్మీకి వాగమృతకూపనిపానలక్ష్మి సౌరభ్య నిర్భరమై గుప్పుమన్నది, మురారిలో!

విరహవ్యథా విదూయమాన మనసులైనా వారి యందు పరస్పరం తరగని ఆదరాన్ని అభిమానాన్ని, ఆప్యాయనాన్ని, అనురాగాన్ని, గౌరవాన్ని, అనుభూతి పరంపరల్లో, అనుభావం పొరల పొరల్లో, ఆవిష్కృతమవడం చూసి, హనుమ ఆ పుణ్యదంపతుల దాంపత్య సౌందర్యాన్ని ఆస్వాదిస్తాడు. వారి ఆనురూప్యానికి ఆనందభరితుడై, వారి ఎడబాటుకి పరితపిస్తాడు. అస్ఖలిత బ్రహ్మచారి, విషయ వాసనా విధురుడు, ప్రమదా మధ్యంలో పరిమార్గణానికి పరితపించేంత శౌచం

కలవాడు, విశుద్ధవర్తనుడు, అలాంటివాడు స్త్రీ పురుష సంబంధాలని, వైవాహిక వ్యవస్థోపాధియైన విషయాన్ని వివేచించడం విడ్డూరమే! ఐనా, మనీషి శిరోమణి అయిన అతని ధీనైశిత్యానికి కాక, హృదయ నైర్మల్యానికీ - సీతా రాములపట్ల అతనికిగల భక్తి ప్రపత్తులకీ దీన్ని తార్కాణగా గ్రహించాలి. అంతేకాదు, సీతారాముల విచిత్ర దాంపత్యం ఎంత విలక్షణమైన ప్రభావాన్ని నెరపి, తన ప్రాభవాన్ని నిల్పుకొన్నదో గమనించాలి.

ఇంతా అంతా అందమా, రామునిది! పుంసాం మోహనరూపుడు. నియతేంద్రియులు సైతం నిసర్గ సౌందర్యానికి నితాంతమాకర్షింపబడ్డారు.

రూప సంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతాం,
దదృశు ర్విస్మితాకారా రామస్య వనచారిణః!

"అమ్మహే! దళన్నీలోత్పల శ్యామల స్నిగ్ధ మసృణశోభమాన మాంసలేన దేహ సౌభాగ్యేన విస్మయస్తిమితి తాతదృశ్యమాన సౌమ్య సుందరశ్రీః అనాదర ఖండిత శంకరశరాసనః శిఖండక ముగ్ధ ముఖమండలః ఆర్యపుత్రః..." అంటుంది సీత. విస్మయస్తిమిత తాతదృశ్యమాన' అంటుంది, ఆశ్చర్యంతో! పేరు మోసిన, బారెడేసి మీసాలుగల రాజన్యులు సైతం ఎత్తరాని ధనువు నవలీలగా ఎక్కుబెట్టిన ముగ్ధ మనోహర సౌంద... చూసి, విస్మయస్తిమితం కాక, మరేమిటి? అయితే, ఇది జనకుని మీద... సీత మౌగ్ధ్యం మరుగునున్న మధుర ప్రణయాన్ని పసికట్ట వద్దా? అంతటి అందగాణ్ణి (చుప్పనాతికీ వలపు పుట్టించగల మొ(న)గాడిని) వరించటంలో గొప్పేముంది? రుక్మిణనలేదూ? నా వలననే జన్మించెనే మోహముల్! అని. కారణం,

ధన్యున్ లోకమనోభిరాము గులవిద్యారూపతారుణ్య సౌ
జన్యశ్రీ బలదాన శౌర్యకరుణా సంశోభితున్ నిన్ను నే
కన్యల్ కోరరు? - అని పెద్ద వరసలో చెప్తుంది.

కోరదే ముని రమాకాంతాలలామంబు? అంటుంది. నిజమే. ఇన్ని గుణాలు, ఇంత సౌందర్యం, సౌజన్యం, సౌమనస్యం, సౌశీల్యం, సౌహార్దం..... ఇవన్నీ పడతి సౌభాగ్యానికి సోపానాలు కావూ? కనుకనే, ఏ కన్యల్ గోరరు? 'అంది. ప్రతికన్యకీ హక్కుంది. తప్పేమన్నా ఉంటే - సతుగుణగణానా మవగుణః!

సీతమట్టుకు తక్కువదా - ఇయం సా ధర్మశీలస్య మైథిలస్య మహాత్మనః
సుతా జనకరాజస్య సీతా భర్తృదృఢవ్రతా.
(సుం॥ 16-15)

అంటాడు, హనుమ. ముల్లోకాలూ సీతలోని ఒక కళకు సమానం కావుట! ఔను, మరి - రాముడు ఔదాత్త్యం, ఔదాసీన్యం అతివేలమైంది దేనికి? సీతా సౌహార్దానికి. ఆమె స్పర్శతో అనిర్వాచ్యమైన అనుభూతి, రామునికి! 'వినిశ్చేతుంశక్యోన సుఖమితివా దుఃఖ మితి వా' అంటాడు. అంటే, అది అనుభవైక వేద్యమూ కాదు. సుఖమా? దుఃఖమా? నిద్రా? ప్రబోధమా? విషవిసర్పమా? ఏమిటి? ఏమో! ఈ స్పర్శ పరిమూఢేంద్రియగణమై వికారాన్ని కల్గిస్తోంది. చైతన్యాన్ని ఊపేస్తోంది. సమున్మీలయతిచ - అంటాడు, భవభూతి. అంతేనా, ఆమె మాటాడితే - 'మధురా మధురాలాపా' అని ఊరకున్నాడు, వాల్మీకి. భవభూతికి వాడినపూలు వికసించాయి. ఇది ప్రకృతి విరుద్ధం. ఎంత అందమైన భావనమిది! లోకోత్తరమహత్తరమైన మూర్తి సాక్షాత్కారానికిది దివ్యమంత్రం. చూడండి, రసోత్తరమైన ఈ శ్లోకాన్ని.

మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని సన్తర్పణాని సకలేంద్రియ మోహనాని,
ఏతాని తే సువచనాని సరోరుహాక్షి! కర్ణామృతాని మనసశ్చరసాయనాని
(1-29)

అతిశయితమైన అనురాగానికి అద్దం పట్టాడు, అద్భుతంగా. అంత అద్భుతం మన అంతరంగాల కద్దుతాడు. ఇంకా ఎత్తులకు తీసికొనిపోతాడు, సౌందర్య శిఖరారోహణం చేయిస్తూ... ఇయంగేహే లక్ష్మీః ఇయమమృత

స్త్రీవర్ణనమనగానే ఒళ్ళుమరచి హద్దులుమీరే అసహ్యాకర పరిస్థితుల నుండి కవితనో మలుపు త్రిప్పాడు, మహానుభావుడు భవభూతి! ఎంత సమగ్ర సౌందర్య సమున్మీలనం చేస్తాడు? ఎంతటి ఉదాత్తమూర్తిని మరెంత ఉదాररమణీయంగా మలచాడు! ప్రతిభా సమున్మేషం పుష్కలంగా పుష్కరంగా వికసించి సౌమనస్య సౌరభ్యాన్ని విరజిమ్మటం గమనిస్తాం. అందాల నావిష్కరించటంలో ఎంత ఆరోగ్యవంతమైన పద్ధతిని ప్రవేశపెట్టాడో, చూడండి మరి!

దేవయజన సంభవ! స్వజన్మానుగ్రహ పవిత్రిత వసుంధర! నిమిజనకవంశ నందిని! రామమయ జీవిత! అరణ్యావాస ప్రియసఖి! ప్రియస్తోకవాదిని! అట్లాంటి ఆమెకోసం కామాతురునివలె రాముడు విలపించటంలో వింతేముంది? దీన్ని అర్థం చేసుకోగల మనస్వి కనుక - హనుమ సీతను చూడటంతోనే - రాముని విరహ విధురజీవితానికి జాలిపడతాడు. వారి అనురూప దాంపత్యాని కాశ్చర్యపడతాడు.

రాముని చూశాడు. ఆ చూడటం సమగ్రంగా - నిశ్చితంగా - బహిరూప సందర్శనం మాత్రమే కాక, అంతర్యాన్నెరిగిన వాడు కనుక - సీతా దర్శన మాత్రం చేత, మనస్సులోనే ఇద్దరినీ బేరీజు వేసుకొని చూసి, సరితూగటంతో- ఏ ఒక్కరూ మరొకరికి తీసిపోరని, ఒకరికొకరు సరిపోతారని, ఒకరిని విడిచి ఒకరు ఉండటం బాధాకరమనీ - తనవంటివారిని సైతం వారి విరహం బాధిస్తోందనీ, వారి నిద్దరినీ కలపాలనీ, ఎడబాటుతో రాముడు అసహ్యావేదన ననుభవించటం ఉచితమేననీ - ఎంతో పరితాపాన్ని వెలిబుచ్చుతాడు. ఎవరిది? హనుమ! వానరం - చాపలానికి ప్రతీక! జడమతి! పెంపుడు జంతువుల (pet animals) జాతిలోకి రాని నీచ ప్రకృతి! అది సైతం అడలి, ఒడలు పులకరించి, కనులు చెమర్చి, కరుణార్ద్ర హృదయంతో పలవించడంతో సీతారాముల దాంపత్యానికి దివ్యాద్భుతదీధితులు హెచ్చినట్లే!

ఆమె కనబడలేదు. జాడ తెలియలేదు. చాలా కాలమైంది. ఐనా రాముడామెను మరవ లేదు. ఆమెను నష్టపోయిన మరుక్షణంలో ఎంత బాధతో ఉన్నాడ్డో అంతబాధతోనూ ఈనాడూ ఉన్నాడు. నిజానికి నానాటికీ కాలం మరపుని తెచ్చి మనసుని మార్చి ఓదార్చి. ఏమార్చి - తిరిగి మామూలు మనిషిని చేస్తుంది. కానీ, సీతోపరోధ వ్యథ గుండెనింకా కోస్తూనే ఉంది. అందుకే అంటాడు, హనుమ - (వాల్మీకి కాదు హనుమే అన్నాడీ మాటల్ని)

ప్రణష్టాపి సతీ యస్య మనసో న ప్రణశ్యతి - (సుం॥ 15-48).

ఇంతకాలం కనబడకున్నా రాముని మనసును వీడని సౌందర్యరాశి, ఈమె! సీతావిరహంతో రాముడెందుకు విలవిల్లాడిపోతున్నాడో అర్థమైంది. ఆ పరితాపాన్ని విశ్లేషిస్తాడు, హనుమ.

'రామః చతుర్భిః పరితప్యతే,

కారుణ్యేన ఆనృశంస్యేన శోకేన మదనేన' అని నాల్గు కారణాల్ని విప్పి చెప్తాడు.

1. కారుణ్యం - అంటే, దయ. ఆమె తన స్త్రీకనుక, ఆమె ప్రణష్ట అయితే దానికి తానామెను రక్షించుకొనలేకపోవుట కారణం. కనుక, ఆయనకది పరిభవహేతువై పరితాపాన్ని కల్గిస్తోంది.

2. ఆనృశంస్యం - ఆశ్రిత సంరక్షణైక స్వభావం. ధనుర్ధారి, జగదేక ధన్వి! ఉత్తమ క్షత్రియకుల సంజాతుడు - ఇంతై ఉండీ కూడా, ఆమె రక్షణలో అప్రమత్తత వహించకపోవటం ఆయనను సిగ్గిల చేస్తోంది.

3. శోకం - తనది ఆమె! తన ఆనందైక నిధానం! ఆత్మార్థభూత ఐన సీత, ప్రణష్టకావటం శోకహేతువు కాదూ?

4. మదనేన చ - ప్రియురాలు కనబడకుండ పోయినదని కామముచే బాధపడుచున్న ఏకపత్నీ వ్రతుడతడు. అంతేకానీ, కామాతురుడై విలపించడం కాదు.

ఇంకా హనుమ మనసు ఆలోచిస్తూంది. ఈమె రూపము, అంగ ప్రత్యంగ సౌష్ఠవము రామునికి తగి ఉంది. అలాగే, రాముని రూపము, అంగ ప్రత్యంగ సౌష్ఠవము ఈమెకు తగి ఉంది. అని, వారి అన్యోన్యాభి రూప్యానుగుణ్యాల్ని ప్రశంసించి, ఆమెను 'అసితేక్షణ' అని - రామునికన్న ఇది ఆమెలోని ప్రత్యేకత అని సంభావించాడు.

అంతేకాదు, హనుమ - అయ్యో! ఈమెను విడిచిపెట్టి రాముడెలా జీవిస్తున్నాడు? అని ఆశ్చర్యచకచ్చకితుడై, వారి అన్యోన్యానురాగానికి హారతులెత్తుతాడు. అంతేకాదు, తన తొందరపాటుతనానికి కించిన్న్యూనతతో ఆనాటి సంఘటన మనసులో భావించి, ఆనాటి తన పరిహాసకృత్యానికి పరితపిస్తూ, ఆమె వైలక్షణ్యాతిశయాన్ని దర్శించినంతనే విజ్ఞుడు, విశేషజ్ఞుడూ అయిన హనుమ -

దుష్కరం కృతవాన్ రామో హీనో యదనయా ప్రభుః,
ధారయత్యాత్మనో దేహం న శోకేనావసీదతి. (సుం॥ 15-23)

దుష్కరం కృతవాన్ రామో య ఇమాం మత్తకాశినీం,
సీతాం వినా మహాబాహుః ముహూర్తమపి జీవతి. (54)

అంటాడు. అంటే ఒకరి మనసు మరొకరియందు ప్రతిష్ఠితం కావటం వల్లనే 'ముహూర్త' మైనా జీవించి ఉన్నారు. అన్యోన్యమనో నివేశనాభావం కనక ఐతే క్షణం కూడా జీవించి ఉండలేరు - అని వారి జీవన రహస్యాన్ని గుర్తిస్తాడు.

అశోకవనంలో - మలిన సంవీతత్వ, ఉపవాస కృశత్వ, శోకధ్యాన పరాయణత్వాది పతివ్రతా ధర్మయుక్త అయిన 'సీతను చూసి, రాముణ్ణే

మనస్సులో తలచుకొని – 'పునః ప్రాప్త్యుపయుక్త పతివ్రతా ధర్మ నిష్ఠత్వ దర్శనాత్ భాగ్యోత్తరో రామః' అని ఆయన్ని ప్రశంసిస్తూ, ఇంతటి సౌందర్యవతి అయిన సీతను కోల్పోయి రాముడు విలపించడంలో అనౌచిత్యమేం లేదంటాడు.

సీత శీల సౌందర్యాలను ప్రశంసించీ, రాముణ్ణి తలచుకొని దుఃఖాన్ని పొందుతాడు, ఈమె నెడబాసి ఆయనెంతగా కుమిలిపోతున్నాడో నని! తరువాత, సీతారాముల అనురూపాన్ని ఇలా భావిస్తాడు –

తుల్యశీల వయో వృత్తాం తుల్యాభిజన లక్షణామ్,
రాఘవోర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా.
(సుం॥ 16–15)

వధూవరులకు – 1) శీలము, 2) వయసు, 3) వృత్తము, 4) అభిజనము, 5) లక్షణము – ఇవి తుల్యమై ఉండాలి.

**శీలము** :– అనగా స్వభావము, 'అస్యాదేవ్యామనస్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్' అన్న దాన్నిబట్టి తుల్య స్వభావము అవగతమవుతుంది.

**తుల్యవయస్కత** :– షోడష వార్షికస్య ద్వాదశ వార్షికీ తుల్యా, అన్యథా వైరస్యాపత్తేః శాస్త్రవిరోధాచ్చ' – అని చెప్పినందువల్ల, వయస్తారతమ్యాన్ని బట్టి అనురూప్యం విశదమవుతోంది.

**తుల్యవృత్తము** :– నడవడిక – ఒకరికొరకొకరు పరితపించడం, ఒకరి కొరకొకరు జీవించడం మాత్రమే కాదు –

'దోషో యద్యపి తస్య స్యాత్ సతామేత దగర్హితమ్' అని, ఆర్ద్రాపరాధుల్ని సైతం దయార్ద్రాంతఃకరణంతో క్షమించడం – ఇది రామవృత్తం! (యుద్ధ – 18–3).

పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ!
కార్యం కరుణ మార్యేణ నకశ్చి న్నాపరాధ్యతి?
(యుద్ధ - 116-44)

అన్నది సీత. ఎవరిని క్షమించటం? తాను జీవించి ఉండగా, ఒంటరిగా శత్రుస్థావరంలో దిక్కుతోచక విలపిస్తూ ఉండగా, స్త్రీలయి ఉండీ, "కోసుకు తినేద్దాం, వాటాలు జాగ్రత్తగా వేయండి. తరువాత తగవుపడటం నాకిష్టం కాదు" అని, పంచుకుతినేయడాన్కి, నంజుకు తినేయడాన్కి సిద్ధమైన రాక్షసీగణం పట్ల కరుణచూపమన్న దయామూర్తి! ఇది సీతావృత్తం! తుల్యశబ్దం అనురూపపరం. రామానురూప శీల వయశ్చారిత్ర సీత అని అర్థం.

**తుల్యాభిజనం** :- అభిజనమంటే కులం. ఒకరిది ఇక్ష్వాకు కులం! వేరొకరిది విదేహ రాజవంశం!

**లక్షణం** :- అనగా సాముద్రిక సార్వభౌమ లక్షణములు గల వరునికి ఏ లక్షణములు గలది భార్యకాదగునని శాస్త్రం చెబుతోందో ఆ లక్షణాలన్నీ సమానంగా, సమగ్రంగా ఉన్నది - అని, ఉభయుల అనురూపాన్నీ ఆవిష్కరిస్తాడు. వ్యాఖ్యాత లింతగా ఉపలక్షిస్తారు - శ్లోక గర్భ నిర్భర సౌందర్యాన్ని.

హనుమ అంటాడు - "ఆయన ఈమెకు తగినవాడు. ఈమె ఆయనకు తగినది" ...కిలా విడిగా - 'రాఘవోర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా' ... అంటే - లోకంలో సౌందర్యాది సర్వ సమగ్ర గుణోపేతమైన వధువు లభించటం కష్టం. అలాగే వధువుకు వరుడూను! కానీ, ఇక్కడ సర్వవిధ సంపన్నమైన ఈ సన్నివేశం విస్మయానందకరం!

'అసితేక్షణ' అన్న అధిక విశేషణం వల్ల రామ సౌందర్యాపేక్షయా సీతానేత్ర సౌందర్యాధిక్యాన్ని స్పష్టంగా, కంఠోక్తిగా చెప్పి, కట్టెదుట కన్పింపజేస్తాడు.

మళ్ళీ రాముడు గుర్తుకు వస్తాడు, హనుమకు - ఎదరనున్న సీతను చూస్తూంటే, మనస్సులో రాముడు మెదలడమేమిటి? అంటే - సీతారాములది ఎంత దృఢమైన బంధమో ఆలోచించాలి. దాన్నెంత స్పష్టంగా చదవగలిగాడు, హనుమ!

ఆమె కోసం, నిజంగా, 'అస్యాహేతోః' ఎన్ని పనులు? ఎంత దుష్కరాలైన పనులు సమారబ్ధాలో - ఆ క్షణంలోనే లెక్కకడతాడు. ఆమె కోసం ఏం చేసినా తక్కువే అంటాడు. ఆమె జీవించి ఉండటానికి కారణం రామ సందర్శనేచ్ఛ! రామ సమాగమకాంక్ష! భోగాలు వదలి, బంధుజనులు లేక, కుక్కలు చుట్టుముట్టిన లేడిలా, ఇంకా వారి తర్జన భర్త్సనల్ని భరిస్తూ జీవిస్తూందంటే - 'సహతే యాతనా మేతా మనర్థానా మభాగినీ!'

ఇంతటి పవిత్ర చారిత్రంగల తల్లిని రాముడు తప్పక చూడాలి అన్న నిశ్చయానికి వచ్చాడు, హనుమ. 'ఆ నయిష్యామి వా లంకాం' ఇత్యాది ప్రతిజ్ఞా నిర్వహణాన్కి ఉపష్టంభకం, ఉత్ప్రేరకం కావచ్చు బహుశః, ఈ సన్నివేశం - 'ఇమాం శీల సంపన్నాం ద్రష్టు మ్మర్హతి రాఘవః'.

వీరి మధ్య ఇక్కట్లు పడుతున్నా నిజానికామె ఇక్కడున్నట్లు లేదు.

నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్ పుష్పఫలద్రుమాన్,
ఏకస్థ హృదయా నూనం రామ మేవానుపశ్యతి, అంటాడు

ఏకాగ్రచిత్తంతో రాముణ్ణే ధ్యానిస్తూ - రామాగమన సంభావనంతో సర్వ దిశల నవలోకిస్తూందని భావం. లేదూ, నిరంతర రామానుభావనం చేత

పరిసర పదార్థాలన్నీ రామమయమైనాయని [1]. అంటే, రాక్షసులు, చెట్లు, పళ్ళు మొదలైన చరాచరవస్తుజాత మంతా రామునిలాగే కనవస్తున్నదని భావం.

స్త్రీలకు భూషలంటే ఇష్టం. నిజమే, భూషణాలతో వారు ప్రకాశిస్తారు. ఆ భూషణాల్లో ప్రశస్తమైన ఆభరణం భర్త! అంటే భర్త భర్మ రుచిరభవ్యభూషణమే! కానీ, సీత – ఆ అలంకారం లేక శోభించటం లేదు – అని వాపోతాడు హనుమ. ఎంత సౌందర్య దృష్టి! ఈ అందానికి దీటైన అందం అదిగో అక్కడుంది. ఈ రెంటినీ దగ్గర పెట్టి చూస్తే కనుల కల్మికి సాఫల్యం! ఎంత మానవతో ఈ వానర శ్రేష్ఠునిలో! 'దుష్కరం కురుతే రామః' అంటాడు, మళ్ళా.

అసితకేశాంత, శత పత్రనిభేక్షణ, సుఖార్హ అయిన సీత దురంత దుఃఖనిమగ్న కావటం చూచి, శాఖామృగమైన నాకే వ్యధ కలిగితే, దయావ్యయ పయోనిధి దాశరథిని గూర్చి చెప్పేదేముంది? అంటాడు. ఈ విశేషణాల సార్థక్యాన్ని నిరూపిస్తూ, స్త్రీజన సామాన్య పార్థక్యాన్ని విశ్లేషిస్తున్నారు, . వ్యాఖ్యాతలు –

స్త్రీణాం కేశానా మగ్రే నైల్యం దుర్లభం. కానీ ఈమె అసితకేశాంత అంటే దీనివలన ఈమె లోకాతిశాయి సౌందర్యం విశదమవుతోంది.

శత పత్రనిభేక్షణ – కమలపత్రాక్షస్యాపి వ్యామోహదాయినీ, అంటారు.

సుఖార్హ – నిజమే. రామోత్సంగే స్థాతుమర్హా! రాక్షసీమధ్యంలో కాదు.

దుఃఖిత – రాక్షసీమధ్యంలో ఉండటమే. హనుమే కాదు, వ్యాఖ్యాతలూ ఎంత పరితపించారో చూడండి. సీతమ్మ, వారిచేతకష్టాలపాలు అవడం కాదు – అసలు, వారి మధ్యలో ఉండటమే దుఃఖమట!

మమాపి - శోక హర్షయో రపదస్య, అంటారు. ఇది జాతి నిష్ఠమైన జడత నుద్దేశించి అన్నమాట. కానీ, వ్యక్తినిష్ఠం కాదు. అందం, ఆనందం హనుమ ఎరుగ డనగలమా?

ఈ విధంగా హనుమ రాముని గూర్చి, సీతను గూర్చి పెక్కుభంగుల ఆలోచించి - ఈమె సీతయే అను నిశ్చయమునకు వచ్చెను. ఇలా నిశ్చయానికి రావడానికి, కేవల వ్యాపేనను అంతరిక్షమున బలాత్కారముగా రావణుడు తీసికొని పోతూండగా చూచిన స్వల్ప వ్యవధానమిప్పుడు ప్రత్యభిజ్ఞోపబలకము కాకపోగా, ఈ అనుమాన ప్రమాణముతో నిశ్చయించినాడు. అనగా - సీతా దర్శనం చేత ఆమె రూప వయశ్శీలాదులను, అనుభావమును గుర్తించి, ఆమె రామమహిషి తప్ప అన్యస్త్రీ కాదని ఎరిగిన మహాజ్ఞాని!

'ఆ యెలనాగ నీకుఁ దగు నంగనకుం దగుదీవు' అన్న అగ్నిద్యోతనుడికి వివాహాత్పూర్వమే రుక్మిణీ కృష్ణుల అనురూప్యమెలా భాసించిందో, అలాగే - వివాహానంతరం ఈ దంపతుల అనురూప్యాన్ని చూచి పొంగిపోయి, విరహకాతరులైన వారిని చూచి క్రుంగిపోయి [2], వారినేకత్ర సంఘటిత పరచటంలో నిమగ్నుడై, సాధిస్తాడు సౌందర్యోపాసకుడైన హనుమ.

కేవలం స్వామినో, కేవలం అమ్మనో మాత్రం సేవిస్తే చాలదు. ఇద్దర్నీ కలిపి సేవించాలనే సంప్రదాయరహస్యాన్నావిష్కరిస్తాడు, కూడా - హనుమ ఈ సన్నివేశంలో.

'జాతా కాంక్షా జనని! యువయో రేకసేవాధి కారే'

అధోజ్ఞాపికలు :-

1. 'రామంభూతం జగదభూత్' (పట్టాభిషేక సర్గ-101) అని, అయోధ్యలో ప్రజకంతా జగమే రామమయమైనపుడు, సీతకు కావడంలో వింతేముంది? రాముని యొక్క సత్త్వం కారణంగా ప్రజలంతా - 'రామోరామో రామ ఇతి' కథలు కథలుగా రామవృత్తాంతాన్ని చెప్పుకుంటున్నారు.

అయితే, అది ఫలాపేక్షయా అని అనవలసి వస్తుంది. ఎందుకంటే - రామే రాజ్యం ప్రశాసతి! ఆయన రాజ్యం చేస్తూంటే - సుసమర్థమైన, సుసమృద్ధమైన ఇక్ష్వాకు ప్రభువుల పాలనలో మనుగడ సాగిస్తున్నామన్న ఆనందంతో, కృతజ్ఞతా పూర్వక రామ నామ స్మరణం. ఆయన తమను చూడాలనో, తాము ఆయనను దర్శించాలనో, జగన్మోహన సౌందర్యదిదృక్షో, ఆయన అనుభావాన్ని అంతరంగాని కద్దుకోవాలనో... ఏదో ఫలాపేక్ష కనవస్తుంది. కానీ, ఇక్కడ రామధ్యానం ఫలానపేక్షంగా. ఆ ధ్యానం ఆ స్మరణం లేక ా జీవించలేదు కనుక. అంటే అదే జీవికగా ఆమె నిల్చి ఉంది.

ఇక్కడ, పెద్దలు తాత్త్వికమైన అర్థ ప్రతిపాదనం చేస్తున్నారు. శోకము లేక బంధము కల్గి ఉండుట. సీత రాక్షసుల బంధములో అశోకమునందున్నది. ఈ అశోకస్థితిని సవికల్ప సమాధిగా చెప్పుచున్నారు. ''ఒకే వస్తువును తలంచుచు, ఇతర వస్తువులను చూడక - అన్ని వేళలందును అంతట ఒకే వస్తువును కాంచుట ఈ దశయందేర్పడును. విషయముల నుండి మనసు వెనుతిరిగి భగవంతునే సర్వత్ర చూచుచు ధ్యానించె ఈ దశలో శోకముండదు. బాహ్యాముగా విడివడి యున్నట్లున్నను ఆంతరముగ

కల సేయుండును. కానీ, బాహ్య సంశ్లేషము నపేక్షించును. అట్టి దశ పొందిన వా కీ భగవత్సంశ్లేషమునకు యోగ్యత కలిగినట్లు భావింపబడును''
(సుందరకాండ - తత్త్వ దీపిక). (శ్రీ భాష్యం అప్పలాచార్యులు)

ఇహ గా మసితకేశాంతాంశతపత్రనిభేక్షణాం,
సు గార్హాం దుఃఖాతాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః
(సుందర - 16-28)



# భక్తుడుగా హనుమ

కవిత్వాన్నిలాగే, భక్తినీ ఇదమిత్థంగా నిర్వచించలేం. కారణం, రెండూ హృదయ ధర్మాలే! అయితే ఆలంకారికులు వివిధ ప్రయత్నాలు చేశారు. ప్రత్యక్షంగానో భంగ్యంతరంగానో కావ్యాల్ని కవిత్వాన్ని నిరూపిస్తూ వచ్చారు. భక్తిని భావమని సంభావించారు. రసం కాలేదని నిరసించారు. రూపగోస్వామి, మధుసూదన సరస్వతులు భక్తిని రసంగా నిరూపించి ప్రతిష్ఠాపించారు.

పెద్దలు కొందరు భక్తి విషయంలో జారీ చేసిన నిర్వచనాల నవలోకిస్తే కొంతవరకూ ఈ పదం అవగతమవుతుంది. అపవర్గ సాధనంగా భక్తి నంగీకరిస్తూ- కర్మాద్యన్యతమాల కంటే ఇదే ప్రకృష్ట మన్నారు, శంకర భగవత్పాదులు - 'మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ, స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే'- అని తమ వివేకచూడామణిలో పదనిరుక్తినీ ప్రసాదించారు [1].

నారద, శాండిల్యాదులు తత్త్వగహనమైన సిద్ధాంత విషయాన్ని సూత్రీకరించారు[2]. సంప్రదాయ ప్రవర్తకులు, ప్రవణులు, ప్రవీణులు, ప్రసక్తాను ప్రసక్తంగా ప్రస్తావిస్తూ ప్రస్తుతించారు. రామాయణ వ్యాఖ్యాత గోవింద రాజులు, 'భక్తిః అధికమాన్య విషయ స్నేహః' అన్నారు. మహనీయ విషయే ప్రీతిర్భక్తిః అన్నది స్తోత్రరత్న భాష్యం. ఏకస్మిన్నేవ నియతః ఏకాంతః అని - దేవతాంతరాలను సేవింపనిచ్చగించని చిత్తవృత్తిని నిరూపించింది. దేవతాంతరాలనే కాదు, ఆ మూర్తివే అయిన ఇతరావతారాలను సైతం ఆదరింప సహింపలేని పరమైకాంత భక్తులున్నారు. 'కృష్ణాత్పరం కి మపిదైవ మహంనజానే' అన్న మధుసూదన సరస్వతి [3], రామునికి తప్ప అన్యదైవతానికి ప్రణమించనిచ్చగించని తులసీదాసు [4], తక్కినవార్ని బక్కదైవతాలుగా ఈసడించే ఉన్నసక భకుడు రామదాసు[5], 'విహాయకోదండ శరౌ' అను లీలాశుకుడూ[6]......

భగవంతుణ్ణి లొంగదీసేది భక్తి. కర్మాదితర సాధనములకంటె విశిష్టమైంది. భాగవతమంతా దీన్నే ఉపాఖ్యానాలనుపపత్తులుగా రమ్యోదాహరణలనిస్తూ నిరూపించింది. వేదాంతులు - తత్రచ - అద్వైతులు దాసోహమన్నది భక్తితత్వానికే!

అద్వైత వీథీ రసికైరుపాస్యాః స్వారాజ్యసింహాసన బద్ధదీక్షాః
తథాపి కేనాపి వయం శఠేన దాసీకృతాః గోపవధూ విటేన [7]!

అంటారు, మధుసూదన సరస్వతులు.

అయితే భక్తుల - కర్మానుష్ఠాన నైష్ఠికతని, జ్ఞానవైరాగ్య వైశద్యాన్ని చూసిలొంగడు, భగవంతుడు.

వ్యాధస్యాచరణం కిం? ధ్రువస్యచ వయః? విద్యా గజేంద్రస్య కా?
కా జాతిర్విదురస్య? యాదవపతే రుగ్రస్య కిం పౌరుషమ్,?
కుబ్జాయాః కమనీయరూప మధికం, కిం తత్ సుదామ్నో ధనం
భక్త్యా తుష్యతి కేవలం. నతు గుణైః, భక్తి ప్రియో మాధవః.

అంతేకాదు - తలలుబద్దలు కొట్టుకొనే వాదవిచికిత్సల్లో మునిగి తేలే అంతర్వాణి వరేణ్యులకు అంతరంగ ప్రశమనం చిక్కేది భక్తి వల్లనే.

యా వ్యాపారవతీ రసాన్రసయితుం కాచిత్కవీనాం నవా
దృష్టి, ర్యా పరినిష్ఠితార్థ విషయోన్మేషాచ వైపశ్చితీ,
తే ద్వే అప్యవలంబ్య విశ్వమనిశం నిర్వర్ణయంతో వయం
శ్రాంతా, నైవతు లబ్ధ మబ్ధిశయన. త్వద్భక్తితుల్యం సుఖమ్ [8].

అని ధ్వని ప్రస్థానాచార్యుడైన ఆనంద వర్ధనాచార్యుని అభిసంధి. మొత్తంపై భక్తి కింత గొప్పతనముంది. భక్తులకింత వైశిష్ట్యముంది.

భక్తుల ఆర్తినిబట్టి, సేవా వైలక్షణ్యాన్ని బట్టీ వైవిధ్యాన్ని నిరూపిస్తూ బహుధా వింగడించారు విజ్ఞులు. వివిదిషతో వివరణలకి పోతే - ఏకవిధభక్తి నుండి - ద్వాత్రింశద్విధ భక్తుల వరకూ వస్తాయి [9]. సిద్ధ - సాధ్య భేద ద్వైవిధ్యం, త్రైగుణ్యాంచిత త్రైవిధ్యం, గీతాప్రోక్త చాతుర్విధ్యం...... పంచవిధ, అష్టవిధ, నవవిధ.... ఏకాదశవిధ..... ఇలా.... వీటిలో నవవిధ భక్తులు - భాగవత ప్రోక్తాలు - ప్రథితాలు.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్ [10].

రామభక్తి సామ్రాజ్యకేతనం రామాయణమలా ఉండగా, భగవద్గుణ నిరూపకంగానే కాక భాగవతజన మాహాత్మ్య ప్రబోధకంగానూ భాగవతం ప్రాచుర్యమందింది. భారతం సాత్త్వత భాగవత తత్త్వాన్ని విశదీకరించింది. భాగవతం వాసుదేవతత్త్వ నిరూపణంకై అవతరించింది. దాంతో భక్తి మార్గం ప్రబలమైంది. భక్తులూ బలపడ్డారు. భాగవతులు అంటేనే భక్తులే! తత్రచ - విష్ణుభక్తులు! దీనికి చరిత్ర, వ్యాకరణం ప్రబలమైన సాక్ష్యాన్ని ఇస్తున్నాయి. దేవతాంతర భజన పరులకి పేరులేదు. అంటే ఆదినుంచీ విష్ణుభక్తి వస్తోంది. అతడు రాముడిగా వచ్చినపుడు రామభక్తులు, కృష్ణుడిగా వచ్చినప్పుడు కృష్ణ భక్తులూ తయారవుతూ వచ్చారు. ఇలా ఇతర మతాలూ వచ్చాయి.

మొత్తంపై భక్తి అంటే భగవంతునిపై మనకుగల ఆత్యంతికమైన ప్రేమ! అని అర్థం. శ్రీ సంప్రదాయం దీన్ని మూడు పర్వాలుగా వింగడించింది, పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులుగా !

దర్శనం పరభక్తిః స్యాత్ పరజ్ఞానం తు సంగమః,
పునర్విశ్లేషభీరుత్వం పరమాభక్తి రుచ్యతే.

సతతం స్వామిని దర్శిస్తూ సేవిస్తూ ఉండాలనే వారే పరమభక్తులు. ఎడబాటు ఎక్కడ ఏర్పడుతుందో అని తల్లడిల్లిపోయేవారు. స్వామి యందు ప్రీత్యతిశయంతో

ఏం కీడు వాటిల్లుతుందోనన్న అనుమానంతో, రక్షలు కట్టి మంగళాశాసనాలు చేసేవారు.

'ప్రేమభక్తు'లని భక్తి సంప్రదాయంలో మరో వింగడింపు ఉంది. చిత్తద్రవీకరణ సమర్థమైన భక్తి, సుకృత విశేషం వల్ల ఉద్భవిస్తుంది. సాధుజన సాంగత్యం, భగవద్గుణాను సంధానాల వల్ల క్రమంగా హృదయంలో ఒక వెంరుపుతీగె వంటి భావం ఉదయిస్తుంది. దీనికే రతి అని పేరు. భగవద్వ్యతిరిక్త విషయాల్ని తృణీకరించి – భగవదేక విషయంగా ఉంటే దీన్ని అప్పుడు – 'ప్రేమ' అంటారు.

ఈ ప్రేమభక్తిని – శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భక్తులుగా విశ్లేషించారు. వీటిలో మధురభక్తి వ్రజాంగనల యందు, ఆళ్వార్లలోనూ కనవస్తుంది. ప్రత్యేకంగానూ, ముఖ్యంగానూ పేర్కొనవలసినవారు, నమ్మాళ్వార్, గోదాదేవి. వాత్సల్య భక్తికి పెరియాళ్వార్, శాంతభక్తికి సనకాదులు, సఖ్యానికి అర్జునుడు, ఉదాహరణంకాగా – దాస్యభక్తికి పరమోదాహరణం హనుమ.

హనుమను, నిరుప పదంగా పేర్కొనరు, తెలుగునాట జనం. భక్త హనుమాన్, వీరభక్త హనుమాన్, రామభక్త హనుమాన్, ప్రసన్నాంజనేయ స్వామి, దాసాంజనేయస్వామి మొ॥వి గమనించవచ్చు. అట్లాంటి భక్తియుక్తుని స్వరూపనిరూపణమే ప్రస్తుతాంశం.

హనుమ రామభక్తునిగా ప్రథీయసి అయిన ప్రథకెక్కినవాడు. ఆయన మొట్టమొదట రాముని చూచినది – ఋశ్యమూక ప్రాంతంలో. సుగ్రీవ సఖ్యంకై వస్తున్న రామలక్ష్మణుల్ని చూసి, దర్శనమాత్రంచేత రామునిలో దివ్యత్వాన్ని అంతశ్చక్షువుతో వీక్షించి, లక్ష్మణానుచరత్వోప లక్షకమైన శేషిశేషత్వ భావమెరగి – సాష్టాం. మెరగినాడు. అంతేనా, మంగళాశాసనం కావించినాడు.

ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః,
సర్వ భూషణ భూషార్హాః కిమర్థం న విభూషితాః (కి॥ 3-14).

శ్రీసంప్రదాయమున మంగళాశాసనమునకున్న మహత్త్వ మింత యంత్త లేనిది. జ్ఞానదశ - ప్రేమదశగా పర్యవసించినపుడు - రక్ష్య రక్షక భావము విపర్యస్తమై - సర్వజగద్రక్షకుడైన భగవంతునిపై మన రక్షణభావమునుంచక, ఆయన కేమి ప్రమాదము వాటిల్లునో అని అస్థానభయశంకతో, ఆతనికి రక్షపెట్టుట మంగళము నాశాసించుట ఇందులోని విశేషము. ఏతత్ప్రస్థానా చార్యులు శ్రీ పెరియాళ్వారు. వారి ప్రబంధము 'తిరుప్పల్లాండు' మంగళాశాసన శిరోమణి. నేటికీ తిరుప్పల్లాండు లేనిదే తిరువారాధనము పూర్తికాదు, గృహములందైనను - దేవ గృహములందైనను. అంతటి మహత్త్వ విశిష్టమిది!

ఇక్కడ హనుమ మంగళాశాసనము కావించినాడు. ఆ తరువాత, ఆయన తన ప్రవృత్తిని బట్టి, ప్రకరణావసరమును బట్టి - తన భక్తి మార్గమును నిర్దేశించుకొన్నాడు.

రాముని స్థితి మనఃక్లేశకరంగా ఉన్నది. ఆయనే అన్నాడు

రాజ్యాద్ భ్రంశో వనేవాసః సీతా నష్టా ద్విజోహతః,
ఈదృశీయం మమాలక్ష్మీః నిర్దహేదపి పావకమ్.
(అరణ్య - 67-25)

అపృథక్సిద్ధ స్వరూపం జగత్పితరులది. సీతమ్మలేని రాముని చూచి ఎంతగానో ఖేదపడినాడు, హనుమ. 'దుష్కరం కురుతే రామః'[11] అని ఎన్ని మార్లో పరితాపాన్ని ప్రకటించాడు. ఆమెను దర్శించాక, ఈమె కోసం రామచంద్రుడు ఏమి చేసినా యుక్తమే అనుకున్నాడు. చాపలానికి, వన్య జంతువుల్లో హైన్యానికీ ప్రతీక అయిన తన - గుండె తరుక్కుపోతూంది, అంటాడు[12]. వారిని ఏకత్ర చేర్చుటకుద్యమించినాడు.

రాముడు, హనుమను మంత్రిగా, రాజకార్య నిర్వహణ సమర్థునిగా, నీతివేత్తగా, పండితునిగా గుర్తించి ప్రశంసించినాడు. తనకు సేవకునిగా ఎప్పుడూ భావించలేదు. కానీ హనుమ తన్ను తాను రామదాసునిగా, దూతగా భావించుకున్నాడు. అట్లే ప్రకటించినాడు.

అభిజ్ఞాన ప్రదానం కూడా, సుగ్రీవుడు, హనుమ కిమ్మన్నందున ఇచ్చాడు. లేదూ, ప్రథమ దర్శన మాత్రాన హనుమపై విశ్వాసము, ఒక దగ్గరతనం ఏర్పడినందువల్ల ఇచ్చాడు. ఇది బైటకి కనవచ్చేది. లోతుగా చూస్తే, హనుమ వల్లనే ఈ కార్యం సానుకూల పరచ దలచినాడు, రామచంద్రుడు. కనుకనే - కాకాసుర వృత్తాంతాన్ని హనుమకే చెప్పాడు. ఎప్పుడు చెప్పేడు? ఎలా చెప్పేడు? సుగ్రీవాదులు లేరా అప్పుడు? మిగతా వానరులకు తెలీదా? హనుమ కొక్కడికే, అంత రహస్యంగా ఎలా చెప్పేడు? అంటే, హనుమ ఈ పనిని సాధించగలడని నమ్మాడు - రాముడు. దక్షిణ దిక్కుకు పంపటంలోనే వాని దక్షత విశదమవుతోంది. హనుమ సీతమ్మతో అనేంతవరకూ కాకాసురుని కథ తెలియదెవరికీ. ఇది వాల్మీకుల శైలి అని దాటేయలేం. రామునెలా హనుమ దైవంగా గుర్తించి ఆరాధించాడో, హనుమనీ రాముడలాగే భక్తునిగా అంగీకరించి, పరిగ్రహించాడు. కనుకనే ఇది సాధ్యమైంది.

సముద్రాన్ని దాటటానికుద్యుక్తుడయినాడు. ఎన్ని మార్లన్నాడో..... రామార్థం.... రాఘువార్థం.... అని! అంటే, ఈ పని తనకోసంకాదు. రాముని కోసం. ఇది భక్తుని లక్షణం: ఏం చేసినా భగవంతుని కోసమని చేయటం. అంటే కర్తృత్వ త్యాగపూర్వకంగా!

భగవంతునికి తానుపకరణం మాత్రమే. ఆయన, ఆయన భక్తుడైన తనచేత, ఆయన కోసమే - ఈ పనిని చేయించుకొంటున్నాడు. అంటే, కర్తృత్వ భోక్తృత్వాలు రెండూ ఆయనవే. ఆసాంతం దృఢాధ్యవసాయంతో, ద్వంద్వాతీతంగా నిర్వహించాడు, హనుమ.

ఆయనే చేయించుకొంటున్నాడు, తానుపకరణం మాత్రమే అన్నది - 'రామార్థం' అనటంలోను, 'రాఘవ నిర్ముక్తః శరః' అని శరోపమ్యాన్ని విధించుకోటం లోనూ అభివ్యక్తమౌతుంది. ద్వంద్వాతీతత - కార్యసాధనలో వచ్చే సుఖ దుఃఖాత్మక విఘ్నాలు రెండూ ఒకేలా స్వీకరిస్తూ - పొంగుక్రుంగులు లేకుండా ముందుకు పోవడం. అయితే, హనుమ అమ్మ అనుగ్రహానికి పాత్రమయ్యాడా? ఆమె సాన్నిధ్యం లేకుంటే స్వామి అనుగ్రహం మాత్రం హనుమపై ప్రసరిస్తుందా? అంటే - అమ్మ అనుగ్రహానికీ అతడు పాత్రమయ్యేడనే చెప్పాలి. ఆమె అనుగ్రహం పొందాకనే ఆమెదర్శనం లభించింది అతనికి. ఇది లక్ష్మీ దేవతానుగ్రహ వైలక్షణ్యం. ముందు ఫలసిద్ధి - తరువాతనే దేవతాదర్శనం. మిగతా దేవతల కంటె విపరీతలక్షణమిది. దీన్ని శ్లేష యమక చక్రవర్తి వేంకటాధ్వరి ఇలా నిరూపిస్తాడు.

'ప్రాగేవస్యాత్ ప్రార్థిత స్యార్థసిద్ధిః పశ్చాదంబ! త్వత్కటాక్షోపలంబః
దృష్టాంతో న స్తత్ర తే దృష్టిపాతాత్ ప్రాగంభోధిం లంఘయన్ పావమానిః[13],

హనుమ అమ్మ కటాక్షానికి పాత్రం కావటం వల్లనే, అపారపారావారాన్ని దాటే శక్తిని పొందాడు. అలా ఆమె అనుగ్రహానికి పాత్రమై, ఆ తరువాత ఆమె దర్శనం చేస్తాడు.

హనుమపై, రాముని కంటె విశిష్టమైన వాత్సల్యాన్ని - సీత కనబరుస్తుంది. లంకాదహన సమయంలో సర్వభక్షకుడు తననేం చేయకపోవటం సీతామాహాత్మ్యం వల్లనే అంటాడు, హనుమ. సీతకూడా, ఏ దేవతనీ - తనను భర్త వద్దకు చేర్చమని - కోరదు కానీ; హనుమ విషయంలో 'శీతోభవ' అని అగ్ని నాదేశించటంలో ఆమె వాత్సల్యం ప్రకటితమవుతుంది[14].

రామరావణ యుద్ధంలో ఎంతగానో సహకరించాడు, హనుమ- యుద్ధ వీరునిగా. వాహనమయ్యాడు, సంజీవని తెచ్చాడు. రామాలింగన

భాగ్యమందాడు. ఇవన్నీ కాక - పట్టాభిషేక సమయంలో, ఉపకరించిన వారందరికీ కృతజ్ఞతా సూచకంగా ఉపహారాలర్పించాడు రాముడు. సీతమ్మ, రామానుజ్ఞతో - హనుమకో హారాన్నిచ్చింది[15]. దీనివల్ల సీతమ్మకు హనుమ పట్లగల వాత్సల్యం అవగతమవుతుంది. అసితేక్షణ అయిన ఆమె ఆకేకరాలు, హనుమపట్ల వాత్సల్య నిర్భరాలై ప్రసరించినందున- ఇంకా ప్రఫుల్లంగా హనుమ ప్రకాశించాడు[16].

ఆయన భక్తిని గూర్చి - సీతమ్మతో స్పర్ధించే రామసేవాభిరతిని గూర్చి - రకరకాల కథలు - దంతకథలు - కింవదంతులు ఉన్నాయి. అవన్నీ అప్రామాణికాలు, అని, కొట్టేయలేం. ఎవరన్నా అవన్నీ - హనుమ ఆంతర్యాన్ని అంతరంగాన్ని ఆవిష్కరించేవి. అయితే రాను రాను అవి జనరంజకాలుగా, అనుదాత్త హాస్య ప్రసంగాలుగా దిగజారటంతో అంతర్వాణి శిఖామణులు వాటి నాదరించి ఔదల దాల్చటంలేదు. వీటికి ఉత్తరదేశంలో ప్రచారమెక్కువ.

దక్షిణాదినా హనుమకు భక్తి సామ్రాజ్య పట్టం కట్టిన దాఖాలాలున్నాయి. 'యత్ర యత్ర రఘునాథకీర్తనం, తత్ర తత్ర కృతమస్తకాంజలిం' అన్న ప్రార్థన శ్లోకం దీన్నే నిరూపిస్తుంది. పారాయణ ప్రవణులైన నైష్ఠిక ప్రవరులు నేటికీ శ్రీరామాయణ పఠనావసరంలో హనుమకగ్రాసనం వేసి ఆదరిస్తారు. ఆయన వచ్చి సన్నిధి చేస్తాడనే విశ్వాసం ప్రబలంగా ఉంది.

ఇప్పటికీ రామకథా గానానందలోలుడై - చిరంజీవిగా - భవిష్యద్ బ్రహ్మగా, ఏ మంచుమలల్లోనో హనుమ ఉన్నాడన్న విశ్వాసం మనది. తుంబురు, నారదులు తలవంచుకొనేంత దివ్యసంగీత కళారహస్యవేత్త. సంకీర్తన సంప్రదాయానికి ఆద్యుడు. భగవత్, భగవన్నామాలలో - నామ వైశిష్ట్యాన్ని నిరూపించి, నిరంతర రామ నామ సంకీర్తనపరుడై ఉన్నవాడు. తత్త్వవేత్త,

తత్త్వజిజ్ఞాసా పరత్వం -

వైదేహీ సహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజన సుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజేశ్యామలమ్ [17].

సద్భిః సర్వదాభిగతుడైన శ్రీరామునిచే వ్యాఖ్యానింప చేసి ఆనందించే తత్త్వమతనిది.

అంతటి వైరాగ్య సంపన్నుడు. ఐనా, సమాజాన్ని బహిష్కరించే శుష్కవేదాంతి కాడు. ఐహిక సుఖానపేక్షంగా, అస్ఖలిత బ్రహ్మచారిగా, సామాజిక వ్యవస్థ, పటిష్ఠమైన రాజకీయ వ్యవస్థల భద్రతకు ధర్మాభిరతితో తనవంతు సాయం తాను చేశాడు. 'యో బహూన్యపి సాధయేత్ [18], అన్న తన మాటకు తానే నిదర్శనంగా నిల్చి, ఎన్నో సాధించి, ఆదర్శంగా నిలిచాడు - భక్తి మార్గంలోను, లౌకికంగా స్వామి కార్యనిర్వహణంలోన్నూ.

కేవలం ప్రభుభక్తి, రాజ్యభక్తి మాత్రమే చాలదు, తరించటానికి. ఇవి కేవలం ఐహికాలు. ధర్మబద్ధమైన సేవనం ఐనా స్వర్గాదికం తప్ప నిశ్శ్రేయః ప్రదాలు కావివి. పరమపద ప్రదమయినది పరమాత్మ సేవనమే. కనుకనే - సుగ్రీవానుచరునిగా ఉంటూనే - రాముని - పరమాత్మని - సేవించి, తరించాడు, హనుమ.

అయితే, హనుమ పరమపదాన్ని తిరస్కరించి ఇక్కడే ఈ లోకంలోనే ఎందుకున్నట్టు?

రామావతార కాలంలో విభవమూర్తి అయిన ఆయనకు దాస్యం చేసి కైంకర్యలాభంతో తృప్తినందాడు. ఆ తరువాత అవతార పరిసమాప్తి

అయినా, రామనామామృతపానంతో అదే జీవికగా నిల్చి ఉన్నాడు. రామాజ్ఞతో, రామకథ ఉన్నంత వరకూ భూమిపై ఉంటానన్నాడు.

యావ త్తవ కథాలోకే విచరిష్యతి పావనీ
తావత్ స్థాస్యామి మేదిన్యాం తవాజ్ఞామనుపాలయన్
(ఉత్తరకాండ - 10 స॥)

నారదాదులకూ దేహధారణ మెందుకు? తదేకారాధనార్థమే కదా!

'తదర్థ ప్రాణ స్థితి ర్యథా హనూమతః'[19].

'న జాతు పీతామృత మూర్ఛితానాం'[20] అన్నట్లుగా స్వర్గాదులకంటె, పరమపదం కంటేనూ - లీలావిభూతే తనకి ప్రీతిపాత్రమన్న తలంపుతో, రామనామ సంకీర్తన సంశ్రవణం కోసం నిల్చి ఉన్నాడు.

యావత్ స్థాస్యంతి గిరయః, యావతీచ వసుంధరా, తావత్కాలం రామకథ నిల్చి ఉంటుంది. రామకథ ఉన్నంత కాలం, రామగుణ సంకీర్తనమూ ఉంటుంది. సంకీర్తనమున్నంత మేరా హనుమన్మూర్తి ప్రకాశమూ ఉంటుంది. అందుచేత, నామసంకీర్తనంతో అవినాభావాన్ని ఏర్పరచుకొన్న హనుమ భక్తశిఖామణియై భువిని విరాజిల్లుతూనే ఉంటాడు.

యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిం[21],
బాష్పవారిపరిపూర్ణలోచనం,
మారుతిం నమత రాక్షసాంతకమ్.



అధోజ్ఞాపికలు :-

1. వివేక చూడామణి - 32.

2. నారదభక్తి సూత్రములు, శాండిల్య భక్తి సూత్రములు.

3. గూఢార్థ దీపిక అనే గీతావ్యాఖ్యానం ఉపసంహారంలో.

4. జనశ్రుతిగా జగద్విఖ్యాతమిది!

5. దాశరథీ శతకం - 25.

6. శ్రీ కృష్ణ కర్ణామృతం - 3-95.

7. శ్రీ కృష్ణ మంత్రోపదేశం పొందిన మధుసూదనుల చాటూక్తి!

8. ధ్వన్యాలోకః - తృతీయ ఉద్యోతః.

9. త్రిగుణాత్మిక భక్తితోపాటు చతుర్విధ భక్తుల్ని గీత పేర్కొంది. ఈ చాతుర్విధ్యం శాంతిపర్వం లోనూ చూస్తాం (350-3). వంగ వైష్ణవ సంప్రదాయంలో పంచవిధ విభాగం ప్రచురం.

10. భాగవతం - (7-5-23) బ్రహ్మాండ పురాణం అష్ట విధాలనభివర్ణించింది. ఏకాదశ ద్వాదశ విధాలు నారద శాండ్రిల్య సూత్రాల్లో చూస్తాం. ఇలా వైవిధ్యంతో వింగడించి నిరూపించిన వైనం గమనిస్తాం.

11. సుందరకాండ - 15-53 & 54. 16-27.

12. సుందరకాండ - 16-28.

13. లక్ష్మీ సహస్రం - కటాక్షస్తబకం - 40.

14. సుందరకాండ - 53-28-31.

15. యుద్ధకాండ - 131 సర్గ, 82 శ్లో.

16. యుద్ధకాండ - 131 సర్గ, 82 శ్లో.

17. పారాయణ ప్రారంభంలో కావించే పూర్వశాంతి శ్లోకం.

18. సుందరకాండ - 41-5.

19. శాండిల్య భక్తి సూత్రములు - 44.

20. పరాశర భట్టారకుల శ్రీరంగనాథ స్తోత్రం.

21. పారాయణ ప్రారంభంలో కావించే పూర్వశాంతిలోని హనుమద్వందనం.



అనుబంధం - 1

# దుష్కర కార్యసాధకుడు

'హనూమానబ్ధిమతరత్,[1] దుష్కరం కిం మహాత్మనామ్?

ఇది అర్థాంతరన్యాసమునకు ప్రచలితోదాహరణము. లక్ష్యలక్షణ సమన్వయము ప్రస్తుతమప్రస్తుతము. కాని, పై లక్ష్యమున ప్రయుక్తమైన 'దుష్కరం' అనుమాట అంతకుముందే వాల్మీకిచే హనుమత్సముద్ర లంఘన ఘట్టమున బహువారము ప్రయుక్తము. సముద్రలంఘనమందలి దుష్కరత్వమును పరిశీలించుట ప్రస్తుతాంశము. నిజమునకీ పద మబ్ధిలంఘన మాత్రమునకే కాక అవాంతరకార్యములకు కొన్నిటికి పరివ్యాప్తమైనది. అర్వాచీన కవికృత సమీచీన ప్రయోగము యాదృచ్ఛికమో, యత్నతః కృతమో కానీ, వాల్మీకి మాత్రము సాభిప్రాయముగ సాధికారముగ ప్రయోగించినాడు. ప్లవమాన ప్లవంగమ ప్రవరుని ప్రతిభా ప్రాకట్యమే కాక తదుపాధిభూతమైన వలీముఖ ప్రముఖుల ప్రరోచనాదికమూ దుష్కరత్వమును ప్రస్ఫుట మొనరించునవే. వాల్మీకి సంఖ్యావిశిష్టముగ నిరూపించిన దుష్కరకర్మలను మాత్రమిట పరామర్శింతము.

సీతాన్వేషణమునందు వానర సైన్యమునంతను సుగ్రీవుడు నియోగించెను. అవాచీదిశాన్వేషణ వ్యగ్రులైన వలీముఖులకు - సంపాతి, లంకాభిగమనము వలన ప్రయోజనము తెల్పెను. శతయోజన విస్తీర్ణమైన సముద్రము నెవరు దాటగలరు? దానితో శక్తియుక్తులను బేరీజు వేయుట మొదలైనది. చివరకు హనుమ సమర్థుడని నిశ్చయించి, ప్రోత్సహించిరి. హనుమ లంఘించుట కుద్యమించినాడు. ఎత్తయిన ప్రదేశమునుండి గాలిలోని కెగిరి, ఆకాశంలోనికి చొచ్చుకొనిపోయి అటనుండి మహావేగంతో ప్రయాణించి లంకను చేరవలె. అందుకు ముందు మహేంద్రగిరి నధిరోహించెను. అటనిల్చి

స్థిరసంకల్పము చేసెను. దేవతలకు, భూతములకూ నమస్కరించి, శరీరమును పెంచసాగెను. ఉంకించి ఎగరడానికి పర్వతంకాస్తుందో, కాయదో - పరీక్షించడానికి అన్నట్లు - బాహువులతోటీ, చరణాలతోటీ ఆ పర్వతాన్ని పీడించాడు. అప్పుడు ఆ అచలం చలించిపోయింది! దాంతో, కొండ పై నున్న వృక్షాలు కదిలాయి. వృక్షాలు పుష్పవర్షణం కావించేయి. దాంతో పుష్పమయమైంది, గిరి. ఆ కొండ నదిమాడు, హనుమ. అప్పళించినట్లు అయిన ఆ కొండ గుహల్లోని జంతువులు నొక్కుకుపోయి భయంకరంగా అరచాయి. ఇలా ఆ దృశ్యాన్ని వర్ణిస్తాడు, కవి. ఇక్కడ రెండు విషయాలు గమనించాలి.

1) సముద్రమీదుట కాదు, ఎగిరి దాటుట!

వందయోజనాలు ఎగరటం కంటె, ఈదటం సులభం కదా! కానీ రామాయణం మొత్తంమీద ఈదట మన్నదే లేదు. వానరులంతా దాటటం అంటారే తప్ప ఈదట మనరు. అంటే వారికి 'ఈదటం తెలియదు'. కారణం వారు తీర ప్రాంతవాసులు కారు. అలాగే, రావణునికి ఈదటం తెలియదా? వారిది - 'జలదుర్గం'. వారికి ఈత వచ్చి ఉండాలి. కానీ, విమానాలలో నీటిపై ఎగరటమే చిత్రిస్తాడు, కవి.

2) ఎగిరేముందు హనుమ శరీరాన్ని పెంచటం!

ఉన్నవాడు ఉన్నట్టు ఎగరక, ఇంకా ఎందుకు పెరగటం? ఈ పెరిగినందువల్ల బరువు పెరిగి, లంఘనం కష్టం కదా? - అంటే, కాదు. రైటుసోదరుల ప్రయోగాన్ని ఒకమారు గమనించండి [2]. వాళ్ళ ప్రయోగం ప్రకారం ''బరువు స్థిరంగా ఉండి, వస్తు పరిమాణం పెద్దదయితే, అది తేలికగా ఎగరగలదు''. అందుకే బట్టలతో రెక్కల్ని తయారుచేసి, వాటి సాయంతో ఎగురుదామనుకుంటారు.

హనుమ చేయబోవు ఈ పని, లంఘనం [3] – దుష్కరం, నిష్ప్రతి ద్వంద్వం. ఇది మొదటి దుష్కరం. అంతేనా, నిష్ప్రతి ద్వంద్వమట! ఇంతటి కష్టమైన పనికి పూనుకొన్నా హనుమ గవాంపతిలా ప్రకాశిస్తాడు. అప్పుడు సంకల్పించి, ఉపక్రమిస్తాడు. సరి, ఈ ఎగిరే ప్రయత్నంలోనున్న హనుమను చూసి –

రామార్థం వానరార్థంచ చికీర్షన్ కర్మ దుష్కరం,
సముద్రస్య పరంపారం దుష్ప్రాపం ప్రాప్తు మిచ్ఛతి.

అని, ఋషులు అన్నారు. వాల్మీకి ఈ ప్రకరణంలో నాల్గు మార్లు 'దుష్కరం' అని ప్రయోగిస్తాడు. ఆ దుష్కరత్వమును చూపుటకీ ప్రయోగము.

హనుమ దుష్ప్రాపమైన సముద్రము యొక్క పారమెందుకు పొందా లనుకొంటున్నాడు? అంటే – రామార్థము, వానరార్థమూను. రామార్థమనగా సీతాన్వేషణం చేసి, ఆమెను రామునితో సంఘటిత పరచేందుకు. బాగున్నది. మరి, వానరార్థము? అనగా, సీతజాడ తెలియకపోతే, మరి వానరులకు గతిలేదు. అది ప్రాయోపవేశ సమయంలోనే వెల్లడవుతుంది. 'సుగ్రీవాజ్ఞ' మరి! అందువల్ల సీతాన్వేషణం వానరార్థమూను.

ఇందులో దుష్కరత అంతులేని సాగరాన్ని ఎగిరి దాటడమే! నిరాలంబం, అపరిచితం అయినమార్గంలో ప్రయాణం 'దుష్కరం' కదా? మన ఝుంపా (Jump) ప్రయత్న విధానాన్ని కవి వర్ణిస్తాడు. పైగా – 'రురోధ హృదయే ప్రాణాన్' అంటాడు. ఇది గమనించాల్సింది. ఇక్కడ 'యోగమును'[4] ఆవిష్కరిస్తారు, వ్యాఖ్యాతలు. ఈ ప్రాణాయామం ఎగిరేందుకు సాయపడేది. హనుమ ఇక్కడొక ప్రతిజ్ఞ చేస్తాడు.

యథారాఘవ నిర్ముక్తః శరః శ్వసనవిక్రమః, గచ్ఛే త్తద్వద్గమిష్యామి లంకాం రావణపాలితామ్, నహిద్రక్ష్యామి యదితాం లంకాయాం జనకాత్మజాం, అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్

యదివా త్రిదివే సీతాం నద్రక్ష్యా మ్యకృతశ్రమః బధ్వా రాక్షస రాజాన మానయిష్యామి రావణం,
సర్వథా కృతకార్యోహ మేష్యామి సహసీతయా, ఆనయిష్యమి వా లంకాం సముత్పాట్య సరావణామ్

ఇలా తన గమన ప్రయోజనాన్ని చెప్పి ఎగిరేడు. ఆ వేగానికి చెట్లు, ఎవరో పీకి విసిరేసినట్లు, హనుమను అనుసరించాయి. అంతవేగంతో ఎగిరేడు.

ఇక్కడ శరౌపమ్యం లంఘన ఫలవ్యంజకం. రామబాణానికెలా వైయర్థ్యంలేదో, అలాగే తన గమనమూ అమోఘమని ధ్వని. అంతేనా - బాణమెలా ధానుష్కాధీనమో తానును అట్లే - అని, తన పారతంత్ర్యవ్యంజకమైన ఔపమ్యాన్ని ప్రకటిస్తాడు. ఒక్క లంకేకాదు, స్వర్గపాతాళాదులైనా వెదికి ఎక్కడున్నా సీతను తీసుకొస్తాను, అన్న భీషణప్రతిజ్ఞ రామశరలక్ష్యాభిగమ సంసూచకమే. లక్ష్యం నిర్దిష్ట స్థలంలో లేకపోయినా దాని ఉనికి తెలిసికొని తరుముకొనిపోయే దీర్ఘతర వ్యాపారము రామేషువుది! ఇది, రామ బాణౌపమ్య సామంజస్యము.

ఆకాశాన్ని త్రాగేస్తున్నట్లు ఆకాశంలో ఎగురుతున్న హనుమ ఛాయ సముద్రంలో పడింది. అది పదియోజనాల వెడల్పు, ముప్పై యోజనాల పొడవూ కలది. ఇట్లు పోవుచున్న హనుమకు మధ్యలో సముద్ర ప్రేరణమున విశ్రాంతికై మజిలీ నేర్పరచ వచ్చినాడు, మైనాకుడు. హనుమ, ఇది విఘ్నమని తలిచి ఉరసా పాతయామాస! హనుమ వేగాన్నెరగిన మైనాకుడు ఆనందంతో తనపై విశ్రమించమన్నాడు. హనుమ దాన్ని సగౌరవంగా తిరస్కరించాడు.

'త్వరతే కార్యకాలో మే అహ శ్చా ప్యతివర్తతే,
ప్రతిజ్ఞా చ మయా దత్తా న స్థాతవ్య మిహాంతరే' - అంటాడు.

తన ప్రతిజ్ఞ ఏమి? రాఘవ నిర్ముక్త శరంలా వెళ్ళటం! రామబాణం ఆగుతుందా మధ్యలో? - ఆగదు! లక్ష్యాన్ని దూసుకొని పోవటం దాని నైజం. మరితానో? అంటే, తనని అభ్యంతర పెట్టవద్దని మైనాకుణ్ణి ప్రార్థించటం.

ఇది శరోపమోపబృంహకం! అంతేకాదు, ఇక్కడ హనుమ మాటల్ని గమనించాలి. ఇవి పొడిపొడి మాటలు. ఈ శ్లోకం మాటమాటకీ విరిగిపోయినది. ఎందుకంటే - మనము తొందరగా ఏదైనా పనిమీద వెడుతున్నప్పుడు త్రోవలో ఎవరైనా నిలిపి ప్రశ్నించిన, ఆగక-పోవుచు - వారిని చిన్నబుచ్చలేక, పొడిపొడిగా వారికేదో సమాధానము ఇస్తాము. ఆ సమాధానము అసమగ్రము. అట్లే, ఇక్కడ హనుమ సమాధానమూను. ఇది వాల్మీకి ఉక్తి వైచిత్రికి పరమోదాహరణము.

సరి, తానెగిరి ముందుకుపోవును. ఇంద్రభయముతో సాగరమున దాగి ఉన్నవాడు, ఆ భయమును వీడి కేవలము తనకోసము బయటకు వచ్చెను. వాని ఆతిథ్యము స్వీకరించకున్న చిన్నబుచ్చుకొనునని, చేతితో స్పృశించెను. ఇది ఉచితజ్ఞత! ఆకాశమున కెగిరి మరల వెనుకకు తిరిగి గిరిని చూచి ముందుకు పోయెను. ఇది మరియొక దుష్కరము!

తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్,
ప్రశశంసుః సురాః సర్వే సిద్ధాశ్చ పరమర్షయః,

ఇక్కడ ప్రశంసించినది - సిద్ధులు, ఋషులు. సంఖ్యావిశిష్టముగా 'ద్వితీయం కర్మ' అన్నా ఇది అద్వితీయము. సముద్రములో కొట్టుకొని పోయేవానికి గడ్డి పరక దొరకినా గొప్పే అన్నట్లు - సముద్రం మీద ఎగిరేవానికి మజిలీగా కొండ దొరికొతే గొప్పకదా! కానీ, దాన్ని తిరస్కరిస్తాడు. ఇది, దుష్కరమే కాదు, సుదుష్కరం!

ఇలా ఎగురుతూన్న హనుమను పరీక్షించాలనుకున్నారు, దేవతలు. క్షణకాల విఘ్నాన్ని ఘటించారు, సురస ద్వారా. రాక్షసరూపంతో ఆమె ఎదురువచ్చింది.

'మమ భక్షః ప్రదిష్టస్త్వ మీశ్వరైః వానరర్షభ,
అహం త్వాం భక్షయిష్యామి ప్రవిశేదం మమాననమ్'

అని, నోరు తెరచి హనుమను మ్రింగుటకు సిద్ధమైనది. అపుడు ఆమెకు వందనమాచరించి, తన కార్యాన్నెరిగిస్తాడు హనుమ. సీత జాడ నెరిగించి వస్తాను, అపుడు భక్షిద్దువుగాని అంటాడు. నాకెదురుపడిన వాడెవడూ నన్ను దాటిపోలేడు. ఇది నాకు బ్రహ్మయిచ్చిన వరం. నా నోటిలో ప్రవేశించు, అని నోరు తెరుస్తుంది - సురస! గుహలా ఉన్న ఆమె నోటిలో ప్రవేశించి, మళ్ళీ పైకి వచ్చి అంతరిక్షమునకు పోయి -

'ప్రవిష్టోస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోస్తుతే,
గమిష్యే యత్ర వైదేహీ సత్యం చాసీ ద్వరం తవ'. అంటాడు

సురస నిజరూపంతో ప్రత్యక్షమై -

'అర్థ సిద్ధ్యై హరిశ్రేష్ఠ! గచ్ఛ సౌమ్య యథాసుఖమ్,
సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా' అని,

అనుజ్ఞనీయగా పురోగమిస్తాడు, హనుమ. ఇది 'తృతీయం దుష్కరం'[5].

ఇక నాల్గవది -

హనుమ ఎగురుచున్నాడు. ఆ సాగరంలో సింహిక అనే రాక్షసి ఉంది. ఆమె నీరూప. ఛాయామాత్ర శరీర. ఛాయాగ్రాహిణి. నీటిపై బడిన నీడని బట్టి వ్యక్తినిలాగి బంధించి భక్షించేది. అది చాలా రోజులకి మంచి ఆహారము దొరకనున్నదని హనుమ నాకర్షించ నారంభించింది. ఎగురుతున్న హనుమకు గతి స్తంభనమేర్పడినది. నౌక ఎదురుగాలికి ఎలా చెదిరి ఆగిపోతుందో, అలా అయింది పరిస్థితి. అన్ని వైపులా పరికించి చూశాడు. ఏమీ అవగత మవలేదు. ఇంతకు ముందు సుగ్రీవుడు చెప్పిన ఛాయాగ్రాహి స్ఫురణకు వచ్చింది. దాని ప్రతిభే ఇది అనుకున్నాడు, హనుమ

శరీరాన్ని పెంచనారంభించాడు. సింహికా, వక్త్రాన్ని ప్రసరింప చేసింది. సంప్రాప్త శరీరుడై సింహికనోటిలో దూరి మర్మాలను త్రుంచి అంతరిక్షమును చేరుతాడు, హనుమ. దాంతో ఆకాశచారులైన భూతాలు అన్నీ ఆనందంతో ప్రశంసిస్తాయి.

'భీమ మద్య కృతం కర్మ మహాత్ సత్వం త్వయా హతమ్' అని!

ఇది దుష్కరం కాదు, భీమం. దీన్ని చంపడానికే బ్రహ్మ, హనుమను సృష్టించాడుట! ఇవి నాలుగు వరుసగా హనుమ చేసిన దుష్కరకర్మలు [7].

మొదటిది, 'దుష్కరం, నిష్ప్రతి ద్వంద్వం'. అచట కేవలం లిలంఘయిష! లంఘించాలన్న కోరిక. అందుకత్యంతావశ్యకమైనది అధ్యవసాయము.

రెండవది, 'దుష్కరం... కర్మ' అని మైనాకునిచే హెచ్చరింపబడినది. సముద్రోపరిలంఘన మెంతటి దుష్కరమో తెలిసినవాడితడు. సముద్రమధ్యమున చేరుటకే 'తలప్రాణం తోకకువచ్చినది' ఇతడికి. అందువలన ఆయన హెచ్చరిక సమంజసమే! ఆ హెచ్చరిక ద్వారా మైనాకుని ఆప్యాయనాన్ని ఆస్వాదించినా, సహాయాన్ని సగౌరవంగా తిరస్కరిస్తాడు – కార్యత్వరతో, ప్రతిజ్ఞాభంగ భయంతో! ప్రశంసార్హమైన ఇది ద్వితీయం దుష్కరం. ఇక్కడ సంఖ్యావిశేషణం 'ద్వితీయం' ఉన్నా – వస్తుతః ఇది అద్వితీయం!

మూడు, నాలుగు దుష్కరములు – సురస వరమును అతిక్రమించక తన పనికి ఆటంకమును కలుగనీయక ఉపాయముతో విఘ్నము నతిక్రమించుట, సింహికను చంపుట! ఇద్దరూ స్త్రీలే అయినా, సురసను జయించటం, సింహికను చంపటం – ఈ తారతమ్యమెందుకు? సురస రాక్షసికాదు. సింహిక ప్రాణిహంత్రి. సముద్రోపరిచారులకు ఆమె

ప్రతిబంధకము. నేటితో అది తీరినది. కనుకనె ఆకాశచారుల ప్రశంస అటు ప్రయుక్తము.

ఈ నాలుగు కృత్యములకు నాలుగు లక్షణముల నుపలక్షించిరి. హనుమద్ దుష్కరకర్మల నన్నిటిని సమీక్షించి, ఆతనిలో గల నాలుగు విశిష్టతల నుగ్గడించుచు -

యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ,
ధృతి ర్దృష్టిర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి.

అని ప్రశంసించిరి. ఈ నాలుగు హనుమకు గలవు. వాటి సమన్వయము ఈ నాలుగు కృత్యములందును గోచరించును. ధృతి - అనగా ధైర్యము. దృఢమైన అధ్యవసాయము. ఈ కార్యమును నిర్వర్తించుటకు తాను శక్తుడా, అశక్తుడా అను సంశయము అసలు కలుగలేదు. ఇది నీవే చేయగలవు అని వానరులు ప్రేరేపించారు రామార్థం, వానరార్థమూను. పునరాలోచన లేక తాను సిద్ధపడినాడు. అది దుష్కరము. అయినా, మధ్యలో వచ్చే అపాయాలనెదుర్కొని అధిగమించి లక్ష్యాన్ని సాధింపదలచాడు అందుకే 'శత్రుకర్శనః' అంటాడు, మహర్షి సాభిప్రాయంగా.

ఇక రెండవది - దృష్టి - అంటే, ఏ కార్యం ఆత్యంతికమో దానిపైనే సర్వేంద్రియాల్నీ ఏకాగ్రంగా నిల్పి ఆచరించటం. అవాంతరాలపైకి దృష్టి మరల్చక పోవటం, తన ప్రయోజనం సీతాన్వేషణం. అంతవరకు తానాగుటకు వీలులేదు. అందుచేత మైనాకాభ్యర్థనం తిరస్కృతం. ఇదే దృష్టి.

మూడవది మతి - విహితకర్మాచరణంతో ముందుకు సాగటం. సురస దత్తవర! ఆమెను నిగ్రహించరాదు. వర మసత్యం కారాదు. ఈ విషమస్థితిలో హనుమ కృతకృత్యుడౌతాడు.

నాల్గవది, దాక్ష్యం - అంటే సామర్థ్యం. చేయకూడని పనులు చేయకుండా, వాటికి వశపడకుండా, నిగ్రహంతో వాటిని జయిస్తూ ముందుకు సాగటం అన్నమాట! సింహికా సంహారణం దీన్నే తెలియచేస్తుంది.

ఈ నాల్గు లక్షణాలూ ఉన్నవాడు హనుమ. కనుకనే నిరాటంకంగా సముద్రలంఘన కార్యం నిర్వహిస్తాడు. దీన్ని ఆధ్యాత్మికంగా యోగముతో సంవదింపచేస్తారు వ్యాఖ్యాతలు. మనం ప్రస్తుతం లౌకిక దృష్టితోనే గమనించాం.

ఇందులో వాల్మీకి ప్రసక్తానుప్రసక్తంగా కొన్ని విషయాలను ప్రస్తావిస్తాడు. అవి హేతువాద పురస్సరంగాను, కార్యకారణ సంబంధం కలవిగాను ఉంటాయి. దేశాంతర ఖండాంతర నాగరికతలు రామాయణంలో అక్కడక్కడ మనం గమనిస్తాం. అలాంటివాటికి పరమోదాహరణం సింహికా సంహారణం. ఇది 'బెర్ముడా ట్రయాంగిల్'ను స్ఫురింపచేస్తుంది. ఇది కేవలం యాదృచ్ఛిక సన్నివేశం కావచ్చును. వాల్మీకి చెవికి అపూర్వము, శాస్త్రీయ విజ్ఞాన సాహాయ్యముతో కూడా దురవగాహము ఐన ఈ విషయం ఎలా సోకిందో? సాకల్యంగా శోధించి సాధించవలసిందిది. అలాగే, హనుమ శరీరాన్ని పెంచడంలోని శాస్త్రీయ రహస్యాన్నీ ఆవిష్కరించాల్సి ఉంది.

ఈ విధంగా సముద్రలంఘన ఘట్టంలో కార్యసాధకునికి ఉండాల్సిన నాలుగు లక్షణాల్ని నాలుగు సన్నివేశాలతో సంఘటిత పరచి రమ్యమైన ప్రయాణంగా మలచి, రసచషకాన్ని అందిస్తాడు ఆదికవి వాల్మీకి మనకి.



## అధోజ్ఞాపికలు :-

1. తౄ - ప్లవన తరణయోః అనే ధాతువు వలన ఇక్కడ ప్లవనార్థం కంటే తరణమే (to cross) గ్రాహ్యం. ఈ ఇబ్బంది లేకుండా, వాల్మీకి లంఘు ధాతువు నుపయోగిస్తాడు. దాటినది ప్లవంగము. అంచేతా అదే ఉచితం.

2. అమెరికా దేశస్థులైన WRIGHT BROTHERS 1903 లో AEROPLANE కనుక్కోడానికి ముందు ఎగరటానికి చేసిన ప్రయత్నాలు.

3. 'నదీసీర్త్వాబహూనాదకాః' ఇటువంటి ప్రయోగాల్లో తరణం నావతో - ఈదటం కాదు. రావణుడు సముద్రాన్ని ఎన్ని మార్లో దాటేడు. ఎలా దాటేడో వర్ణించడు కవి. అలాగే మారీచుడు, శూర్పణఖ మొ॥ వారూ దాటారు. ఆ విషయాన్ని ఉటంకిస్తాడు. ఏ వివరాలూ చెప్పడు. హనుమ సముద్రాన్ని లంఘించడం విశేషమైన విషయం. పర్వతకూటమాత్రుల పారావార పరంపారాభిగమన వైదగ్ధ్యం, వైచిత్రి రెండుమార్లు మనోహరంగా, ఔచితీసహంగా వర్ణిస్తాడు.

4. యోగంవల్ల భూమికి ఎత్తుగా గాలిలో తేలి ప్రయాణించవచ్చునని ఆధునికులు అంగీకరించారు.

5. మైనాకవిఘ్నం కన్న సురసావిఘ్నం విలక్షణమైనది. మైనాకుడు కృతజ్ఞతాంజలితో ఎదురువచ్చి విశ్రమించమన్నాడు. అది విఘ్నంకాదు. సహాయమే. సురస అలా కాదు. ఆమె చేసినది పరీక్ష. ఇదే నిజమైన విఘ్నం. ఇందులో 'అనుకూల శతృత్వం' వంటి సురసా ప్రతిషేధం - క్షణంలో ఓర్పుతోనూ, నేర్పుతోనూ హనుమ అధిగమించటం ప్రశంసార్హం. కానీ కథాగతిలో ఇది లేకున్నా నష్టమేం లేదనిపిస్తుంది, సామాన్య దృష్టితో చూస్తే.

... ...ంటిక్‌లోని బెర్ముడా ట్రై యాంగిల్ (కాల్పనిక త్రికోణం) తో ...త్తాంతం సంవదించటం గమనార్హం.

...ంచి ఆలోచించకుండా లంకాదహనం కావించిన హనుమత్ దుష్కరం. కాదు, మరీ దుష్కరం!

...న్మలను గూర్చి ఆలోచించడు, కానీ ఇతరులను గూర్చి దయుడు, హనుమ. కనుకనే సీతా విప్రణష్టుడైన రాముణ్ణి దుష్కరం కురుతే రామః' అంటాడు.

* * *

# అనుబంధం - 2

# వానరులు వానరులేనా?

'నరాణాం వానరాణాంచకథ మాసీ త్సమాగమః?' ఇది సీత సంశయోచ్ఛేదనార్థం వేసిన ప్రశ్న. సీతాపదాన్వేషణకై సముద్రాన్ని లంఘించి, లంకకువచ్చి, రాక్షసీగణమధ్యంలో సీతను గుర్తించి, తన నెరిగించుకొని సంభాషిస్తున్న హనుమపై అపనమ్మకంతో సీత వేసిన దీ ప్రశ్న. శత్రధీనమున ఉన్న తనకు అడుగడునా గండములే. వచ్చినది దూతయేనా? కాదు. ఎందువలనంటే, తానున్న చోటటువంటిది.

రామ రాజ్యంలోకి ఇతడెలా ప్రవేశించాడు? తానున్నది రాక్షసస్త్రీల మధ్య. వారు అప్రమత్తంగా, అధిక సంఖ్యలో చుట్టుముట్టి కావలి ఉన్నారు. వారిని ఏమార్చి తనను సమీపించటం అసాధ్యం. అంటే, ఇది రాక్షసమాయలా ఉంది. తాను మొదటి నుంచి రాక్షసకపటానికి గురవుతూ ఉంది. పోనీ, వచ్చినవాడు నరుడా? వానరం! నర వానరుల మధ్య ఏకాక్షరభేదం ఎంత బెడద తెచ్చిందో, చూడండి! ఈతడా, వానరం; రాముడా పురుషోత్తముడు. వానరం చపలమూ కోపనశీలమూ కలది. నరుడు-సంయమున సంస్కారగుణ భూషితుడు. వీరిద్దరికీ పొత్తు ఎలాకుదిరింది? ఒకవేళ కుదిరినా, ఆయనెలా పంపాడు? దౌత్యనిర్వహణదక్షమైన ప్రాణా వానరం? పశు పక్ష్యాదులతో పత్రాలు పంపినట్లు పంపేందు కిదేమేనా సామాన్యవ్యవహారమా? కాదే! అంతేకాక, అంతఃపుర స్త్రీల వద్దకు, తత్రచ వ్యసనపరంపరయా నిపీడ్యమానయైన ఆమెకు సాంత్వనవాక్యాన్ని పల్కి గుండె ధైర్యాన్ని చిక్కపట్టేట్లు సమయోచితంగా సంభాషించగల మనీషగల మనిషిని పంపాలి. రామునికీ విషయాలు తెలియవా? ఎంతటి రాజనీతివేత్త [1] అతడు! మరీ, వానరుణ్ణి పంపుతాడా? పంపడు. అంటే, ఇతడు రామదూత కాడు, రాక్షసుడే!

అందుకే, ఆమూలాగ్రంగా- మీకలయిక ఎలా జరిగింది? రామలక్ష్మణుల లాంఛనాలు ఏమిటి? - అని చెప్పమని నిలవేసింది. దాని వల్ల రెండు ప్రయోజనాలు. 1) రామకథా శ్రవణం. సంగమాత్కించి దూనమైన కాంతోదంతం హర్షదాయకం కదా! 2) ఈ దూత నంటున్నవ్యక్తి ఎక్కడేనా (పప్పులో కాలువేసి) పట్టుబడకపోతాడా?

ఆయన వర్ణించనారంభించాడు. ఆయనకీ రెండు ప్రయోజనాలు. 1) సీత తనను నమ్మటం లేదు. ఆమె విశ్వాసాన్ని చూరగొనాలి. 2) రామగుణకీర్తనం తనకి సంతోషావహం. తానింతకు ముందే నిశ్చయించుకున్నాడు. మనుష్యుల వలె సంస్కృతంలో మాట్లాడితే 'రావణుడు' అని భావిస్తుందేమో! మరి, ఆమెకు అన్నీ వివరంగా చెప్పాలంటే అమరవాణి ఆవశ్యకమని గ్రహించాడు. రామలక్ష్మణులతో మాటాడినపుడు సంస్కృతమే వ్యాహారసాధనమైంది. మొత్తం కథంతా చెప్పి,'... ఏవం సమజాయత' అంటాడు. రామ సుగ్రీవుల స్నేహానికి సాక్షిని నేను. సీతాన్వేషణకై సుగ్రీవుడు వానరుల్ని భూమిపై అన్నిదిక్కులకూ పంపాడు. నన్ను దక్షిణ దిక్కుకు పంపుతూ ప్రత్యేకంగా రాముడు ఈ అభిజ్ఞానం ఇచ్చి మరీ పంపాడు, అని తానొక్కడూ లంకకు రావటాన్ని చెప్పాడు.

సరే, అశోకవన భంజనం - తాను పట్టుబడి సభనీ, మంత్రి పురోహితాదుల్నీ, యుద్ధ వీరుల్నీ, యుద్ధనీతిని పరిశీలించటానికే. లంకాదహనం కేవలం తనను పట్టి బంధించి, తోకకు నిప్పుపెట్టి అవమానించినందుకు ప్రతీకారం కాదు. రాత్రి పూట తాను లంకలో ప్రవేశించినది, నగరనిర్మాణ వైఖరి ఏమిటి? జలదుర్గాధీన ధైర్యంతో రావణుడు శత్రుదుర్భేద్యంగా ఉంచాడా? లేక లొసుగు లేమన్నా ఉన్నాయా? (ఉంటే Week point నుంచి attack చేయవచ్చునని) అది పరిశీలించడానికే లంకాదహనం. నిర్దిష్ట కార్యావిరోధంగా తక్కిన పనులూ సాధించటం - ఇది దూత లక్షణం.

[illegible] వాలినుండి సుగ్రీవుణ్ణి కాపాడుతూ వచ్చాడు. తన మంత్రాంగంతో రాజ్యభ్రష్టుణ్ణి - కాందిశీకుణ్ణీకానీయక వానరేశ్వరుడుగా సుప్రతిష్ఠింపచేశాడు. వాలి సుగ్రీవులిద్దరూ సోదరులే. వానరులే! కానీ వారిద్దరి మధ్యా వైరముంది. ఐనా, వారికి కొన్ని కట్టుడులూ, సంప్రదాయాలూ, మనకి ఆశ్చర్యం కలిగించేట్లుగా ఉన్నాయి. వారికో రాజ్యం, దానికో, పాలకుడు! ఈ పాలకుని పట్ల - 'రాజు'అన్న పదం కంటే, 'క్షత్రియుడు' అన్న పద మన్వర్థంగా తోస్తుంది, యౌగికార్థాన్నిబట్టి. కానీ పాలకులు వలీముఖులు. శిలీముఖ ప్రయోగదక్షులు కాకపోయినా పర్వతకూటమాత్రులైన నఖదంష్ట్రా యుధులు. వారిది మెరుపు దాడి. సుశిక్షితులు. మహాబలసంపన్నులు. ఆటవిక పాశవిక లక్షణాల నుండి నాగరక జీవనానికి ఎదిగినటువంటి వారు. రాజు-రాజ్యం, పద్ధతులూ, యుద్ధాలు, నీతులూ-నియమాలూ, చదువు-సంధ్యలు... అన్నీ ఉన్నాయి. భయభక్తులున్నాయి. క్రమశిక్షణ ఉంది. 'సుగ్రీవాజ్ఞ' ఎంతగా పేరందినది! అలాంటి వానరులద్వారా రాముడు తన కార్యాన్ని సానుకులం చేసుకుందామని వారితో చెలిమి చేశాడు.

యాతుధానాధినాథయూథాన్ని మట్టుబెట్టడానికి కోతిమూక తప్ప రాముడికి మరెవరూ దొరకలేదా? అన్న ఆనృశంస్యంచేతో ఏమో, కొందరు బుద్ధిమంతులు వానరజాతిని మానవజాతిగా నిరూపించ తలకడుతున్నారు. కిష్కింధాపౌరుల ఆచారవ్యవహారాలతో సంవదించేంతగా కొన్ని ఆటవికజాతుల నడవడిక ఉండటం ఆ అనుమానానికి ఆస్కారమే కాదు ఉపష్టంభకమూను. అంచేత, వానరులంటే కోతులు కాదని, అదో రకమైన మానవజాతనీ, వారివాదం. వారు ఆర్యులనటంలో కూడా విప్రతిపన్నులు కారు, వీరు. ఎందుకంటే ఈ వానరులనబడే నరులు వేదాధ్యయనపరులు. కనుకనే ఆర్యులయ్యారు. నైకవిధ వేదశాఖలలో వానరశాఖ ఒకటని, తదధ్యయనపరులు వానరశాఖీయులని వారి వాదం. కానీ, వేదంలోని ముఖ్య-అవాంతర శాఖల్ని (అందినంత మేరకు) పరిశీలిస్తే వాటిలో వానరశాఖ అన్నది గోచరించటం లేదు.

,ఋగ్వేద మేకవింశత్యధ్వ. సహస్రాధ్వ సామవేదం. ఏకశతాధ్వ యజుస్సు. అధర్వణం నవాధ్వ. ఇది ప్రచురమైనవింగడింపు. మత భేదాలున్నాయి. శాఖానామములు పేర్కొన్నవారు కొందరు. వాటి జోలికి పోనివారు కొందరు[4]. పౌరాణికాధారాలున్నా పరస్పరం వివదించే పేర్లతో వస్తుంది చిక్కు. కొన్ని ఖిలాలు, కొన్ని లుప్తాలు, కొన్ని ప్రాంతీయాలు, కొన్ని సార్వత్రికాలు. వైవిధ్యం వైశద్యం - చాలా తికమకలు పెడుతున్నాయి. అందువల్ల వానరశాఖని గుర్తించటమే కష్టం. అవిదిత విషయాంతరులైన అనుష్ఠాన పరుల్ని ప్రశ్నించీ ప్రయోజనం లేదు. వేదశాఖల్ని వెదికి చూడగా..... మానవ, శౌనక, వారాహ..... వంటి పేర్లు తప్ప వానర శబ్ద మెక్కడా లేదు.

పైగా, వానరులనే వ్యవహారం కన్నా వానరశాఖీయులనటం సముచితం. అలా వ్యవహరించటం లేదు. కానీ, అది పద్ధతికాదు. తచ్ఛాఖీయులుగా కన్న తద్వేదులుగా ప్రతిష్ఠ పొందిన వారున్నారు. ఉదా: సామవేదం వారు. ఇక, అది అపురుషమైన శాఖ అయి ఉంటే, రాముడు దాని ప్రశంసచేసి ఉండేవాడు. శ్రీరాముడు హనుమ వాగ్విలాసాన్ని ప్రశంస్తూ- 'నాల్గువేదాలూ చదివినవాడు' అంటాడు. ప్రత్యేకంగా ప్రశస్యమైన వానరశాఖంటూ ఉంటే, తన్నామవ్యపదిష్టులైన తచ్ఛాఖా ప్రవర్తకులు అక్కడుంటే, వారి ప్రశంసచేయడా? కనుక, ఆంతర-బాహిర-ఉపపత్తులను బట్టి వానరులు నరజాతీయులు అనటం నిరుపాధికం.

హనుమ మంచుమలల్లో మసలే 'ఎతి' జాతి మనిషి అనే వాదం ఒకటి లేక పోలేదు శీతల ప్రాంతం నుండి సమశీతల ప్రాంతనికి వలస వచ్చాడా, ఈయన? మరి తక్కిన జాతి? ఆ జాతి నుండి ఎందుకు వేరుపడ్డాడు? అతని ఆహార విహారాదులేమిటి? అసలతని వ్యవహారమేమిటి? ఇక్కడ ఎలా ఇమడ గలిచాడు? వానరులు తమలోకి అన్యజాతీయుణ్ణి ఎలా ఆహ్వానించారు? పైగా, వారిలో అభ్యర్థిత పూర్వత్వం - అగ్రతాంబూలం హనుమకి ఎలా లభించాయి?

హనుమ అక్కడి వాడే. తరతరాలుగా ఎరిగినవారే వారంతా. అభిజనం[6], ఆభిజాత్యం నిశ్శ్రప్రథమైన ప్రత్యయాన్నేర్పరచేవే! కనుకనే, తత్పరిసరమంతా పరమనాగరికతతో పరిమళించింది. ఆరణ్యక జీవులైన వారిలో ఆటవికత కనిపించదు.

లంబాడీలు 'మేం అనుమంతుని జాతివారం' అంటారు. వీరి కోచోట స్థిరనివాసముండదు (Gypsy). అనాగరికులే అయినా అతి బలవంతులు. తేలికగా ఇతరుల్ని నమ్మేవారు. కానీ, వీరిది నూటికి నూరుపాళ్ళూ నరజాతి.

వీటన్నిటి కంటే, వాల్మీకి వాచ్యంగా, కంఠోక్తిగా వానరులు వానరులే అన్నాడు. వానరులంటే, వానరశాఖీయులో మరేమో - మొత్తానికి నరజాతి వారేనని సమర్థించుదామన్నా వీల్లేకుండా - కపివీరాః, ప్లవంగమాః, వలీముఖాః, హరయః.... మొదలైన వానరశబ్ద పర్యాయాలతో [7] చెప్తాడు. పోనీ, లక్షితలక్షణయా- వానరశబ్దం ద్వారా తదర్థకాలనీ గ్రహించి వానర శాఖీయులందామా అంటే, దానివల్ల అపకర్ష వస్తోంది. తదర్థక పద సాజాత్యం ఉత్కర్షాపాదకం ఐతే ఫరవాలేదు. పై పెచ్చు అపార్థస్ఫోరకం అయితే అది అవహేళన చేసినట్లే కదా!

సహృదయుడైన కవి తన పాత్రల ద్వారా - కావ్యం ద్వారా - ప్రయోజనాన్ని ఆసించే కవి, తన పాత్రలపై గౌరవం కల్గి ఉంటాడు. వాటిని తదనుగుణంగా తీర్చిదిద్దుతాడు. అంతేకాని వెటకారం చెయ్యడుకదా! అందువల్ల వానరజాతి వానరశాఖీయులూ కాదు, ఏమీకాదు - వానరజాతే! ఈ అర్థంలో వాల్మీకి ప్రయోగాల్ని గమనించండి -

<u>**బాలకాండ**</u> :- బ్రహ్మగారు దేవతల్ని భగవత్సహాయంకై 'వానరులు'గా అవతరించమని ఆదేశిస్తాడు. వానరులుగా ఎందుకంటె - తను రావణునికి ఇచ్చిన

వరాలు, నందీశుని శాపం! మానవేతరులచే జయింపబడకుండా వరములు పొందాడు, రావణుడు. మానవులంటే అవజ్ఞ!

నానా విధేభ్యో భూతేభ్యో భయం నాన్యత్ర మానుషాత్
అవజ్ఞాతాః పురా తేన వరదానే హి మానవాః (1-17-15)

నందీశుని శాపం -

తస్మా న్మద్రూపసంయుక్తా మద్వీర్యసమతేజసః,
ఉత్పత్స్యంతి వధార్థం హి కులస్య తవ వానరాః (దిగ్విజయే నందీ)

**కిష్కింధాకాండ** :- రామునితో వాలి అంటాడు. 'వయం వనచరా రామ! మృగమూల ఫలాశనాః' (17 సర్గ). 'అభక్ష్యపంచనఖాంతర్భూతు' డనైన నన్ను ఎందుకు చంపావు? వ్యాఘ్రాజినాదికం వలె ధారణ యోగ్యం కాదే చర్మం! రోమాలు చామరాదుల వలె స్వీకరణ యోగ్యం కావే! మరి, సంహరణ కారణం?......... దానిపై రాముడుత్తరమిస్తూ 'వానర చాపల్యం'తో ధర్మాన్నెరుగవు అంటాడు.

**సుందరకాండ** :- సముద్రంపై ఎగురుతున్న హనుమను వర్ణిస్తూ లాంగూలాన్ని నిరూపిస్తాడు. అను పూర్వేణ వృత్తంచ లాంగూలం రోమభిశ్చితం, ఉత్పతిష్యన్ విచిక్షేప...... తస్యలాంగూలమావిద్ధం..... దదృశే గరుడేనేవ హ్రియమాణో మహోరగః..... ఆకాశంలో ఎగురుతున్న హనుమతోక ఇంద్రధనుసులా ఉందిట! పరివేషంతో ఉన్న సూర్యునిలా, లాంగూల చక్రంతో హనుమ భాసిస్తున్నాడంటాడు - కవి! లిలంఘయిషతో హనుమ - 'దుధువే స చ రోమాణి...' ఇది జంతులక్షణమే కానీ, మనుష్యలక్షణం కాదు. ఇలాంటి జంతు సహజగుణాలు ఇంకా ఉన్నాయి. లంకా-హనుమల సంభాషణం, లంకావినిపాతనం - బ్రహ్మావరకథనం - వానర ప్రసంగం,

సుస్పష్టంగా కోతిచేష్టల్ని వర్ణిస్తాడు -

'ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం ననంద చిక్రీడ జగౌ జగామ,
స్తంభానరోహన్నిపపాత భూమౌ నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్'

మధుభక్షణ సమయంలోని మర్కట చేష్టల్ని ఎల్లిదంగా ఎత్తిపొడవక పోవటం గమనార్హం! సీతతో మాటాడేటప్పుడు సంస్కృతంలో మాటాడాలా? అలా ఐతే రావణుడని భావిస్తుందేమో? అని వితర్కిస్తూ - వానరస్య విశేషేణ కథం స్యా దభిభాషణం? అని హనుమే అంటాడు.

శాస్త్ర గణ నిషిద్ధ శాఖామృగ స్వప్న సందర్శనాన్ని సీత గర్హించటంలో కపిత్వం ప్రస్ఫుటంగా కనవస్తూంది. 'జాతి రేవ మమ త్వేషా వానరోహం' అంటాడు, రావణ సభలో వారి తర్జన భర్జనల మధ్య. లాంగూలాగ్నితో లంకని కాల్చటం వాని వానరత్వాన్ని ప్రకాశింప చేసింది కదా! మధువన భక్షణం (భంజనం) మొత్తం వానరులందర్నీ చేష్టా సముజ్వలంగా సందర్శింప చేసేదే.

**యుద్ధకాండ** :- సేతు నిర్మాణంలోను, తర్వాత యుద్ధంలోనూ వారి కపి (వీర)త్వం ప్రస్ఫుటం అవుతుంది. వానరబలాన్ని వారి యుద్ధనైపుణ్యాన్ని గుర్తు చేసి (హనుమ విషయంలో అనుభూతం), హెచ్చరిస్తూ విభీషణుడు - 'దంష్ట్రాయుధాశ్చైవ నఖాయుధాశ్చ...' అని విస్మృత విషయాన్ని విశద పరుస్తాడు (13 సర్గ). యుద్ధాన్ని గమనిస్తే -

తే తామ్రవక్త్రా హేమాభా రామార్థే త్యక్తజీవితాః,
లంకామే వాభ్యవర్తంత సాలతాలశిలాయుధాః

(15-42)

ఆ ప్లవంతః ప్లవంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః, [8]
లంకాం తా మభిధావంతి మహావారణసన్నిభాః.
రాక్షసా స్త్వపరే భీమాః ప్రాకారస్థా మహీగతాన్
భిండివాలైశ్చ ఖడ్గైశ్చ శూలై శ్చైవ వ్యదారయన్
తథా వృక్షై ర్మహాకాయాః పర్వతాగ్రైశ్చ వానరాః
నిజఘ్నుస్తాని రక్షాంసి నఖై ర్దంతైశ్చ వేగితాః (42 సర్గ)

వీటన్నిటి వల్లా వానరత్వమే – ద్యోతకం, కాదు – ప్రస్ఫుటం ఔతోంది. వాల్మీకి హనుమని చాలా వినీతునిగా చిత్రిస్తాడు. రాముని చేత 'వేది'గా నిరూపిస్తాడు. కవి ఈ పాత్ర నిరూపణకు వాడిన విశేషణాలను గమనిస్తే, మన కవగత మవుతుంది హనుమ పాత్రచిత్రణలోని వైలక్షణ్యం.

<u>హనుమకు వాడిన విశేషణాలు</u> :– శత్రుకర్శనః, ధీమాన్, కపివరః, శ్రీమాన్, వీర్యవాన్, కపికుంజరః, వానరశ్రేష్ఠః, మహాకపిః, వాయుపుత్రః, వానరసింహః, కపి శార్దూలః... ప్లవన సమయమున హనుమకు వాడినవీ పదములు. మొత్తముపై ఇంకెన్నో? అందు జాతిత్వ సూచకములుగా కాక, గుణ నిరూపణకు వాడినవి గమనించ తగ్గవి. కవిగా, నవవ్యాకరణ పండితునిగా, గాయకునిగా, భక్తునిగా, అభీష్టప్రదమైన దైవతంగా లోకప్రసిద్ధుడాయన!

<u>హనుమత్ప్రశంస, రామాయణములో</u> :–

**రాముడు** :– ప్రప్రథమంగా తాము కలిసినపుడు, సీతజాడ తెలిసికొని వచ్చినపుడు, సంజీవని తెచ్చినపుడు, పట్టాభిషేక సమయమందు ప్రశంసించాడు. (శ్రీరామ గాఢాశ్లేష గౌరవమందినవాడు, హనుమ!)

**సుగ్రీవుడు** :– వానరుల్ని సీతాభిగమరూపకార్యనియోజన చేస్తూ, ప్రత్యేకః విలక్షణంగా హనుమని ప్రశంసించాడు.

**సీత** :- అశోకవనంలోను, పట్టాభిషేక సమయాన ఎంతటి కృతజ్ఞతతో ఆవిష్కరిస్తుంది.

**వానరవీరులు** :- సముద్రలంఘన పూర్వాపరాలు వీరిస్తుతి వాక్యాలే, అవే ఉద్దీపకాలు.

సముద్రలంఘన సమయంలో - భూతాలు, ఆకాశచరులు, సిద్ధ కిన్నర కింపురుషాది దేవయోని విశేషాలు, సముద్రుడు, మైనాకుడు, సురస..... మహర్షులు.... ఇలా ఎందరో ప్రశంసిస్తారు. హనుమ ఒక సన్నివేశంలో ఒకరిద్దరిచేత స్తుతింపబడటం కాక, సర్వావస్థలా సర్వజనుల చేతా ప్రశంసించబడే వ్యక్తిత్వం గలవాడు.

అంటే వాల్మీకి రామగుణ నిరూపణంలో ఎలాంటి శ్రద్ధ కనబరచాడో, హనుమద్గుణావిష్కరణంలోనూ అంతే! రామ-రామదాసుల్ని లోకోత్తర గుణోత్తర మూర్తులుగా చిత్రించాడు. 'బొర్రపెంచిన వానికి బుర్ర పెరగదు' అంటారు. కానీ హనుమ ఎంత బలవంతుడో అంత బుద్ధిమంతుడూను!

రామాయణం ఆదర్శకావ్యం! పాత్రలూ ఆదర్శపాత్రులు! వాల్మీకి, రామునికి వానరులతో చెలిమి చేయించి రావణునిపై గెలుపు సాధింపజేస్తాడు. రాముడు మానవుడు. వానరులు మానవేతరులు. వారిద్దరి కలయికలో పుట్టినది అతిమానుషశక్తి. దీనిముందు రాక్షసుల అమానుష శక్తి కొరగాకుండా పోయినది. ఇది వాల్మీకి ఆదర్శ నిర్వాహం!

రాముడు సంయమనశీలి. రావణుడు తిరుగుబాటు ధోరణికలవాడు. అరాచకం, కట్టడిలేక ముట్టడి చేసే రకం! దర్పమాత్సర్య భూయిష్ఠుడు. ఆ అహంకారాని కంతేలేదు. వానిని సాధించడానికి కోతుల సాయం

అనుకున్నాడు, రాముడు. కోతులైనా, వాటికి నీతి నియమం ఉన్న జాతిగా గమనించాడు. ఆరణ్యక మృగాల్ని మచ్చిక చేసికొని వాటితో రావణు నెదుర్కోలేదు. వానరులంతా ఓ వర్గంగా రాజ్యాన్నేర్పరచుకున్నారు. వారిలో వారికి సఖ్యముంది. ఓ రాజున్నాడు. ఓ రాజ్యముంది. ఓ కట్టుడీ ఉంది. రాజభయం, సంఘభయం, పాపభీతి అన్నీ ఉన్నాయి. ఇదో సంఘటితమైన శక్తి. దీనితో రావణునెదుర్కోదలచాడు. రాక్షసుల యుద్ధపద్ధతి వేరు. వీరి యుద్ధ నీతివేరు. దాని నుపయోగించ దలచాడు, రాముడులోని యుద్ధవీరుడు. ముందు సీతా పదాన్వేషణం చేయించాలి. అది, ప్లవంగముల చేత సాధ్యం కనుక వారితో చెలిమి చేశాడు.

వాలి వధ తరువాత తార, అంగదుడు సుగ్రీవునితో కలిసిపోవటం గమనించాల్సింది. రాముడే అన్యాయం చేస్తే సుగ్రీవునిపై ఎప్పుడో ఒకప్పుడు తిరగబడాలి. కానీ, 'సుగ్రీవాజ్ఞ' నొదలదాల్చిన సన్నివేశాన్ని రామాయణంలో గమనించవచ్చు[10]. అంటే, రాముడు చేసింది వారికి న్యాయమైంది. వాలి దురాగ్రహ - దురాక్రమణంకి రామబాణంతో ఆటకట్టు అయింది. అలా రాముడు వానర రాజ్యాన్ని పునరుద్ధరించాడనవచ్చు.

సువ్యవస్థితమైన, పటిష్ఠమైన రాజ్యవ్యవస్థ ఉన్న వానరజాతిని కోతిమూకగా పరిగ్రహించటమూ కష్టమే!

* * *

## అధోజ్ఞాపికలు :-

1. కుశల ప్రశ్నవ్యాజంతో, భావి రాజ్య రక్షణ – దక్షతకు శిక్షణగా భరతునితో, చార్వాకమతనిరసనపూర్వక వైదికమత ప్రతిష్ఠాపకంగా ధర్మసూక్ష్మ వివేచన జాబాల్యాదులతో.... ఇలాంటి సందర్భాలు!

2. క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః (రఘువంశః 2/53).

3. చత్వారో వేదాః సాంగాః సరహస్యా బహుధా భిన్నాః. ఏకశత మధ్వర్యుశాఖాః సహస్రవర్త్మా సామవేదః, ఏకవింశతిధా బాహ్వృచ్యం, నవధాఽథర్వణో వేదః (మహాభాష్యం - పస్పశాహ్నికం)

4. **ఋగ్వేదం :-** 21 శాఖలు. కానీ అయిదు శాఖల పేర్లే అక్కడక్కడ కనవస్తున్నాయి. కొన్ని సంవదిస్తున్నాయి. మరికొన్ని విభేదిస్తున్నాయి. ఆ యా శాఖా ప్రవర్తకుల పేరున ఆయా శాఖలు వ్యవహృతాలు.

**యజుస్సు :-** కృష్ణ – శుక్ల భేదం ప్రాథమికం. వీటిలో అవాంతర శాఖల్ని గమనిస్తే – కృష్ణయజుస్సులో 12, శుక్లయజుస్సులో 15, వెరసి 27 ఉన్నట్లు తెలుస్తోంది. ఇవి కాక ఉపశాఖలు. మొత్తం యజుర్వేదం 101 శాఖాభేదాలతో విస్తరిల్లింది.

**సామ :-** సామవేదస్య కిల సహస్రభేదా భవంతి. ఎనిమిది మంది పేర్లను శాఖాప్రవర్తకులుగా పేర్కొని, వారి పేర తచ్ఛాఖలుగా పిలవబడుతూన్న 8 ప్రధాన శాఖలూ; పై వాటిలాగే సర్వత్రా ఏకరూపంగా లేవు.

**అథర్వణం :-** 9 శాఖలు. (అన్యేతు ప్రాహుః పంచదశాధ్వగం = 15)
మొత్తం మీద వేదశాఖలు 1131 లేదా 1137.

5. నానృగ్వేదవినీతస్య నాయజుర్వేద ధారిణః నాసామవేదవిదుషః శక్యమేవం ప్రభాషితుం అథర్వణస్యాధ్యయనాది నియమవహాభావాదనుక్తిః – గోవిందరాజీయం. (కి॥ 4-28).

వివేకః (సిద్ధాంత కౌముది - **4-3-90**) యత్ర సంప్రతి ఉష్యతే స నివాసః - మహాభాష్యం.

7. కపి ప్లవంగ ప్లవగ శాఖామృగ వలీముఖాః మర్కటో వానరః కీశః... (అమరకోశః) (ప్లవం గచ్ఛతీతి ప్లవగః, ప్లవంగః, ప్లవంగమః)

8. ప్లుతం గతిం గచ్ఛంతీతి ప్లవంగమాః

9. ద్విధా భజ్యేయ మప్యేవం న నమేయంతు కస్యచిత్ (యుద్ధకాండ - **11-36**).

10. అంగదునికి అంతరాంతరాళాల్లో సుగ్రీవునిపై ద్వేషముంది. హనుమ దాన్ని తొలగిస్తాడు. (కిష్కింధాకాండ. **54** సర్గ).

* * *

